శ్రీరస్తు

# రాజవంశప్రదీపిక.

ఇది

రేపల్లె తాలూకా రేపల్లె కాపురస్థులగు
మాండవాటి రామస్వామిగారి ప్రోత్సాహమువలన
శ్రీవేదాద్రి యోగానంద నృసింహ వరప్రసాదలబ్ధకవితా
ధురీణులును, శ్రీమదచల పరిపూర్ణానుభవజ్ఞులును,
గుంటూరు జిల్లా, సత్తెనపల్లి తాలూకా,
దొడ్లేరు గ్రామ కాపురస్థులు నగు

**బత్తుల లక్ష్మయ్యగారిచే**

రచియింపబడినది.

*

రెండవ కూర్పు 1000 ప్రతులు.

*

తెనాలి, జానకిరాం ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడినది.

 **1958** **2-4-0**

# విజ్ఞాపనము

ఆర్యులారా!

ఈ గ్రంథోత్పత్తికి హేతువ తమ కందరికి విశదమయ్యే యున్నది. యే నధికశాస్త్రజ్ఞుడను కాకున్నను నా మిత్రుని మనోరథంబు దీర్చుటకు నొనర్చితిని. నిందుగల కవికృత భ్రమ ప్రమాదక సకల దోషంబులు క్షమించుటకు మిమ్ముల వేడుకొను చున్నాడను.

ఇట్లు బుధజనవిధేయుఁడు

బత్తుల లక్ష్మయ్య

# విషయసూచిక

## మొదటి భాగము

## రెండవ భాగము





# ప్ర క ట న

ఈ గ్రంథకర్తగారి కుమారుడగు శ్రీ బత్తుల జగన్నాథరావు గారిని యీ గ్రంథ ద్వితీయముద్రణకు అనుమతి నివ్వవలసినదని 5, 6 సంవత్సరములనుండి ప్రార్థించుచుంటిని. సరియేననుచు కాలయాపన చేసిరి. చివరకు ది 29–3–57 తేదీన యుత్తరము వ్రాసిరి. వారి యుత్తరమును యీాదిగువ యధారీతిని ముద్రించు చున్నాను.

---

ఓం — దొడ్లేరు,

క్షేమములు. — ది 29–3–57.

శ్రీమదఖండ సచ్చిదానందస్వరూపులగు ఆరాధ్యుల పిచ్చయ్య పంతులుగారి దివ్యసముఖమునకు— దాసోహములు.

తమరు మాగ్రామమునకు శ్రీమాన్ లక్ష్మణదేశికేంద్రులవారి ఆరాధన మహోత్సవమునకు వచ్చి శ్రీ అయ్యగారిచే రచియించ బడిన "రాజవంశప్రదీపిక"ను రెండవసారి ముద్రణకు అనుమతి కోరియున్నారు. అందుకుగాను మీాకు లెటరు వ్రాస్తామని చెప్పి యున్నాము. సదరు రాజవంశప్రదీపికను యీ రెండవసారి ముద్రణ పుస్తకములో శ్రీ అయ్యగారిఫొటో వుండునట్లుగాను, యీ ముద్రణకు ఎంతమంది ద్రవ్యసహాయకులో వారిజాపితా, ముద్రించిన గ్రంథ ములలో శ్రీ అయ్యగారి సన్నిధిలో నిల్వగా కొన్నిగ్రంథములను కోరుతున్నాము. ఈ గ్రంథములు దొరకుస్థలము మీాకుగా వుండాలి. ఈసారి ఎన్నిప్రతులు ముద్రించినది, తిరిగి మూడవసారి ముద్రణకు మాఅనుమతి లేనిది ముద్రించరాదు. రిజష్టరుహక్కు మాదిగా వుండాలి. గ్రంథముఖస్థము హెడ్డింగు అంతా యిదివరకు పద్ధతిగానే యుండాలి. పైపద్ధతితో ముద్రణ జరిగేయెడల మాఅభ్యంతరము ఏమీా యుండదు. చిత్తగించవలయును.

ఇట్లు బుధజనవిధేయుడు,

(సం) బత్తుల జగన్నాథరావు.

పైన కనుపరచిన అనుమతి యుత్తరము చేరిన అనంతరము ముద్రణ వ్యయమునకు యత్నించి, భగవదనుగ్రహమున నిప్పటికి వారు కోరిన ప్రకారము సంపూర్తి గావించ గలిగితిని.

యుడవూరు.
19-9- 8,

ఇట్లు
ఆరాధ్యుల పిచ్చయ్య.
గ్రంథ ప్రకాశకర్త.

---

## సూచన

కాశీలో ప్రకటించబడెడి "యాదవ" అను హిందీపత్రిక నుండి 1958 సం॥ర జులై నెల సంపాదకీయ సంక్షిప్త సూచన.

ఉత్తర హిందూస్థానములోనున్న యాదవులలో పలుకుబడి గలవారలు కొందరు తమపేరులకు చివర "ఠాకూర్, సింహా, చౌధరీ, రావు, రావత్, ఘోష్ అనుపదములను చేర్చుకొనుచుందురు. "ఠాకుర్" శబ్దము ఈశ్వరునికి, పూజనీయునికి, క్షత్రియునికి, మంగలికి మరికొన్ని జాతులకు అర్థమిచ్చును. ఈ దేశమునకు వలసవచ్చినవారిని గుర్తించుటకు యేర్పడినది. ప్రాచీన గ్రంథములలో యాదవులకు యీశబ్దము వాడినట్లు గన్పట్టదు. కొద్దిరోజులలో రచించిన "సుఖ సాగర్" అనుగ్రంథమున శ్రీకృష్ణునికి ఠాకుర్ శబ్ద ముపయోగించిరి. అంత మాత్రమున యాదవులు నామాంతమున "ఠాకుర్" శబ్దము చేర్చుకొనుట గౌరవప్రదము కాదు.

"సింహా" శబ్దము పురాతన గ్రంథములో మనవారెవ్వరు పెట్టుకొనలేదు. మొగలు రాజుల పరిపాలన కాలమున మాత్రము గోవిందసింహా, ఆ పిమ్మట మాన్‌సింహా, ప్రతాపసింహా అని పిలువ బడిరి. సింహాము సాధుజంతువులను జంపు క్రూరజంతువు. రాజులు జమీందారులు పేదలయెడ(?)ముతో బాటు రక్తమాంసములు హరించు

నట్టివారు. అట్టి వారీ శబ్ద ముపయోగించుకొనిరి. ఈశబ్దము నుపయోగించుకొనుట సమాజమునందు గౌరవముండదు.

చౌధరీ, మహతో, మంతో, భగవత్, మండల్ మొదలగు శబ్దములన్నియు ఒకే అర్థముగలవి కొలదికాలము క్రిందట విరాదరిలో ప్రముఖులు పై శబ్దము లుపయోగించిరి. ఈశబ్దము లుపయోగించుకొనుటచే యాదవులని గుర్తించుట కష్టసాధ్యము. పశ్చిమప్రాంతములో జాట్, అహీర్, గూజర్, ఆమ్, తౌర్ జాతులు చౌధరీశబ్దము వాడెదరు. వ్యవసాయముచేయు బ్రాహ్మణులుకూడా పిలువబడుదురు. వర్తమానమున యువకులకు చాలానీచమని తోచుచున్నది. బీహార్ మంత్రి శ్రీ శివానందనప్రసాద్ మండల్ యాదవుడైనప్పటికి ఇతనిని పశ్చిమదేశవాసులగు మనవారు హరిజనుడని తలచెదరు. ఈ వాక్యములు మనకెంతమాత్రము తగవు.

రావు, రావత్ శబ్దములు గౌరవమైనవే. క్షత్రియునకు ఉపాధి పేర్లు. ఘోరఖ్‌పూర్, చప్‌రా పట్టణములయందు ఆహీర్ రావత్ అని యాదవులను బిలచెదరు. రేవాడిలో రాజులు రావ్ అనియు భీటీలో రాజులు రావత్ అనియు పిలువబడుదురు. కాని మధ్యప్రదేశ వాసులు సేవకావృత్తివలన జీవించువారు యీ పేరులతోనే పిలువబడుదురు కాన, మున్ముందు సమాజము లందీ పదము గౌరవభంగము కావచ్చును.

మద్రాసు ప్రాంతమున అనేక పేరులతో యాదవులు పిలువబడుదురు. అవే శబ్దములు యితర జాతులవారును పెట్టుకొనుచున్నారు, అందువలన యాదవులను గుర్తించుటకు వీలు కాకున్నది.

ఘోష్:- బెంగాల్ ప్రాంతమున ఘోష్‌లని పిలువబడుదురు. ఇతర జాతులవారు తరుచుగా యీశబ్దము గౌరవమని పెట్టుకొందురు. కొన్ని ప్రాచీన గ్రంథములలో మూంగేర్ నివాసియగు బుద్ధగోవుడనువాడు బ్రిటిషుపరిపాలనలో కలకత్తాయం దుండెను. గోపశబ్దము పశుపాలకత్వమును సూచించుటచే బుద్ధగోపుని అనంతరము అతని

వంశీయులు ఘోష్ శబ్దమును నుపయోగించుకొనిరి. 'శ్రీహరిపద్దేఘోష్' అను యాదవపండితుడు బుద్ధగోపుని వంశపరిశీలనకై సర్కారు జనాభా లెక్కలను చూడగా 56 కోట్ల జనాభాగలిగిన యాదవులు ఆ యా ప్రాంతములయందు పలువిధములైన బిరుదు నామములతో గుర్తింపజాలనంతటి అధోగతిగా నుండిరని పశ్చాత్తప్తుడయ్యెను.

పాఠకలోకమునకు హితమొనరించునది ఏమనగా యాదవులు తమపేరులకు చివర "యాదవ" పదము తప్పక చేర్చి పిలుచుకొనుచుండవలయునని మరియొక బిరుదు పేరు చేర్చుకొనరాదనియు, చేర్చియుండినవారు త్వరలో నవయువకులను గలసికొని ఆయాబిరుదు పేరులను మార్చి యాదవులు అనుపదము మాత్రమె వాడుక చేసికొనవలసినదని మాహితవు.

ఆరాధ్యుల పిచ్చయ్య
సంఘ కార్యదర్శి.

ఓమ్ శ్శాంతిః.



గ్రంథకర్త: "శ్రీ యదువంశోద్ధారక బిరుదాంకితు" లగు

బత్తుల లక్ష్మయ్యగారు.

వీరు (౮-౩-౩౮) తేదిన వారి స్వగ్రామమగు దొడ్లేరునందు
స్వనిర్మిత సద్గోష్ఠిమందిరమున పరబ్రహ్మైక్యముం బొందిరి.

ఏతత్ గ్రంథ ద్వితీయ ముద్రణకు ధనసహాయ మొనర్చిన దాతలు.

## మ హా రా జ పో ష కు లు

**116 - 0 - 0 యిచ్చినవారు.**

1. శ్రీ యాదవ సంఘమువారు యడవల్లూరు
2. ,, ఆరాధ్యుల పిచ్చయ్యగారు (యాదవసంఘ కార్యదర్శి) ,,

## రా జ పో ష కు లు

**58 - 0 - 0 యిచ్చినవారు.**

1 శ్రీ కర్రా రామస్వామిగారు మాజీ మున్సిపల్ కౌన్సిలర్
ల్యాండు హోల్డర్, విద్యాధరపురం విజయవాడ.

2 ,, కొమ్మనబోయిన వెంకయ్యగారు
మైనరు యిరిగేషన్ సూపర్ వైజరు, బాపట్ల.

3 ,, వేల్పుల గంగయ్యగారు
ఖద్దరుమర్చంటు, అండ్ ల్యాండుహోల్డర్, తెనాలి.

## పో ష కు లు

**25 - 0 - 0 యిచ్చినవారు.**

1 శ్రీ మైలా రామస్వామిగారు తండ్రి ఆదినారాయణగారు యడవల్లూరు
2 ,, ఆరాధ్యుల సుబ్బయ్యగారు తండ్రి బసవపున్నయ్యగారు ,,
3 ,, కరేటి యోగీశ్వరరావుగారు తండ్రి పోతురాజుగారు ,,
4 ,, కర్రా గురురాజుగారు తండ్రి కోటయ్యగారు ,,
5 ,, జడ గోపాలరావుగారు తండ్రి పిచ్చయ్యగారు ,,
6 ,, పెరుగు వీరరాఘవయ్యగారు తండ్రి పెదబక్కయ్యగారు ,,
7 ,, పెరుగు బక్కయ్యగారు తండ్రి సుబ్బయ్యగారు తెనాలి
8 ,, కర్రా చినవెంకటస్వామిగారు తండ్రి బాపయ్యగారు యడవల్లూరు
9 ,, తాడిబోయిన ముక్కంటయ్యగారు తండ్రి లక్ష్మయ్యగారు జంపని

# సహాయులు

10-0-0 యిచ్చినవారు.

1 శ్రీ నల్లగొర్ల కోటయ్యగారు అత్తోట శివారు యాదవపాలెం, హాల్ మకాం యడవల్లూరు
2 ,, పెరుగు అచ్చయ్యగారు తండ్రి సుబ్బయ్యగారు యడవల్లూరు
3 ,, మైలా కృష్ణదేవరాయలుగారు తండ్రి రామస్వామిగారు ,,
4 ,, కరేటి వెంకటరత్తయ్యగారు తండ్రి కొండయ్యగారు ,,
5 ,, కరేటి బ్రహ్మయ్యగారు తండ్రి కొండయ్యగారు ,,
6 ,, నల్లగొర్ల హనుమంతుగారు తండ్రి యల్లమందయ్యగారు ,,
7 ,, బొంతా చిననాగయ్యగారు తండ్రి పిచ్చయ్యగారు ,,
8 ,, తాడిబోయిన వీరయ్యగారు తండ్రి సోమయ్యగారు ,,
9 ,, ఆలా పెదపున్నయ్యగారు తండ్రి బొల్లయ్యగారు కనగాల
10 ,, కుర్రా నాగయ్యగారు తండ్రి వీరబ్రహ్మయ్యగారు యడవల్లూరు
11 ,, దబ్బకూటి కోటిస్వామిగారు తండ్రి మన్నెమయ్యగారు ఐలవరం
12 ,, కుర్రా బసవయ్యగారు తండ్రి రామస్వామిగారు యడవల్లూరు
13 ,, బొంతా పెదనాగయ్యగారు తండ్రి రమణయ్యగారు ,,
14 ,, కుర్రా అంకమ్మగారు తండ్రి వుయ్యూరమ్మగారు ,,
15 ,, కుర్రా లక్ష్మీపతిరావుగారు తండ్రి రామయ్యగారు ,,
16 ,, అక్కి ముక్కంటీశ్వరరావుగారు తండ్రి సుబ్బయ్యగారు ,,

# అభిమానులు.

5-0-0 యిచ్చినవారు.

1 శ్రీ కుర్రా వెంకటప్పయ్యగారు తండ్రి మల్లయ్యగారు యడవల్లూరు
2 ,, కరేటి వీరసేనరాజుగారు తండ్రి కామేశ్వరయ్యగారు ,,
3 ,, కరేటి పిచ్చయ్యగారు తండ్రి రత్తయ్యగారు ,,
4 ,, కుర్రా కనకయ్యగారు తండ్రి పున్నయ్యగారు ,,
5 ,, బొంతా వేంకటేశ్వర్లుగారు తండ్రి వెంకయ్యగారు ,,

6 ,, దాసరి వెంకటస్వామిగారు తండ్రి వెంకటప్పయ్యగారు ,,
7 ,, తాడిబోయిన బసవయ్యగారు తండ్రి నరసింహాంగారు ,,
8 ,, పెరుగు వెంకటస్వామిగారు తండ్రి అచ్చయ్యగారు ,,
9 ,, కుర్రా బసవయ్యగారు తండ్రి రాజయ్యగారు ,,
10 ,, కుర్రా వెంకటేశ్వర్లుగారు తండ్రి అంకమ్మగారు ,,
11 ,, ఆరాధ్యుల కృష్ణమూర్తిగారు తండ్రి బసవయ్యగారు కనగాల
12 ,, దబ్బకూటి వెంకటేశ్వర్లుగారు తం॥ మున్నమయ్యగారు ఐలవరం
13 ,, మరిశా ఆదెయ్యగారు తండ్రి నాగయ్యగారు ,,
14 ,, మరిశా యల్లయ్యగారు తండ్రి కోటయ్యగారు ,,
15 ,, కర్రా మల్లయ్యగారు తండ్రి పోతురాజుగారు యడవూరు
16 ,, ఆరాధ్యుల రామమూర్తిగారు తండ్రి సుబ్బయ్యగారు కనగాల
17 ,, అంగిరేకుల పృథ్వీరాజుగారు తండ్రి చంచయ్యగారు
( డ్రాయింగు, ధూళిపూడి శివారు ) అంగిరేకులవారిపాలెం
18 ,, మైలా సాంబశివరావుగారు తండ్రి యల్లమందయ్యగారు జంపని
19 ,, ఆరాధ్యుల రాఘవయ్యగారు తండ్రి గంగయ్యగారు ,,
20 ,, ఆలా ఐతమరాజుగారు తండ్రి వీరాస్వామిగారు ,,
21 ,, ఆరాధ్యుల వీరరాఘవయ్యగారు స్కూల్ మాష్టరు,
తండ్రి చలమయ్యగారు కనగాల
22 ,, ఆరాధ్యుల వేంకటేశ్వర్లుగారు బ్యాంకి మానేజరు,
తండ్రి పిచ్చయ్యగారు ,,
23 ,, ఆరాధ్యుల రెడ్డెయ్యగారు తండ్రి పున్నయ్యగారు ,,

ఉ. కారుణికోత్తముల్ పలు ర ♦ కంబుల సాయమొనర్చి ముద్రణా
భారము నిర్వహించి తమ ♦ బాధ్యత గుర్తెరుగంగ జాల్నివా
రైరి ఫలోన్ముఖంబునకు ♦ నడ్డిన విఘ్నములెల్ల ద్రోచి — యీ
తీరున నిట్టివీరి గను ♦ తింపగనౌనుగదా బుధోత్తముల్.

ఆరాధ్యుల పిచ్చయ్య, యాదవసంఘ కార్యదర్శి.
ఏతత్ గ్రంథప్రకటన కర్త.

# ప్రథమ ముద్రణ పోషకులు.

ఏతత్ ప్రబంధ ప్రశస్త ప్రథమ ముద్రితాకరణ దురంధరులును,
తదాన్వయ పోషకులును, గుంటూరు జిల్లా తెనాలి తాలూకా
యడవ్వూరుపట్టణ నివాసులగు యదువంశక్షత్రియులు.

శ్రీ కుర్రా రామయ్యగారు
,, కరేటి కొండయ్యగారి కుమారుడు
కామయ్యగారు
,, కుర్రా కొండయ్యగారి కుమారుడు
వెంకటస్వామిగారు
,, బొంతా ముత్యాలుగారు
,, తాడిబోయిన్న వీరాస్వామిగారు
,, కుర్రా నరసింహ్వాంగారు
,, కుర్రా వీరయ్యగారు
,, కరేటి పుళ్ళిక్కిగారు (వరఫ్)
బాపయ్యగారు
,, జడ తిరుపతిగారు
,, ఆరాధ్యుల పంచయ్యగారు
,, కుర్రా చినపున్నయ్యగారు
,, కుర్రా వుయ్యూరుగారు
,, తాడిబోయిన్న పెదపున్నయ్యగారు
,, తాడిబోయిన్న పిచ్చయ్యగారు
,, తోట బాలకోటయ్యగారు
,, కుర్రా నాగయ్యగారు
,, జడ వెంకటప్పయ్యగారు
,, మైలా రామస్వామిగారు
,, కరేటి క్రిష్ణమ్మగారు

శ్రీ కరేటి సోమయ్యగారి కుమారుడు
కోటయ్యగారు
,, కుర్రా పిచ్చయ్యగారి కుమారుడు
వెంకటస్వామిగారు
,, కుర్రా అంజయ్యగారు
,, కరేటి పోతురాజుగారి కుమారుడు
రామయ్యగారు
,, కరేటి రత్తయ్యగారు
,, ముప్పా గురవయ్యగారు
,, బొంతా వెంకయ్యగారు
,, కుర్రా కనకయ్యగారు
,, కుర్రా వీరబ్రహ్మంగారు
,, కరేటి వెంటయ్యగారి కుమారుడు
వీరయ్యగారు
,, కుర్రా వెంకన్నగారు, సాకీను
బందరు. ( స్టేషన్ ఆఫీసరు )
,, కుర్రా బుచ్చయ్యగారి కుమారుడు
రత్తయ్యగారు
,, కరేటి బ్రహ్మనాయుడుగారు
సాకీను జగ్గడిగుంటపాలెం
,, మైలా జంగంగారు సాకీను
సత్తెనపల్లి తాలూకా జిలాలపురము.

సీ. శృంగారమున సిమధేశ్వరు మెచ్చరు
సతి నెడ బాయు యోజ జడవారు
వీరరసస్ఫూర్తి దూకుదు రభిమన్యు
మరలుకొరుంగమి మయిలవారు
అతిభయంకరవృత్తి హరిసేదు గొవ
రికిలించినాడనియు కరేటివారు
కరుణారససమృద్ధి గాంతేయు సెంచవు
కులహంతకుండని కఱ్ఱవారు

భీభత్సరసమున భీభత్సుఁదలపరు
మురవైరితోఁడాట మువ్వారు
రౌద్రంబునను రుద్రు లక్షింపరర్ధ సం
రంభుండటంచు యారదులవారు
విస్మయమునను గోవిందుఁడు కొండయెత్తు
టను గీర్తింపరు తోటవారు
హాస్యతసౌమిత్రినైన చేకొనరింతి
ముక్కు చెక్కుటభువి బొంతవారు
శాంతిరసశ్రీ నిశాచరారిని మాయ
మూర్తియందురు తాడిబోయినవారు
యనుచుకోవిదులెల్లను వినుతిజేయ
నవరసస్ఫూర్తి యడపూరు నగరమందు
భవ్యవైభవజిత బలవైగులగుచు
పబలిరరుదుగ యాదవాన్వయులు ఘనులు !

శా. ఆరాజాన్వయు లేకమైనను ప్రియంబారంగ రావించియిం
పారన్ రాజకులప్రదీపిక కృతిన్ హర్ష ప్రచేతోలస
ద్ధీరోదారత నాలకించిభువి ముద్రింపింప లోనెంచి వి
స్తారద్రవ్యసహాయతన్ చిరయశోసంప్రాప్తులై రందరున్.

సీ. శీతాంశువంశ సంభూతుడౌ ఔరిగించు
దరహాసితాస్యసుందరవిభవము
యనురాగ హృదయుడౌటను చూపుమైచాయ
నిర్మలత్వము శౌచకర్మదెల్పు
నాగర్భలక్ష్మి ప్రభోగత ప్రకటించు
కమనీయ నేత్రపంకజయుగంబు
విష్ణుభక్తుండౌట వివరించుబో ధాత్రి
శారీరదివ్య లాంఛనవిభూతి
అమ్మహాత్ముండుచావలియన్వవాయ డద్రిధీరుండుకోటోజియనుఘనుండు
స్వాన్వయోద్ధరణీయప్రబంధమాత్మ నరసిదీనికి పూర్ణ సహాయుడయ్యె.

## వి జ్ఞా ప న ము

సీ. పౌరుషాంకంబైన పచ్చలపిడిబాకు
మొలకత్తియాయె రాజులకు నేడు
బాహుమూలస్థిత బాణాసనము
వంకకర్ర యాయెను యదుక్షత్రియులకు
పరకంఠవిదళిత ప్రకటకుఠారంబు
చిప్పగొడ్డలియాయె క్షితిపతులకు
నాణ్యమాసరిగ బనారసుశాలువ
పుల్లగొంగడియాయె భూపతులకు
తే. గీ. నరులపాలించు యదువంశ నరపతులకు
గొఱ్ఱెలను మేకలను గాచుకొనగనాయె
కలి యరిష్టంబు దైవిక కారణంబు
యదువులను జెంది నీ రీతియాయె నకటా!

సీ. సప్తసంతాన శశ్వద్ధర్మములకంటె శతగుణం బధికమహా స్వకులరతి
నిరతాన్నదానవి నిర్మలకృతికంటె శతగుణం బధికమహా స్వకులరతి
అయుతాశ్వమేధపుణ్యవిశేషమునకంటె శతగుణంబధికమహాస్వకులరతి
షోడశదానవి స్ఫూర్తిఫలముకంటె శతగుణంబధికమహా స్వకులరతి
సూనృతముకంటె నుత్తమసుతునికంటె
దలపగంగాది దివ్యతీర్థములకంటె
దేవతాక్షేత్రములకంటె ధిషణవృత్తి
దెలియ కులరతి శతగుణాధిక్య మనఘ.

## స్వా భి మా న ము

సీ. స్వాభిమానమను పంచాతురిపతియింప
వంశంబు నిర్మలత్వము వహించు
స్వాభిమానమను పంచాతురిపతియింప
త్రైవర్గఫలము పూర్తిగలభించు

స్వాభిమానమను పంచాక్షరిపఠియింప
నిహాలోకసౌఖ్య భూయిష్ట మొదవు
స్వాభిమానమను పంచాక్షరిపఠియింప
చిరయశోలాభాప్తి జెందనౌను
దలపపంచాక్షరీమహాత్మ్యము నెరింగి
శ్రవణమననవిధి ధ్యాన సాధనముల
నిరతరానందవార్ధిఁగో దిరుగరయ్య
యమకులోత్తములార! భాగ్యనిధులార!.

సీ. ఈ మంత్రమునగదా యా మహాకాశ
శబ్దంబు వీనులకు ముదంబొసంగె
నీ మంత్రమునగదా యా మహామారుత
స్పరిశంబు త్వక్సుఖాస్పదమునయ్యె
నీ మంత్రమునగదా యా మహాగ్ని స్వరూ
పంబు నేత్రానంద ఫలముఁగూర్చె
నీ మంత్రమునగదా యా మహాజలరుచి
జిహ్వాకింపైహాయి జెందజేసె
నీ మంత్రమునగదా యా మహాపృథ్వి
గంధము నాశికనుకు నానందమిడెయె
దైవసృజనంబు భూతతతతికి నిట్లు
స్వాంశమేళనసుఖము పంచాక్షరీశ్వ
రోక్తమంత్రమువలన నింపొందెగాన
స్వాభిమానంబు విడువ న్యాయంబె మీకు!.

ఇట్లు విధేయుఁడు

మూడపాటి రామస్వామి

# శుద్ధపత్రిక.

| పే. | పం. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 20 | చరితంబును | చరితంబును |
| 6 | 2 | బెరుగులను | బెరుగులను |
| 9 | 2 | మీాకు | మీారు |
| 10 | 7 | ను. న | న |
| 12 | 12 | వర్యల | వర్యలు |
| 17 | 19 | అంథకుండు | అంధకుడు |
| 21 | 21 | కొసంగి | కొసంగ |
| ,, | 18 | ముప్పదేడవ | ముప్పదేనవ |
| 25 | 25 | దుర్దర | దుర్ధర |
| 26 | 5 | వకుదేవు [లు | వసుదేవు |
| 27 | 26 | దమరునోవు- | దమరులోగోవులు |
| 28 | 27 | కన్యలు | కన్యను |
| 29 | 28 | తపోభావి | తపోవిభావి |
| 31 | 24 | స్వాలోచి | స్వారోచి |
| ,, | | దనరు | తనరు |
| ,, | 27 | పరిలి | వరిలి |
| 32 | 26 | గాఘ్నక | గాఘ్నగ |
| ,, | 29 | పలయునని | పలయునవి |
| ,, | 5 | దుగ్దంబుతో | దుగ్ధంబుకా |
| ,, | 10 | ఘున | ఘున |
| ,, | 13 | సుమరాంగన | సమరాంగన |
| ,, | 15 | ధీరుతులాయస | ధీరమతులాను |
| ,, | 17 | విశాచము | పిశాచము |
| ,, | 22 | పౌరనగరము | పౌరనగము |
| ,, | 15 | వారంతర్ధాన | దారంతర్ధాన |
| ,, | 20 | భాసిత | భాసిత |
| 33 | 5 | గోవుమహీ | గోవు మహీ |
| ,, | ,, | తీవుక్రియ | తీవుమహీరమణిప్రియ |
| ,, | 10 | కశ్యపుని కస్యపునితో | కశ్యపునితో |
| 36 | 2 | నూరు | నూరు |
| 39 | 27 | గోపికలను | గోపకులను |
| 42 | 4 | నలువది | నరువది |
| ,, | 9 | రను | రను |
| ,, | ,, | బొంది తాము | బొందించి తాము |
| 44 | 8 | దాని | దాను |
| ,, | 15 | శూద్రు దర్శ | శూద్రు దశ |
| ,, | 25 | ఆడరగ | అడరగ |
| ,, | ,, | వరంబుదరంబు | వరంబు |
| 45 | 21 | యాదువులతో | యాదవులతో |
| 46 | 28 | భాణ | బాణ |
| 47 | 5 | విప్రదక్షుత | విపద్రక్షుక |
| ,, | 9 | సంతతియై | సంతతియైన |
| 48 | 24 | వస్త్రం | వస్త్ర |
| 49 | 4 | రాజ్జగరాం | రాజజ్ఞరాం |
| ,, | 18 | బుగావించి | బులుగావించి |
| ,, | 19 | కీరినముజేయు | కీర్తనము జేయు |
| 50 | 11 | నిలుడ బహు | నిలుడని బహు |
| ,, | 12 | బొలర్ప | బెలర్ప |
| ,, | 20 | యక్రూరుభార్య | యక్రూరుభార్యల |
| ,, | 26 | గార్య | గ్రార్య |
| 52 | 22 | బ్రముఖులైన | వేనప్రముఖులైన |
| ,, | 25 | ధీమంతు | ధీమంతుడు |
| 53 | 7 | ప్రభుడజామీా | ప్రభుడజామీాఢ |
| ,, | 21 | శ్వజాతీనాం | స్వజాతీనాం |
| ,, | 26 | గలవానికై | గలవానికొలకై |
| 54 | 2 | భాగ. | భాగ. ఏకాదశ |
| ,, | 10 | రొమ్ప | రొమ్పె |
| ,, | 12 | సహస్ర | సాహస్ర |
| ,, | 28 | కాయురున్న | కాయురోన్నతు |

| పే. | పం | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 55 | 3 | విశేషంబుల | విశేషంబులు |
| 55 | 13 | ప్రజ్యుమ్నాది | ప్రద్యుమ్నాది |
| ,, | 14 | వారి గనన | వాని గనిన |
| 56 | 13 | క్రతవు | క్రతువు |
| 57 | 18 | జెప్ప | జెప్పి |
| ,, | 22 | జనుల | జనులు |
| 58 | 16 | నమ్ముపృరకు | నమ్ముపృరకును |
| ,, | 20 | జన అందరి | జనులనందరి |
| ,, | 22 | నియతి | నివాతి |
| ,, | 28 | యిప్పు డరు | యిప్పు డర్జు |
| 62 | 27 | రి వంశము | వీరి వంశము |
| 64 | 4 | సీనరుడు | ఉశీనరుడు |
| 67 | 14 | పిండమును | పిండము |
| 69 | 20 | నడమీధుని | నజమీఢుని |
| ,, | 28 | కులంబున బుట్టి | కులంబై |
| ,, | 29 | గోత్రంబున | గోత్రంబు నా |
| 70 | 8 | జన్మకృతు | సుజన్మకృతు |
| ,, | 9 | జన్మకృతుకు | సుజన్మకృతు |
| ,, | 10 | వృషదుడు | పృషతుడు |
| ,, | 11 | వృషదుని | పృషతుని |
| ,, | 13 | ద్రుష్టద్యుమ్న | ధృష్టద్యుమ్న |
| ,, | 15 | ద్రుష్టద్యుమ్న | ధృష్టద్యుమ్న |
| 73 | 11 | వీర్యుడు తన | వీర్యుని |
| 77 | 24 | శని | శిని |
| 78 | 3 | శ్యమం | స్యమం |
| ,, | 7 | యయుదాను | యయుదాను |
| ,, | 15 | 454 | 455 |
| 79 | 27 | 495 | 493 |
| 81 | 6 | శ్రుంజయు | సృంజయు |
| ,, | 7 | శ్యామనీకుడు | శ్యామకుడు |
| ,, | 9 | నకుడు | నీకుడు |
| 82 | 4 | శ్యానకుని | శ్యామకుని |
| ,, | 10 | నకుడు | నీకుడు |
| 88 | 10 | మతిసులకు | పతిగులగు |
| 89 | 16 | 706 | 709 |
| 100 | 21 | సంసానము | సంస్థానము |
| 104 | 22 | ప్రార్భవ | ప్రాగ్భవ |
| 105 | 8 | కలిసిల | కలశిలి |
| ,, | 23 | నందు యదు | నందగల యదు |
| 106 | 4 | యితని యదు | యితనికి యదు |
| ,, | 6 | ఖండ | ఖండె |
| 107 | 14 | నీకరాజు | నీకరాజు |
| ,, | 30 | వాల | వాగ |
| 108 | 6 | కేతలి | కీతలి |
| ,, | 17 | చిలకపత్రి | చిలకలమత్రి |
| 109 | 8 | కదియావుల | కదియావుల |
| ,, | 16 | చిన్న పెంగలి | చిన్న పెంగిలి |
| ,, | 22 | పశుల | పశువుల |
| 111 | 17 | వెలమకరు | వెలమకరు |
| ,, | 18 | నాచకూళ | నాచకూళ |
| ,, | 25 | భీమన్న | వీరన్న |
| 112 | 2 | వంటికొమ్మ | ఒంటికొమ్మ |
| 113 | 3 | పాలనతాత్వ | పాలనత్వ |
| 114 | 4 | శీమంతము | సీమంతము |
| ,, | ,, | నామకర్ణము | నామకరణము |
| ,, | 14 | తరచుర్ణ | తరదేశచూర్ణ |
| ,, | 30 | స్పంతి | స్వంతి |
| 115 | 16 | రాజవాగ | రాజవాగ |
| ,, | ,, | విప్రపావికర్మ | విప్రావికర్మ |
| 116 | 11 | జరాకొచ | జితాకొచ |
| ,, | 18 | కమారశ్చ | కుమార్యశ్చ |
| 117 | 8 | కర్మహీను | కర్మవిహీను |
| ,, | 19 | జన్మనా | కర్మణా |
| 118 | 2 | యును | యును |
| 119 | 9 | కలాలాదిక | కలాలాదిక |
| ,, | 29 | భజియింతు | భజియింతు |
| 120 | 6 | యాజ్వ | యాజ్వ |
| ,, | 9 | దుగ్రపు | దురుగ్రపు |
| ,, | 16 | ఆమ్నాయవధ | ఆమ్నాయపథ |
| ,, | 18 | ధర్మపత్ని | ధర్మపత్ని |

| పే. | పం | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 120 | 22 | ఆగినవ్వాకు | అనినవ్వాడు |
| 121 | 7 | కర్మాధి | కర్మానధి |
| 122 | 17 | వ్రాత్యా | వ్రాత్యాది |
| ,, | ,, | ఘటియింప కుండెనా | ఘటించి యుండెనో |
| ,, | 19 | కుండిరా | కుండిరో |
| 123 | 2 | అనచ్ఛాప్త్రాధి | అపచ్ఛాస్త్రాధి |
| ,, | 3 | కుశలత్వము | కుశీలత్వము |
| 124 | 4 | ఆయా | ఆయా |
| ,, | 7 | సతొషధీనాం | ఆతొషధీనాం |
| ,, | 19 | నిరాషధీ | నిరొషధి |
| ,, | ,, | మహాత్వం | మహాత్వం |
| ,, | 26 | కలియుగ | కలియుగే |
| 125 | 19 | ధర్మమును | ధర్మములు |
| ,, | 25 | క్షత్రియుల | క్షత్రియులకు |
| 126 | 5 | క్షత్రియా | క్షత్రియా |
| ,, | 7 | భవిష్యంతి | భవిష్యతి |
| ,, | 8 | భవిష్యతి | భవిష్యంతి |
| ,, | 13 | యేమగలు | యేమగులు |
| 127 | 3 | న పాపినః | స పాపినః |
| ,, | 5 | సర్వమ్మేచ్ఛా | సర్వేమ్మేచ్ఛా |
| ,, | 19 | ధర్మమును | ధర్మములు |
| 128 | 9 | గోమహి | గోవృషహి |
| ,, | 9 | భానింపక | భావింపక |
| ,, | 12 | పాలనగా | పాలనము గా |
| 129 | 10 | యడల | యెడల |
| ,, | 12 | కార | కాక |
| ,, | 13 | కలు | రులు |
| ,, | 28 | ధర్మము | ధర్మమును |
| 130 | 7 | వ్రాతస్తోమ | వ్రాత్యస్తోమ |
| ,, | 9 | నందననామ | ఆనందనామ |
| 131 | 23 | తాన | గాక |
| ,, | 26 | సుమణిం | సుమణిం |
| 132 | 20 | తావతెను | రావతెను |
| 132 | 27 | శ్రీహయయ్యై | శ్రీహయపై |
| 133 | 18 | రాజీసింహా | రాజీవసింహా |
| 134 | 12 | మిహార | మిహిర |
| 135 | 4 | శ్రుగచోదిత | శ్రుతిచోదిత |
| ,, | 8 | తినని | తినిన |
| ,, | 12 | శ్రుతివి | శ్రుతివిహిత |
| 136 | 12 | జరించు | జరియించు |
| ,, | 15 | గలుగ | గలుగు |
| 137 | 2 | నోషధీ | నోషధి |
| ,, | 27 | తలగొని | తలగొని |
| 138 | 6 | స్వస్థానాను | స్వభాగ్యాను |
| ,, | 24 | ఊ. హరి | ఊదా॥ హరి |
| 139 | 25 | కలి | కరి |
| 140 | 3 | మునను | మనసును |
| ,, | ,, | కష్ట | కృష్ణ |
| ,, | 16 | జనుల | జనులు |
| 141 | 25 | శపించు | శంకించు |
| ,, | 22 | నట్టివిరుయ | నట్టిరుయ |
| 142 | 3 | తనోతక | తథో గిర |
| ,, | 12 | చారముల | చారములచే |
| 144 | 6 | ప్రోక్షించిన | ప్రోక్షించి |
| ,, | 12 | భుజించుటచే | భుజించుట |
| ,, | 26 | సంసారా | సంస్కారా |
| 145 | 22 | మాగనుండుగ | మాగధుండు |
| 145 | 26 | రథసారథులవి | |
| 146 | 8 | గనాతని | నాద్య |
| 147 | 9 | నిపాదుడన | నిషాదుండన |
| 148 | 6 | ధనుః | ధనుః |
| ,, | 10 | నంతరించి | సంతరించి |
| ,, | 15 | నరికడచి | సరికడచి |
| 149 | 2 | లాగంతక | లాగంతుక |
| ,, | 23 | ముందు | ముందుగల |
| 150 | 17 | శ్రీకృష్ణుని | శ్రీవిష్ణుని |
| ,, | 28 | హూహాహూతులు | హూహూకోకలు |

| పే. | పం | తప్పు | ఒఒప్పు |
|---|---|---|---|
| 150 | 28 | పూజాధ్యులు | పూజార్హులు |
| 151 | 9 | కరుపగొల్లనిని | కురుపగొల్లఅని |
| 152 | 20 | తీరము | తీరతము |
| 153 | 26 | పసువుల | పశువుల |
| 154 | 18 | శతకము | శతకమును గురించి |
| 154 | 24 | ధర్మసూన్య | ధర్మశూన్య |
| 155 | 28 | శతకము | శతకమును గురించి |
| ,, | 24 | జెప్పెను | జెప్పను |
| 156 | 2 | మదరిపువిఫాల | మదరిభువిపాల |
| ,, | 22 | రసుబెస్త | రిలో పోతు |
| ,, | 28 | జేంద్రములోన | జాంద్రములోన |
| ,, | 24 | నడుగని | అడుగని |
| ,, | 25 | గాపు | కావు |
| ,, | ,, | నగాశేరి | కాశ్రేసు |
| ,, | 26 | పేటుల నిల్లాలు | కాటుల కిల్లాలు |
| 157 | 8 | మల చెలిమిన్ | మచెలిమిచున్ |

| పే. | పం | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 157 | 9 | గలలోగన్న | గలలోనగన్న |
| ,, | 11 | కవులు | కకవులు |
| ,, | 20 | జ్ఞానహీన | జ్ఞానవిహీను |
| ,, | 23 | పంతుళ్ల | పంతుళ్లకు |
| ,, | 24 | రచియించి | రచియించిన |
| 160 | 12 | కరచ | కరుచ |
| 161 | 8 | యొద్దకు నీ | యొద్దకుగా గీ |
| 163 | 5 | మాట | మాటలు |
| ,, | 20 | వదకుచు | వదరుచు |
| 164 | 2 | పోతుతెల్ల | పోతులకెల్ల |
| ,, | 24 | వె ట్లు | వెట్టియున్నట్లు |
| 165 | 8 | యింపబడెను | యింప వచ్చును |
| 166 | 26 | కృష్ణార్జునులు | కృష్ణాదులు |
| 167 | 10 | మానుటను | మారుటను |
| ,, | 18 | వర్ణములవారు | మిల వారిని |
| — | | — | — |

విస్తరభీతిచే విడిచిపెట్టబడిన థ, ధ, ఱ, ర, ల విపర్యయములను
పాఠకులు మన్నింతురు గాక !

శ్రీ రా ము లు.

శ్రీరస్తు | శుభమస్తు | అవిఘ్నమస్తు







# రాజవంశప్రదీపిక.

## మొదటి భాగము

శ్రీమద్గోత్రవహుం డఘాంతకుడరి శ్రేణీనిరాసుండు ని
స్సీమాజ్ఞాన తమోరణుండు కరుణాసింధుండు భాస్వద్యశో
దామోదోదయమూర్తి కృష్ణగురుఁ డార్యానందనాముండు వి
ద్యామేయుండిడు మాకు భూరితరసౌఖ్యంబుల్ ధరామండలిన్.

సీ. ప్రధిత శౌర్యుండు శోభాధురంధరుడు కోటయ్యయే బుధమౌళి
కయ్యయయ్యె, సీతాసదృశయై ప్రసిద్ధిగాంచిన వెంకమాంబిక యె
వ్వాని కవ్వయయ్యె, సంధానృసింహుడై తగ్గనెసంగిన పిచ్చయాభి
ఖ్యుం డేసూరికన్నయయ్యె, సాధుచర్యాయోగయై ధన్యయైన సుబ్బ
మ్మయే ఘనునకు భార్యయైయెయ్యె॥ నతడు శ్రీమాడపాటి వంశాంబు
రాశి, చంద్రముడు యాదవాన్వయజాతుఁ డనఘు, డైన జనుమురా
మస్వామి యర్థినొక్క, నాడు ననుజూచి బల్కె వినమ్రముఁ డగుచు.

ఉ. బత్తులవంశ వారిధికి పర్వసుధాంశుఁడు శౌర్యధైర్య స
ద్వృత్తికి మూలకందమగు వేంకటసామియు కృష్ణమాంబికా
మత్తగజేంద్రయాన పెరిమంబగు దండ్రియుతల్లిగా సుసం
పత్తి వహించినావు బుధవందిత లక్ష్మయనామ సత్కవీ!

సీ. పరిపంధి తిమిరభాస్కరుఁడు మా పెదయన్న శ్రీకళాకరుఁడు మా
చిన్నయన్న, దలప గభీరోదధులు దయాంతఃకరణులు విద్యలచతు
రుర్ముఖులు నలువురు, మాయనుజన్ములు మేటికీర్తివిశారదులుగాఁ

వెంకయాఖ్యులు మరియును, ననఘు పేరయ్య కోటయ్య గుర్వాయ
నారసింహాహ్వాయులన ప్రసిద్ధిగలిగి, సకలరాజన్యమాన్య భాస్వత్ప్ర
తాప శోభితోద్యోగవిభవ విశ్రుతవిహార, గరిమగాంచిరి మాపూర్వ
ఘనుల చరిత, మద్భుతంబందు మీ భావ మలఘుతరము.

సీ. అఖిలసుజనగోష్ఠి కనుకూలమగు మందిరవినిర్మితికి కంజభవుఁడ వీవు,
బహుశిష్యజన పరంపరలకు నపవర్గ మార్గంబుఁజూపు నిర్మలుఁడ వీవు,
శ్రీతిరునగరి శ్రీకృష్ణదేశిక పాదవనరుహాదళ మత్తబంభరుఁడవు,
మాధుర్యకావ్య నిర్మాణంబునకు పూర్వకవులఁబోలిన మహాఘనుఁడ
వీవు. యదుకులాంభోధి చంద్రుండ వరఁగ మన, వంశమున
కాదికందమై వరలు శీత, కిరణుఁడాదిగ పూర్వికపురుషవరుల కీర్తిని
వర్ణింపుమయ్య శ్రీకృష్ణపేర.

వ. అని తన మనోనిశ్చయమును దెల్ప.

మ. కులధర్మంబు పరిత్యజించి మదిలోకుల్ జూడ గన్పట్టు చా
యల సత్కర్మకలాప మాత్మనిడి గుర్వాలాప మేప్రొద్దు హృ
జ్జలజాతంబున దాల్చి నిశ్చలత మోక్షశ్రీనివర్తించు నా
కిల ధర్మంబుల బామకొల్ప హృదయం బెట్లొప్పు వర్ణింపుమా.

క. తానీ తను వింద్రియములు, గానని యధ్యాత్మబోధ కలితచిదాత్మ,
ధ్యానపరత దా దానను, జ్ఞానికి నిహచింత బంధకముగాదె ధరన్.

గీ. యెంతకాలము మదివిషయేచ్ఛ దగులు, నంతకాలము దుఃఖక్రియ
యొదలంప, నెంతకాలము నాత్మేచ్ఛ నెసగు మనము, నంతకాలము
నానందమనరె బుధులు.

శా. దేహాత్మభ్రమద్రోచి నిత్యవిలసచ్చిన్మూర్తి నేనంచు స
త్సోహంభావము నాత్మఁగీల్కొలిపి సద్యోముక్తి బ్రాపింపకన్
సాహంకారత ధర్మకర్మకుల ముఖ్యవ్యాప్తి నెట్లెంతు నే
నాహా మున్ను పరాశరాత్మజుఁను జేయంజింత బ్రాపింపదే.

క. కావున కులధర్మంబులు, బోవిడిచివిముక్తిఁ జొప్ప బూనుమనిత్యం,
బౌవిధిభౌతిక జగములు, బోవుసుమీ ధర్మకర్మములు భ్రమలగుటన్.

వ. అనిన నయవిశారదుండగు రామస్వామి నన్నుంగని ఇట్లనియె.

మ. అనఘా! మీ రిపుడానతిచ్చినది సమ్యగ్మోక్షలక్ష్యంబు గా
దనరాదార్య సుబోధమెయ్యెడ ద్రివర్గానంద మైయున్న మ
న్మనముం ద్రిప్పక వర్ణధర్మము సమంజసస్ఫూర్తి బోధించి చ
య్యన శోభించు యుగప్రచారము సముద్యత్ప్రీతి పాలింపవే.

గీ. కడగి ధర్మార్థకామమోక్షములు క్రమత, ననుభవింపంగ దగ వెల్ల
మనుజులకును, పరమపురుషార్థమంద నెవ్వరితరంబు, కోటికొక్కరు
గలరను మాటగాక.

క. ఇదికుల మిదియాశ్రమ మని, విదితంబుగ దెలియరాక వృత్తుల కన్యా,
స్పదులై శశికులజాతులు, పొదలిరి హా శ్రీని పరమబోనిధిధాత్రిన్.

చ. తలపున గల్గుసంశయము వితానముప్రశ్నలు గా ఘటించి నే
దెలిపెద నుత్తరంబులు విధించిబుధౌఘము మెచ్చకబ్బకున్
దెలుపుము శాస్త్రరీతి జగతిన్ నిజమేర్పడ మామకేప్సితం
బలవడ దెల్పగాదగిన యాప్తులుబంధులు మీరలేకదా.

క. ఏనేకాదిధారుణి, లోనంగల శశికులజులు, లోనానందాం
భోనిధిని దోలలాడరె, మానుగ నీచరితమెల్ల మదినారయగన్.

క. లోకోపకారబుద్ధిని, జేకొనుమీ కార్యమాత్మ జేయుడమున్నా,
శ్రీకృష్ణుడకల్మషుడై, బోకార్చెనె వర్ణధర్మములు గైకొనకన్.

క. అనఘ! మహాత్ముల చరితం, బును నోకాదనగ రాదుబో మన్మనమిం
దున దగిలె మిత్రవత్సల, తనుదగ దీర్పంగ బాధ్యతను బూనవలెన్.

వ. అనియిట్లు ప్రార్థించిన స్వకులోద్ధరణ హేతుచేతస్కుండగు నమ్మహా
నీయుని మనోభీష్టంబు పరోపకారబుద్ధిని నెరవేర్పందలంచి యుదధి
తరంగ న్యాయంబున సర్వంబును పరబ్రహ్మంబుగా భావించు
అస్మదంతరంగ నిశ్చయంబు వీడక శృంగార రసప్రదర్శనీయ
స్త్రీవేషధారియగు పురుషుని చందంబున స్వస్వరూపాప స్మృతి
వికారతంబొరయక పరాశర్యాది ఋషివిరచిత స్మృతులంస్మృతికిం
దెచ్చుకొని యే తదభిమాన దోషం బాపాదింపమి నిశ్చయించి

" రాజవంశప్రదీపిక " యను నామంబున శ్రీకృష్ణగుర్వర్పణంబుగ నొనర్పంబూని తెల్లనిన.

ప్రశ్న:— అయ్యా! ఈలోకంబునంగల సర్వవర్ణములయందు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర చాతుర్వర్ణంబులు వేదశాస్త్రాదికముల యందు ముఖ్యముగా నియమింపబడియుండె. అందు గొల్లలనువారు పైనాలుగు జాతులయం దేజాతివారు?

ఉత్తరము:— ఇప్పుడు నీవాడిన గొల్ల గోపాలాదిక నామంబులు వృత్తినామంబులుగాని జాతినామంబులుకావు; ఎట్లనిన. శ్లోకం॥ గోపే గోపాల గోసంఖ్య గోధుగాభీర వల్లవాః॥ అమరం॥ గోపాది శబ్దంబులు ఆరును గొల్లవాని పేర్లు. గాః। పాతీతిగోపః-గాః। పాలయతీతి-గోపాలః-పా। రక్షణే=ఆవులరక్షించువాడు, గా-సం-చష్టే-గోసంఖ్యః-చక్షిఙ్ వ్యక్తాయాంవాచి = ఆవులవిచారించువాడు, గాఃదోగ్ధీతి-గోధుక్-దుహ-పు-దుహప్రపూరణే = ఆవులపితుకువాడు, ఆసమంతాత్ - భీరాతీతి - ఆభీరః - రా=ఆదానే అంతటాభయముగలవాడు, గాః-ఆభీరః-ఈరయతీతి-ఆభీరః-ఈ-రప్రేరణే = అంతట నావులతోలువాడు, బలస్థైర్యంబులు నాతీతి-లవః = స్థైర్యములేనివాడు, గోమహిష్యాదికం వలమానా। సంక్రేశేణంతో వాంతిగచ్ఛంతీతివా. వల్లవాః వలసంవరణే-వాగతిగంధనయోః = గోమహిష్యాదుల చుట్టుకొనిపోవువాడు. అని గురుబాలప్రబోధిని. టీక॥ గోపః-గోపాలః = ఆవులను రక్షించువాడు, గోసంఖ్యః = గోవులను విచారించువాడు, గోధుక్ = ఆవులను పితుకువాడు, ఆభీరః = అంతటాభయముగలవాడు, అంతటా నావులతోలువాడు, వల్లవాః=గోమహిష్యాదులను జుట్టుకొనిపోవువాడు. అని చెప్పియుండుటచే వృత్తినామంబులని యెరుంగవలయును. జాతినామంబులవలె వృత్తినామంబులు స్థిరంబులుగావు; యేతద్వృత్తు లే జాతివారాచరించినను గొల్లలని చెప్పబడుదురు.

భాగ - దశ - పూర్వ.

గీ. గొల్లవారి బ్రతుకు కొరతనవచ్చునే, గొల్లరీతి పాల కుప్పద్రచ్చి
గొల్లలైరిసురలు గొల్లయ్యెవిష్ణుండు, చేటులేనిమందు సిరియుగనిరి.

తా॥ గొల్లవారియొక్క జీవనము తక్కువగా నెంచకూడదనియు, గొల్లరీతిగా పాలసంద్రము తరచి విష్ణుదేవుఁడును సురలును అమృత విభవమును బడసిరనియు చెప్పియుండుటచే సముద్రము తరచుటచే సురలకు విష్ణుదేవునకు వృత్తినామములు "గొల్ల" లనబడిరని తెలియఁబడె లెను. ఇదియునుగాక ఈలోకంబున నేజాతివారైనను వర్తకముచేయు చుండిన వర్తకులనియు, వడ్రంగము, కమ్మరము, అగసాల కాసీపనులచే జీవించు వారేజాతివారైనను వడ్రంగి, కమ్మరి, అగసాలి, కాసీ, బత్తులనే వృత్తినామములు ప్రశస్తముగా వాడుచుండుట మనకెల్ల రకు విశదమయ్యేయున్నది. కావున గొల్ల, గోపాలాదిక నామముల నట్లుగా భావింపవలయును.

'గొల్ల' శబ్దంబునకు (ఆంధ్రభాషార్థము)

సీ. ఎంగిలినాఁగ జెలంగు నుచ్ఛిష్టంబు గోపాలకుండొప్పు గొల్లవాడు,
గొల్లఁడుకీలారి గొల్లకిలారి పసులకాపరియనంగ జెలగుచుండు,
గోమహిష్యాదుల నామముల్ పసి తొఱ్ఱు తొడుకు పసరము నాన
డరు గోకులమ్ముమందయనగిలారమ్మునాగ శీతముపట్టు పెంటనాదనరు
చుండు, నెద్దనంగను వృషభాఖ్యయెసఁగుచుండు, వెలయు గంగెద్దు
నా దేవవృషభసంజ్ఞ, బసవడాబోతనంగ గోపతిదనర్చు, భూషిత
భుజంగ శ్రీనూత్నభూతలింగ.

తా॥ గోపాలశబ్దంబునకు ఆంధ్రంబున గొల్లవాడు, గొల్లఁడు, కిలారి, గొల్ల, కీలారి, పసులగాపరి అని జెల్లుచుండును.

భాగ - దశ - పూర్వ

శా. ఏట్టెట్రా! మనుజేంద్రచేలములు నీ కీబాడియే మీరలుం
గట్టంబోఁకుదురే పయోఘృతదధి గ్రాసంబులన్ మత్తులై
యిట్లాడంజనెగాక గొల్లరకు మీ కిట్లాడ నోరాడెడిన్
గట్టా! ప్రాణము గోలుపోయెదుజుమీ కంసోద్ధతిఁ బాలకా.

క. మారాజుసామ్మగైకొన, నేరాజులు వెరతురింత యెల్లిదమే నీ,
కీ రాజ రాజగృహమున, నీ రాజసమేల గొల్ల యొగుముతలగన్.

క. ఏతెంచిచూచి చెంగుచు, నేతులు పెరుగులును పాలనీళ్లను వేల్చన్.
ప్రీతివసంతములాడిరి, యాతురులై సరసభాషలాడుచు గొల్లల్.

ఉ. బల్లిదునన్ను భీష్మజనపాలకుమారుని జిన్నజేసి నా
చెల్లెలిరుక్మిణిన్ గొనుచు జిక్కక నిక్కపుబంటువోలె నీ
గొల్లదువోయెడిన్ రథముగూడగఁబోటులము తేజిగొల్లస
ద్భల్లపరంపరన్ మదముబాపెద జూపెద నాప్రతాపమున్.

క. గురుదేవహీనుబాలుని, గిరిభూజప్రముఖవాసు గృష్ణుననీనున్,
బరిమాణశీలకులగుణ, విరహితుజేపట్టి యింద్రమునిశిచరిగొల్లల్.

క. అప్పుడు దెప్పరమగునా, చప్పుడు హృదయములజొచ్చి సందడిపెట్టన్,
ముప్పిరిగొని పడిరెరుకల్, దప్పి ధరణి గొల్లలెల్ల దెల్లముపడగన్.

క. జాపెరము లేకయప్పుడు, గ్రేపులగో గొల్లసుతుల గృష్ణుఁడువడిగన్
గీ పెట్టన్ ద్రింగెదనని, పాపపురక్కసుఁడు నేలబడియుండె నృపా.

గీ. ఘోరదనుజు నేలగూల్చి పర్వతగుహా,వాతనున్న రాయి ద్రవ్వ్యాదన్ని
గుహజరించుచున్న గోపాలకులగాంచు, బల్లిదుండు గొల్లపల్లెకరిగె.

ఉ. వల్లవబాలుర న్నగరివాకిటికిన్ వెడలంగద్రొబ్బ్యచ్చి
గొల్లలముట్టికోల్గొనుచు గూర్చిరునినందుని గట్టుచిర్వెకిన్
దెల్లముగాగ నేఁడు వసుదేవునిజాపుహు తండ్రిగాడు డీ
డెల్లవిధంబులం బరుల కిష్టుఁడుగావకు దుగ్రసేనునిన్.

క. నాపేరున నాచిహ్నము, లేపునధరియించి తిరిగెడిది పంతమె యిం
తేపో మదిపరికించిన, నేపంతమెరుంగు గొల్లడేమిటనైనన్.

జైమినిభారతము - తృతీ.

శా. తెల్లనిపట్టెనామములు తీగెలపట్టెములుం బదంబులం
బెల్లుగజెప్పులు న్జెవులబింఛములుం మొలనున్న కొత్తకం
బల్లును వన్నెగా బెరుగు పాలును నేతులు పీకవంక శా
వల్లుధరించి శౌరిగనవచ్చిరి కొందరు గొల్లలర్థితోన్.

భారతము - అను.

గీ. కాలగేలగొల్ల కపిలదండించిన, నరకవాసమునకు నరుగవలయు,
బూనిరుతెన్న యారసి యగ్గోవు, సత్కరింప సుగతిసంభవించు.

ఇట్లుభాగవతాదులయందు 'యాదవ' వంశ్యులయిన శ్రీకృష్ణా దులను 'గొల్ల, గోపాలక' వృత్తినామంబుల వాడుటలు ప్రసిద్ధంబులై యున్నవి. —— మరిన్ని.

హరివంశము - 7 ఆశ్వా.

సీ. జలముపై భూమియు నిలమీదమనుజులు మనుజులపై మేఘ మండ
లంబు, మేఘ మండలముపై మిహిరుండు దేవ లోకంబననొప్పు
నాకంబు నాక, మేలుటకై దివిజేంద్రత్వమిచ్చి నన్నీవు ప్రతిష్ఠించి
తీశ్వరుడవు, నాకలోకముమీద నలినజలోకమా లోకంబుమీద
గోగోకమమరు, నట్టిగోలోక మేలువారైనగోవు, లనఘగోవర్ధ
నాద్రీంద్ర మశ్రమమున, నెత్తియాత్మీయసంతతి నీవుగాచు, టాత్మ
గని యంతయును మోదమతిశయిల్ల.

వ. ఆ గోవులు పితామహసహితలై యుండి భవద్గౌరవం బభినందించు
టకు నన్ను నిటబుత్తెంచిరేనును నామీద తప్పు వాయ నిన్ను
దెలచుట ముఖ్యకార్యంబుగా జనుదెంచితి.

(మరియొకవచనములో కొంతభాగము)॥ గోవులు నిన్నుగురించి
తా రాడినయవిగా జెప్పుమనిన మాటలు కొన్నిగలవా కర్ణింపుము.

సీ. పితుకుటదున్నుట పెరుగుటలోనుగా గలుగు నానావిధ కర్మములకు
నాత్మీయ సంతతులగువారినందర బనిచిలోకైక సంభరణమేమొ,
గావించుకతమున కమలాసనాదులు మమ్ముబాటింతురుమాకు నెడరు,
పుట్టినచో చక్కబెట్టితి గ్రమ్మన గోరిప్రాణదుడైన గురుడవీవు, రిత్త
యుపచారములు యాదరించినిలువ, కస్మదీయకులస్వామి యగుట
కర్థి, జేసి యజునాజ్ఞచే యభిషిక్తుగా నో, నర్ప బుత్తెంచితిని
జగన్మాన్యచరిత.

గీ. అమరకోటికి నింద్రుండవైనయట్టి, నీవుగోవులకింద్రుండ విది మొదలుగ, గోకులంబున నట్టులుకుంటిగాన, ననఘ గోవిందనామ విఖ్యాతి గనుము.

ఈ పద్యముల కన్నిటికి ముఖ్యతాత్పర్యము.

పూర్వము శ్రీకృష్ణుడు గోవర్ధనపర్వతమెత్తి గోవులపాలనంబు చేసి యింద్రుని పరాభవించుటచే స్వామినిగూర్చి దేవేంద్రుడు పలికిన మాటలేమనగా జలముపై భూమియు, నందు మనుష్యులాపైన మేఘమండలంబు, మేఘమండలంబుపై సోముండాపైని స్వర్గం బందుమీద సత్యలోకం బాపై గోలోకమున్నదనియు నట్టిలోకపాలకులు గోపాలకులనియు నీవు గోవర్ధనగిరియెత్తి ఆత్మీయసంతతి అనగా నీవంశస్థులకు గోపకులయొక్క గోవులయొక్క సంతతిని రక్షించుట కాత్మీయందలరి యగ్గోలోకంబునంగల గోవులు బ్రహ్మతోగలసి భవద్గౌరవం బభినందించుటకై యింద్రుడనైన నన్నుబుత్తెంచిన నిన్ను దెలియుట కార్యంబుగా జనుదెంచితియని వర్ణించి, తనను బుత్తెంచు కాలంబున గోవులు శ్రీకృష్ణునితో తమ పలుకులుగా పలుకుమనిన విధము. పితుకుటయు, పెరుగుటయు, దున్నుటయు, మొదలుగాగల కర్మల కాత్మీయ సంతతిచే గోలోకమును భరింపబడుటవలన మమ్ము బ్రహ్మాదులు గౌరవింపుదు రట్టిమాకు నెడరుపుట్టినప్పుడు రక్షించితివిగాన మాకు దైవంబవీ వగుటచే నస్మత్కులస్వామి వగుటకు నిన్ను నభిషిక్తుజేయుటకై బ్రహ్మయొక్క యాజ్ఞతో నింద్రుబుత్తెంచితిమని చెప్పి యాప్రకార మభిషిక్తుంజేయుట గలిగి నాటంగోలె గోవిందుడను నామంబు ప్రశస్తం బాయెనని చెప్పియున్నది. మరిన్ని,

అమరం. 613 శ్లో॥ గో మహిష్యాదికం యాదవంధనం ॥

తా॥ గోవులు యదువంశీయుల ధనమని చెప్పియున్నది.

యిందుచే యదువంశక్షత్రియులకు 'గోపాలక' 'గొల్ల' యను వృత్తి నామంబులు క్రమేణ స్థిరీకరింపబడినవి.

ప్రశ్న:— యిప్పుడు మీరు కనపరచిన దృష్టాంతర పద్యముల యందు గొల్ల, గోపాలాది శబ్దములు వృత్తి నామములుగానే వాడబడి యున్నవి గాని కొన్నిచోటుల నిందార్థమగు నీచవాచకముగా వాడుటకు కారణమేమి —

గురుబాలప్రబోధిక 462 శ్లోకం.

ఉత్త:— గోపో గ్రామేషు భూరిషు=అనేక గ్రామములయం దధికారము గలవాడు గోపుడనంబడును. గాం - భూమింపాతీతి - గోపః॥ పా - రక్షణే = భూమిని పాలించువాడు.

నానార్థరత్నమాల.

శ్లో॥ గౌః క్రతౌ వృషభే చంద్రే - వాగ్భూ - దిగ్ధేనుషిస్త్రియాస్। ద్వయోస్తురస్మి దృగ్బాణస్వర్గ వజ్రాంబు రోమసు ॥ గో - పుం - ఇది - యజ్ఞమునకును, వృషభమునకును, చంద్రునకు పేరైనప్పుడు పు. వాక్కునకును, నేత్రమునకును, బాణమునకు, భూమికిని, దిక్కునకును, స్వర్గమునకును, గోవునకును, పేరైనపుడు పుం. స్త్రీ. కిరణమునకును, రోమమునకును చెల్లును.

గోపాలశబ్దంబు బ్రహ్మయందును, విష్ణువునందును, శివునియందును, యింద్రునియందును, రాజుయందును వర్తించును. తచ్ఛబ్దం బుత్తమ వాచకంబుగా విస్తరిల్ల నైచ్యంబెట్లగును. నీచమయినయెడల గోపాల శబ్దేనవచ్చిన నామం బగుటచే తద్వృత్తిగలవారందరు నీచులే కావల యును. అట్లొప్పుకొనిన ——

భాగ. దశ. పూర్వ.

గీ. గొల్లవారి బ్రతుకు కొరతనవచ్చునె। గొల్లరీతి పాలుపువ్వ ద్రచ్చి
గొల్లలైరి సురలు గొల్లయ్యె విష్ణుండు। చేటు లేనిమందు సిరియుగనిరి.

పాలుచిలుకుటయొక్క వృత్తిచే శ్రీ విష్ణువును, సురలును గొల్లలని చెప్పబడుటచే యా విష్ణువు నాభియందుద్భవించిన బ్రహ్మయును, బ్రహ్మయొక్క ముఖమందును, భుజములయందును, నూరువులందును, పాదములందును ఉద్భవించిన చాతుర్వర్ణములును గొల్లలేకదా! గాక గోపశబ్దంబుచే త్రిమూర్తులును, దేవేంద్రుడాదిగాగల దేవతలును

గొల్లలై యున్నప్పుడు అందరిని నీచులుగా భావింపవలసివచ్చును. కావున తమను తాము నిందించుకొను వెట్టు లెంధైనగలరా? యిది యునుంగాక 'గొల్ల' శబ్దంబు గోపాలనంబున వచ్చుటంజేసి గోవులు నీచంబులైననుగదా తత్పాలకుల వృత్తినామంబు నీచంబగుట, నా గోవులయందు నీచత్వంబంగీకరించిన, గో బ్రాహ్మణైకత్వమునుబట్టి బ్రాహ్మణులు నీసులుకావలెను. నందుకొప్పుకొనిన బ్రాహ్మణాధీన మగు చాతుర్వేదంబులును, గోవులును తుల్యత్వము వహించుటచే వేదములు నీచములు కావలెను. అందుకొడంబడిన దద్ధర్మంబులగు యజ్ఞాదులును నీచంబులగు, నట్లయిన తత్ఫలానుభూతంబులగు స్వర్గాప వర్గంబులును తన్నివాసులగు దేవతలను తన్నియోగాధిపతులగు త్రిమూర్తులును నీచులుకావలయును. అట్లంగీకరించిన వేదబాహ్యులును, దేవదూషకు లనబడుదురు. అట్టివారికి వర్ణాశ్రమాచారాది ధర్మములు లేవు. గావున నట్లనరాదు. ఈ వాచకములు కొన్ని చోటుల దూష్య ములుగా నుగ్గడించుటకు కారణంబేమనిన, గోపాలనవృత్తిగల క్షత్రియు లగు శ్రీకృష్ణాదులను భూపాలనవృత్తిగల ప్రతిపక్షవాదులగు క్షత్రియుల అధికారవ్యత్యస్తములచే తిరస్కరించి పలికినవాక్యంబులుగాని మరి యొకటి కాదు.

ప్రశ్న:— యిప్పుడు సామాన్యముగా లోకమునందు వృత్తినామంబు లచే వాడబడు గొల్లలను వారే వంశీయులు.

ఉత్త:— మీరడిగినవారు రాజులుగా నెసంగవలయును.

ప్రశ్న:— వేసరపుజాతిగాని, వీసము దా జేయనట్టి వ్యర్థుడుగాని, దాసికొడుకైనగాని, కాసులుగలవాడె రాజుగదరా సుమతీ.

భాగ. ద్వాదశ. స్కంద.

కం. బలవంతు డైనవాడె । కులహీనుండైన దొడ్డగుణవంతుడగుణా
గలిమియు బలిమియుగలిగిన । నిలలోపలరాజతండె యేమనవచ్చున్

భార. ఆది. షష్ఠా.

కం. కులముగలవాడు శౌర్యము । గలవాడును,నధికసేనగలవాడును భూ
తలమున రాజనునామము । విలసిల్లగదాల్చుమూడువిధములజేర్మిన్.

ప్రశ్న:—మీరు చెప్పినరాజు లీ మూడువిధములలో నే విధమగు రాజులు.

ఉత్త:— నేను చెప్పిన రాజులు వేదశాస్త్ర పురాణాదులయందు వివరింపంబడిన ప్రధానవంశంబులగు బ్రహ్మ, క్షత్ర్య, వైశ్య, శూద్ర జాతంబులలో రెండవదియగు క్షత్రియజాతిగాని వేరువిధముకాదు. అదియెట్లులనిన క్షత్రియులలో సూర్యవంశమనియు, చంద్రవంశమనియు ద్వివిధము. అందు గొల్ల, గోపాలాది వృత్తినామంబులచే సామాన్యముగా వాడబడువారు చంద్రవంశపు రాజులుగాని మరియొక జాతివారుకారు. యీ క్షత్రియజాతికి మూలపురుషుడు చంద్రుడగుటవలన చంద్రుడు రాజగుటచే యీ చంద్రవంశ సంజాతులందరును రాజులని చెప్పబడిరి. యిది కులనామంబుగాని వృత్తినామముగాదు. మూలపురుషుడగు చంద్రునకు బుధుడును, బుధునకు పూరుడును, పూరునకు నాయువు, నాయుష్యునకు నహుషుడును, నతనికి యయాతి యాదిగాగల నారువురు కొడుకులును నందు యయాతికి యదువు మొదలుగాగల యైదుగురు కొడుకు లుద్భవించిరి. ఆ యదువంశసంజాతులగు రాజులు యాదవులనియు, యదువు రెండవకొడుకగు సహస్రజిత్తనువాని వంశజుడైన కార్తవీర్యార్జునుని కుమారుడైన, మధువునకు వృక్ష్ణుడును, యితనికి నూరువురు కొడుకులు గల రందు జ్యేష్ఠుడు వృష్టియనువాడు కీర్తిసీయుండై యితని పేర వంశంబు వృద్ధిపొందుటచే వృష్ణులనియు, వార్ష్ణేయులనియును, యాదవు లనియును వాడంబడిరి. యదువంశోద్భవుండగు భోజుడనువాని పేర వంశంబువర్థిల్లి యీ వంశమువారందరు భోజులనంబరగిరి. సూర్యవంశ క్షత్రియులయందు ఇక్ష్వాకువంశమనియు, రఘువంశమనియు మొదలైన నామములెట్లు వచ్చెనో అట్లనే యదు వృష్టి భోజాంధకాది నామంబులు గలిగినవి. గోవుల పాలించుటచే గోపాలకులనియు, గొల్లలనియు వృత్తినామము కలిగినది గావున వీర లుత్తమక్షత్రియులుగా నెరుంగవలయును.

యిందుకు ప్రమాణములు:—

భాగవత నవమస్కంధమందు చంద్రవంశక్షత్రియులని స్పష్టముగా తెలియపరుపబడియే యున్నది. గ్రంథవిస్తరణ భీతిచే నిక్కడంతగా వివరింపబడదు.

భాగ. నవమ స్కంధము,

ఆ॥ చంద్రగౌరమైన చంద్రవంశమునందుఁ । జంద్రకీర్తిశోభ జనితులైన ।
యట్టిపుణ్యమతుల నైళాదిరాజుల । నింకవినుము మానవేంద్రచంద్ర!

భాగ. దశ. పూ.

కం. తెలిపితివి సోమసూర్యుల । కులవిస్తారంబు వారి కులము ధరిత్రీ
శుల నడవళ్లను వింటిమి । కలరూపము లెల్ల మాకుఁ గనుఁ నెరఁగులుగన్.

కం. ద్విజరాజవంశవర్యుల । ద్విజరాజముఖాంబుజోపదిష్ట ప్రవేశులై
ద్విజరాజత్వము నొందిరి । ద్విజరాజాదిక జనంబు దీవింపంగన్.

తా॥ చంద్రవంశక్షత్రియశ్రేష్ఠులగు బలరామకృష్ణులు బ్రాహ్మణులచే నుపదేశింపబడి అనగా నుపనయనులై బ్రహ్మత్వమును పొంది తనియు భూసురులచే దీవింపబడినారనియు పరీక్షన్మహారాజునకు శుకుల వారు చెప్పినట్లును —

భార. హరివంశం 5 ఆశ్వా.

గీ. క్షత్రియుడనేను యదువంశసంభవుండ । దుష్టమర్దనసుజనసంతోషణ
ముల, యందుజాలెకువాడ ఫాలాక్షుగాన । నరుగుచున్నాడ కైలాస
గిరికి నిపుడు.

తా॥ యదువంశమందు జనియించిన క్షత్రియుడననియు, దుష్టశిక్షా శిష్ట పరిపాలనయందు నోపెకువాడ ననియు, శివునిజూచుట కై కైలాసమునకు పోవుచున్నాననియు, ఘంటాకర్ణుడను వానితో శ్రీ కృష్ణుడు పలికినట్లునూ —

భాగ. దశ.

సీ. భోజవంశమువారు రాజులైయుండంగ యాదవుల్ కింకరులై చరింతు
రట్టియన్వయమున బుట్టియు గసు బాలుమాలితి నీకంటె బాలిశుండు
గలడెయెవ్వడుబుత్త్రుబాలియించియిచాకృష్ణుడెక్కటితద్రాజ్యమెల్ల దాన

కొనిరి క్షత్రపట్టంబు ననుబూన్పునతని పెట్టెపునన్న పిండంబుగుడిచెదకట
యెట్లుగా పెద్దవాడవైతేమి బ్రతుకు. సిగ్గరినభోగ మొల్ల రుచించెనీకు
వారికిబంటవుగాక నీవవనిపతివె, యిట్టిరాజధర్మధ్వంసి నేనునైవ.

తా॥ శ్రీకృష్ణునిపై జరాసంధుడు యుద్ధమునకు వచ్చినపుడు కృష్ణునకు సహాయుడైన యుగ్రసేనునిగూర్చి జరాసంధు డాక్షేపించు టలో భోజవంశమువారు రాజులైయుండగ యాదవులు దాసులై వర్తించిరనియు, అట్టిభోజవంశమునందు బుట్టి రాజధర్మమును జెరచి వారికి లోబడిన నీవు రాజువేనా యని యాక్షేపించినట్లు చెప్పియుండుటచే భోజవంశమువారును క్షత్రియులని యెరుంగవలయును.

భార. హరి. ఉ త్త. 7 అ.

చ. మనుజులయందు నస్ఖలితమానస మగ్రులు రాజవంశ సం
జనితులువీరు హైహయులు శైబ్యులు వైన్యులు రాఘునాన్వయుల్
జనకులు నైషధుల్భరత సంభవులాదిగ గాసికోసలా
ద్యనుపమ దేశరాజ్య విభవాదిక సౌఖ్య కళావిజృంభితుల్.

అని చిత్రరేఖ యుషాకన్యకతో చంద్రసూర్యవంశ క్షత్రియులను కనుపర్చినట్లును —

భాగ. దశ. ఉ.

మ. ద్విజశుశ్రూషయు సూనృతవ్రతము సద్వృత్తి న్భుజాగర్వము
న్విజయాటోపము చాపనైపుణియు ధీవిస్ఫూర్తి సత్కీర్తు లీ
రజనీనాథకులప్రదీపకుల బారంజూడు పద్మాక్షి ధ
ర్మజభీమార్జున మాద్రినందనుల సంగ్రామైక పారీణులన్.

తా॥ రజనీనాథకుల ప్రదీపకులనుచో చంద్రవంశ క్షత్రియులు పాండవులని దెలియవలెను. యీ వంశము పూరునికొడుకులలో విజయుడను వానిశాఖా సంబంధమగుటచే పాండవులు దుర్యోధనాధులు చంద్రవంశక్షత్రియులని యెరుంగునది.

భార. విరా. 5 అ.

సీ. విమలవంశంబునను పుణ్యావృత్తమునను
వరలు నీతని రక్తంబు వసుమతీశ

ధరణిపై నెన్నిబిందువుల్ దొరుగ
నన్ని వర్షములుగలుగు నిందనావర్ష భయము.

వ. ఉత్తమ ద్విజశోణితపాతం బెట్లును గీడనియును —

తా॥ విరాట్రాజుచేతి పాచిక ధర్మరాజునకు తగిలి రక్తబిందువు వెల్లినప్పుడు ఇట్లు ద్రౌపది పలికినట్లును ఇందునబట్టి యుత్తమక్షత్రియు అనగా ప్రథమక్షత్రియులుగా నెరుంగవలయును. అనగా రాజ్యమేలుటచే రాజులనబడువారు కారనియు జన్మమందే ద్విజత్వము కలదనియు నెరుంగవలయును.

భార. సభా.

క. స్నాతకులు పుణ్యకర్మస । నాతనులనబరగు బ్రాహ్మణ క్షత్రియ వి
డ్జాతులయందును క్షత్రియ । జాతిస్నాతకుల మేము జనవినుతనిధీ.

అనియును —

వ. ద్వారంబున మిత్రనివాసంబును నద్వారంబున నమిత్రనివాసంబును
జొచ్చుట బాహువీర్యసంపన్నులయిన క్షత్రియులకు కర్తవ్యంబు
అనియును శ్రీకృష్ణుడు బ్రహ్మక్షత్రవైశ్యజాతులయందు క్షత్రియ
జాతివారమని భీమాదుల సంబంధించుక పలికినట్లును —

భార. సభా.

క. సురమునివరులకు వసుధా । మరులకు భక్తుడను నుత్తమక్షత్రకులా
చరితుడ నేనన నవనీ ।। ధరుడమ్మగధేశ్వరునకు దా నిట్లనియెన్.

తా॥ దేవతలకును, తాపసులకును, బ్రాహ్మణులకును భక్తుడననియు నుత్తమక్షత్రియుడననియు జరాసంధుడు శ్రీకృష్ణునితో బలికినట్లును ఇట్లనేక ప్రమాణంబులుగల చంద్రవంశక్షత్రియులకు రాజనామంబు కులనామంబై యున్నది.

ఇదియునుంగాక —

అమరం - గురుబాలప్రబోధిని టీకా.

శ్లో. మూర్ధాభిషిక్తో రాజన్యో - బాహుజక్షత్రియో విరాట్.

టీక. రాజ్యారోపణకాలే మూర్ధ్ని అభిషిక్తో - మూర్ధాభిషిక్తః. ప్రథమక్షత్రియః. తత్ప్రభవతయా - అనభిషిక్తా - అపి - మూర్ధాభిషి

క్త్రాఖ్యాః, యథాబ్రహ్మ బాహుజస్య, వంశ్యా బాహుజాస్తథై వేతి
జ్ఞేయం. రాజ్యమునకు పట్టముగట్టినప్పుడు శిరస్సున నభిషేకము జేయ
బడు పట్టభద్రుడు. మూర్ధాభిషిక్తుడు. ఇది ఆ వంశమునందు బుట్టిన
మూర్ధాభిషిక్తుడుగాని క్షత్రియమాత్రునియందును వర్తించును. ఏ
ప్రకారముగ బ్రహ్మబాహుజుని వంశమందు బుట్టినవారు బాహుజు
లనబడుదురో అలాగున నని తెలియదగినది.

రాజ్ఞః క్షత్రియస్యాపత్యంపుమాన్ రాజన్యః, జనీప్రాదు
ర్భావే, రాజుయొక్క అపత్యము రాజన్యుడు. ౨. బ్రాహ్మణః బాహో
ర్జాతు బాహుజః, బ్రహ్మయొక్క బాహువులయందు పుట్టినవాడు.
౩. క్షతత్రాయతే క్షత్రః. తస్యాపత్యం క్షత్రియః, క్షతమువలన
రక్షించువాడుగనుక క్షత్రుడురాజు, వాని అపత్యము గనుక క్షత్రి
యుడు. ౪. విరాజతే విరాట్, జ. పు. రాజృదీప్తౌ, విశేషముగా
ప్రకాశించువాడు. ౫.

ఈ వంశమునకు మూలపురుషుడు చంద్రుడగుటవలన చంద్రు
నకు విరాజితు విరాట్. జ, పు. రాట్. రాజృ. దీప్తౌ. విశేషము ప్రకా
శించువాడు గనుక సార్థకనామ మవుటచేతను. శ్లో. రాజకన్యంచ
నృపతి క్షత్రియాణాం గణేక్రమాత్. రాజక రాజన్య శబ్దములు వరు
సగా ప్రజలనేలెడు రాజులసామూహామునకును క్షత్రియజాతిమాత్రము
వారి సమూహమునకును పేర్లు. రాజ్ఞాం సమూహోరాజకం. రాజుల
యొక్క సమూహమని. గురుబాలప్రబోధిక.

అమరం. శ్లో. ద్విజరాజశ్శశధరో నక్షత్రేశక్షపాకరః. ద్విజానాం
బ్రాహ్మణానాం ద్విజరాజః. అని గురుబాల.

క్షత్రియులకు బ్రాహ్మణరక్షణ పరమధర్మమవుటచే ద్విజరాజని
సార్థకనామము చంద్రునకు గలిగినది. కాబట్టి యీ వంశజులకు రాజ
నామమును క్షత్రియనామమున్ను మూర్ధాభిషిక్తులైనను కాకపోయినను
కలిగియున్నది. మూర్ధాభిషిక్తుడు కానట్టి శ్రీకృష్ణుడు ఘంటాసురుని
తోటి, జరాసంధునితోటి తాను క్షత్రియుడనని చెప్పియుండుటయేగాక
ధర్మరాజుచేయు రాజసూయయాగమందు నుత్తమక్షత్రియుడనియు,

సర్వజ్ఞమూర్తియనియు నెంచి యఖిలరాజమండలిలో అగ్రపూజ ధర్మ రాజువలన పొందెగావున నీవంశోద్భవులందఱు రాజులుగా నెఱుంగుము.

### చంద్రవంశ వివరణము, మత్స్యపురాణము ౨౩ అధ్యాయము.

చంద్రవంశ క్షత్రియకులమునకు మూలపురుషుడగు చంద్రునకు అశ్విన్యాది యిరువదేడుగురు భార్యలుగాక లచ్చి, శినివాలి, ద్యుతి, తుష్టి, ప్రభ, కుహు, కీర్తి, వసువు, ధృత అను తొమ్మండుగురు, చంద్రుని వరించిరి. వారి పతులగు నీరజేశులు మొదలగువారు చంద్రుని కలుషించి యుద్ధముజేసి జయింపలేరైరి. పిమ్మట బృహస్పతి భార్యను నపహరించి యామెయందు బుధునిగనియె. నతనికి ఇలయందు పురూ రవుండు గలిగె, యితను చక్రవర్తి. ఇతనికి శాపవశంబున నూర్వశి భార్యయయ్యె. వీ రిరువురకు ఆయువు మొదలగు నెనమండ్రు సుతులు గలిగిరి. అందు ఆయువునకు నహుషుడు, వృద్ధశర్మ, రజి, రసుడు, విపాప్మ అను నైదుగురు పుత్రులు గలిగి అందు రజి యనువాడు నూర్వురు పుత్రులంబడసి తపఃప్రభావుండై దేవ దానవ యుద్ధమందు దేవేంద్రాది సురప్రార్థితుండై యసురుల జయించిన యింద్రుడు తనకు పుత్రప్రాయుడుగా నటించుటచే సంతసించి తన రాజ్యమంతయు దేవేం ద్రునకిచ్చి తపోవనికేగె. రజి కొడుకులు నూర్వురు తన తండ్రిరాజ్య మింద్రుడేలుట సహింపక పోరి ఇంద్రపదవియు యజ్ఞభాగములు సహా గొనిరి. పిమ్మట బృహస్పతి మాయచే ఇంద్రుడు వారల నోడించి అంతయు వహించె.

### యయాతి చరిత్రము.

ఆయువు జ్యేష్ఠపుత్రుడగు నహుషునకు యతి, యయాతి, సంయాతి, ఉద్భవుడు, పాంచి, సయాతి, మేఘసంయాతి అను నేడు గురు సుతులు గలిగిరి.

### మత్స్యపురాణము. ౨౪, ౫౦. శ్లో.

యతిర్యయాతిసంయాతి రుద్భవః పాఞ్చిరేవచ। యాతిస్మేఘ సంయాతి స్సప్తైతే వంశవర్ధనాః॥ యతియను జ్యేష్ఠుడు వైఖానసయోగి యై బాల్యంబున చనియె. రెండవవాడగు యయాతి వృషపర్వుని

కూతురగు శర్మిష్ఠయు, శుక్రునికూతురగు దేవయానియు, యిరువురు భార్యలుగ నుండి, దేవయానియందు యదువు, దుర్వసుడు యిరువురును, శర్మిష్ఠయందు ద్రుహ్యుడు, అనువు, పూరు డను ముగ్వురు పుత్రులును కలిగిరి. ఈ దేవయాని బృహస్పతి కుమార్తెయగు జయంతికి శుక్రాచార్యునియందు గలిగిన కూతురు.

యయాతి కొక కూతురున్నట్లున్నది. యెట్లనగా అష్టకుడను సత్పురుషుడు స్వర్గమునందుండి యయాతి క్రిందబడునప్పుడు మన్మాతామహుడవని యయాతిని అంతరిక్షంబున తన వచన ప్రభావంబున నిలపి రక్షించె.

యదువు మొదలగువారి వంశవివరము.

యయాతి కుమారుడగు యదువునకు సహస్రజిత్తు మొదలగు అయిదుగురు జనియించిరి. ఈ యదువంశంబున పండ్రెండవ పురుషుండగు కృతవీర్యునకు కార్తవీర్యార్జునుండు జనించె. ఇతను రావణాది యోధవీరుల పరాభవించినవాడు. సహస్రకరుడు. ఇమ్మహాత్ముని చరిత్ర మఖిలపురాణములయందు వాక్కయుయ్యే యున్నది.

యదువు రెండవకొడుకగు క్రోష్టునిసంతతిని నలువదిరెండవ పురుషుడగు సాత్వతునికి భజమానుడు, భజయుడు, దివ్యుడు, వృష్ణి, దేవావృధుండు, అంధకుండు, మహాభోజుడు మొదలగు నేడుగురు జనించిరి. అందు భజమానుని సంతతిని అయిదవపురుషునకు దేవకుడు, ఉగ్రసేనుడు అను యిరువురు సుతులు గలిగిరి. అందు దేవకునికి దేవకి మొదలగు నేడుగురు కన్యలు గలిగిరి. వారిని శూరునికుమారుడగు వసుదేవుడు పరిగ్రహించె. ఉగ్రసేనునకు కంసాదులు బుట్టిరి. పై భజమానుని వంశములోవాడే కృతవర్మ. సాత్వతుని నాలుగవ సుతుడగు వృష్ణికి అయిదుగురు సుతులు గలిగిరి. అందు కడపటివాడగు శినికి సత్యవంతుడును, నతనికి సాత్యకియు, వృష్ణిమూడవకొడుకునకు ప్రసేనుడు, సత్రాజిత్తు ఇరువురుపుత్రులు గలిగిరి. ఈ సత్రాజిత్తుయే శమంతకమణిని నపహరించెనని శ్రీకృష్ణునిపై నిందమోపినవాడు. ఇతడే సత్యభామ తండ్రి. పై శూరునకు వసుదేవాది పుత్రదశకంబును, శ్రుతకీర్తి, పృథ, శ్రుతశ్రవసాది పుత్రికా పంచకంబును కలిగె. అందు

వసుదేవుని ప్రథమభార్యయగు రోహిణికి బలరాముఁడును దేవకికి కృష్ణ సుభద్రలును కలిగిరి. వసుదేవుని సంతాన మనంతము. వసుదేవుని తోఁబుట్టువులగు శ్రుతకీర్తికి కేకయులును, శ్రుతశ్రవసకు చైద్యుఁడును కలిగిరి. పృధను దానితండ్రి స్నేహాపెంపున కుంతిభోజునకు పాలన కిచ్చియుండగా పృధ కుంతియనంబరగి పాండురాజమహిషియై ధర్మ రాజాదులం గనియె. దేవకీసుతుఁడగు శ్రీకృష్ణునకు రుక్మిణి, సత్యభామ, జాంబవత్యాది షోడశ సహస్రాంగనలు వెలసిరి. అందు రుక్మిణికి ప్రద్యుమ్నాదులును, జాంబవతికి సాంబాదులు యీరీతి కృష్ణుభార్యల కెల్లం లక్ష యెనుబదివేల తనయులు జనించిరి. వీరలందరికి మూఁడు కోట్ల నరువదివేవురు సుతులు జనించిరి. ఈ యాదవకులమంతయు నూఱున్నొక భేదంబులు గలిగి శ్రీకృష్ణునిచే ప్రఖ్యాతిగాంచె.

మత్స్యపురాణము. ౪౭ అ. ౨౮ శ్లో.

కులానాం శతమేకం చ యాదవానాం మహాత్మనాం — సర్వమేతత్కులం యావద్వర్తతే వైష్ణవేకులే॥ మత్స్యపురాణం ౨౩ అధ్యాయము మొ॥ ౪౭ అధ్యాయమువరకు పైన వ్రాసిన సంగతులు గలవు.

దుర్వసు సంతతివివరము.

యయాతి రెండవకుమారుఁడగు దుర్వసుని సంతతి యేడు తరములవరకువర్ధిల్లి తండ్రిశాపనిమిత్తంబున నక్కడనుండి భిన్నంబయ్యె. ఇతని వంశంబున యేడవస్త్రీ పూరునివంశజును పెండ్లియాడి దుష్యంతునిగాంచె. యయాతి మూఁడవకొమరుఁడును శర్మిష్ట ప్రథమపుత్రుఁడగు దుహ్యునిసంతతి తొమ్మండుగురు పురుషుల పర్యంతము వృద్ధినొందె. వారెల్ల మ్లేచ్ఛప్రభువులయిరి. నాలవసుతుఁడగు ననువుసంతతియందు నారవతరపు పురుషునియందు ఉశీనరుఁడు, తితిక్షుఁడు అను నిరువురు పుత్రులు కలిగిరి. అందు ఉశీనరునకు, శిబిమొదలగువారుదయించిరి. వారిసంతానం బనంతంబయ్యె. తితిక్షునిపరంపరను మూఁడవపురుషునకు దానవేంద్రుండగు బలిచక్రవర్తి తనవంశంబంత నశించుటచే మనుష్యయోనిని బలియనజన్మించి తనపూర్వపు భార్యయగు సుధేష్ణం గూడి ప్రసిద్ధిజెంది అంగ, వంగ, సింహాళ, పుండ్ర, కళింగులన నేవుర బ్రాహ్మణపుత్రులంబడసె. రాజునకు బ్రాహ్మణపుత్రులెట్లుకలిగిరి యనిన,

### దీర్ఘతముని జన్మాదికథ.

అంగీరసునకు, ఉచథ్యుడు, బృహస్పతి అను నిరువురు తన
యులు కలరు. అందు ఉచథ్యునకు, మమతయను భార్య వెలయు.
ఆమెనుజూచి మరిదియగు బృహస్పతి మోహించి పొందం గమకించిన
నామె నీయన్న వీర్యంబున నిప్పుడు గర్భవతినై యున్నదాన.
నాగర్భపిండ మెప్పుడు వేదము నుచ్చరించుచుండును. నీ వీర్యం
బమోఘంబు. యిప్పుడు దాని ధరింప వలనుపడదు. ఈశిశు వుద
యించిన పిదప నీయిష్టము వచ్చినట్లు జరుగగలదనియె. అనిన వినక
బృహస్పతి బలాత్కారమున నా మమతను రమించె. తద్గర్భస్థుండగు
బాలుడు బృహస్పతినిజూచి యిట్లు గర్భిణీస్త్రీని బలోద్గమనము చేయ
దగదనిన గురుడు కోపించి తనను తిరస్కరించిన కతంబున నాశిశువును
దీర్ఘతముడుగను పుట్టంధుడుగను అవునట్లు శపించె. అందుచే యా
శిశువు దీర్ఘతముడనుపేర జనించి పుట్టంధుడయ్యె. మమత గర్భంబు
నుండి గురుని రేతస్సు భూమిపైబడి తత్క్షణంబున నొక శిశువై భర
ద్వాజుడై బరంగె. ఆశిశువును గురుడును మమతయు నిరాకరించి
పుట్టినచోటనె డించిపోయిన సప్తమరుత్తులు వానింగొని చనిపాలించిరి.
యిట్లుండ నొక నాడా యాశ్రమంబున నుండెడి సురభిపుత్రుండగు
నొక వృషభము యజ్ఞోపయుక్త దర్భలం దినుచుండ దీర్ఘతముడెరింగి
దానికొమ్ములు గట్టిగా బట్టి నీవిట్టిదుష్టకృత్యము చేయదగునా? నిన్ను
విడువననియె. అందున కా యెద్దు దీర్ఘతమునింజూచి యిట్లనియె.
ఋషిశ్రేష్ఠా! నీవు కడుబలిష్ఠుడవగుటచే నేనెట్లు నీడౌదు? ఇదియునుం
గాక దినరాని పదార్థంబుల దినరాదనియు, చేయరాని కార్యంబులు
చేయరాదనియును, పొందరాని దాని పొందరాదనియు నిబంధనలు
జ్ఞానవంతులగు నరులకేకాని జ్ఞానశూన్యులును చతుష్పాదజంతువులు
నగు మాకు కాదనియె. ఇట్లది యాడిన గోధర్మంబు దనమనంబున
నిడుకొని యా వృషభమును విడచి యూరకుండి కొంత కాలము జరిగిన
పిదప తనకు కోడలుగాగల స్త్రీని పొందుచుండ యాయమ యీమడ్డి
గ్రుడ్డివాడు యడ్డెతనమున చెడ్డపనులు జేయుచుండెగాన వీని నిందుంచ
రాదని కొయ్యలచే నమర్చిన తెప్పపయి యునిచి గంగానదిని విడిచె.

ఇట్టుల నా దీర్ఘతముడు ప్రవాహము వెంట గొట్టుకొని పోవుచు నయ్యయో నేచచ్చెద నను గావుడని మొరలిడుచు నొక గట్టుజేరె, ఆ గట్టు బలిరాజపాలిత పట్టణమగుటను బట్టి బలి దీర్ఘతముని తన మందిరమునకు గొని చని బహుకాలము బహుప్రకారంబులం దనిపె. [యీ బలియను రాజు యయాతి మహారాజు నాలవకుమారుడగు అనువు వంశములో తితీక్షుని సంతానములో మూడవ పురుషునకు దానవచక్రవర్తియగు బలి తన వంశవృద్ధికై మనుష్యయోనిఁ బొందు బలియను రాజుగా జనియించె] నా యంధుడగు దీర్ఘతముఁడు బలిం జూచి నీ యాదరణకు మోదమందితి. గోరినదాని నిచ్చెద జెప్పుమన, బలి తనభార్యయందు పుత్రుల నివ్వ వేడెను. అంగన [illegible] బలి తనపత్నియగు సుధేష్ణను దీర్ఘతముని గూడుమని యాజ్ఞ చేసిన నా సుకుమారి యా ముసలివాని పొందుట కిచ్చలేక తన దాసి నాతని యొద్ద కనిచిన, దానికి యతని తేజంబున కక్షీ, కాండీ అను నిద్దరు పుత్రులు కలిగిరి. అంత కొంత కాలమునకు బలి వారిద్దరుచిన్నవాండ్రు తనభార్యకు బుట్టినవారు కారనియు, దాసియగు శూద్రస్త్రీకి బుట్టినవారనియు దీర్ఘతమునిచే నెరింగి మరల నొకనాడలంకరించి సుధేష్ణను నమ్మునిపాల కనిచె. ఇమ్మాడ్కి వచ్చిన సుధేష్ణదిక్కు ముఖంబు జేసి యమ్ముని యిట్లనియె. నీవు తొలుత నను దాక ససహ్యపడితివిగాన నిపుడు నిను స్పృశింపను. నీవు దధిమిశ్రిత లవణమును నా మేనంతయు పూసి దానిపై మధువునుబూసి నాకితివేని పుత్రలాభంబు గలుగు ననియె. దాని కా మానినియు చేయునది లేక దీర్ఘతముడు చెప్పిన పెరుగుప్పు తేనెల నాతని వంటి కంటించి యాతని మేనెల్ల నాకెనుగాని యసహ్యమున నపానస్థలంబు నాకదయ్యె. అందున కా ఋషి దాని కిట్లనియె. నీవు గుదము నాకనందున నీకు గుదము లేనిపుత్రులు కలుగుదురు అనిన, నా వనిత ప్రొక్కి క్షమింపుమన నొప్పక తప్పదనియె. పిమ్మట దాని శరీరమంతయు తడవిచూచి, యపానస్థానంబు లేకపో యిన నేమి? నా స్పర్శచే దివ్యప్రభావులగు సుతులు కలుగుదురనియె. అంత నంధుని వీర్యంబున సుధేష్ణయందు బలి, అంగ, వంగ, సింహక, పుండ్ర, కళింగులను నేవుర బ్రాహ్మణపుత్రులం బడసె. అంత సురభి

దీర్ఘతముని పాలి కేతెంచి నీవు మా గోధర్మంబు ప్రమాణంబుగా గైకొని యనుష్ఠించితివి గావున బృహస్పతి శాపనిమిత్తంబున బాపరూపంబను నీ యంధత్వంబు మాపెదనని యాతని శరీరము నాఘ్రాణించి శాపపాపంబు వీల్చిన నతండు దివ్యయవ్వనవంతుండయ్యె. తన యంధత్వమును బాసి (గోతముడను) నాఖ్యచే తేజరిల్లి గిరివ్రజ పర్వతమునకు తపము జేయ నరిగె. అతనికి దాసీయందు బుట్టిన కక్షీనగా నతని వెంట నగ్గిరి కరిగి యందు ఘోరతపము జేసి తన శూద్రత్వము బాసి బ్రాహ్మణుండయ్యె. కావున గోతము డాతని (అనగా బ్రాహ్మణుడైన కక్షీని) తన సుతునిగా గొనిన నతనికి గూశ్మాండు గౌతములు అను పేరుగల సుతులు కలిగిరి. యిక పైన జెప్పబడిన బలిపుత్రులలో నంగునివంశంబున భారతయుద్ధమునకు ప్రసిద్ధుడగు కర్ణుడు ముప్పదారవ పురుషుడును, ముప్పదేడవవాడు సూతుడను పేరుగలవాడు, కర్ణునకు వృషసేనుడు కొడుకును, వృషసేనునకు వృషసేని యనువాడును కలిగె. యయాతి నాలవసుతుడగు పూరునిసంతతిని పదునాలవ పురుషుడగు (దుష్యంతుడు) యయాతి రెండవకుమారుడగు దుర్వసుని సంతతిలో యేడవస్త్రీ జారునివరించిన దుష్యంతుడు కలిగె. ఇతడు శకుంతల యను కాంతను యేకాంతంబున పొందిన భరతుండు జనించె. ఆ భరతునకు పుత్రులు లేక మరుత్సోమము అను యజ్ఞము చేయ మరుత్తులు సంతసించి పూర్వము అన్నభార్యను బృహస్పతి పొందినపుడు వెడలిన వీర్యమువలన బుట్టిన భరద్వాజుని భరతున కొసంగి అవితథమహారాజనబరంగి ద్వ్యాముష్యాయణులను బ్రాహ్మణులకును, కాలీనులను క్షత్రియులకును తండ్రియయ్యె. నితనివంశజులెల్ల బ్రాహ్మణాధికారంబును, క్షత్రియాధికారంబును కలిగి వెలసిరి. ఈ భరతునకు నేడవపురుషుడగు శిబికి శైభ్యులను రాజులును, గర్గ్యులను బ్రాహ్మణులుం గలిగిరి. పండ్రెండవవాడగు హస్తి తన పేర హస్తినాపురి నిర్మించె. ఇతనికి అజామీఢుడు మొదలగు పుత్రులు జనించె. ఆ యజామీఢుని భార్యలలో కేశిని యనుదానికి కణ్వమహాముని జన్మించె. అమ్మహాత్మునికి మేధాతిథి గలిగె. అతని యన్వయజులెల్ల కాణ్వాయనులని బరంగుచు బ్రహ్మ క్షత్రియాధికారంబుల రెంటిం గల్గియుండుదురు.

అయ్యజామిాళుని రెండవ భార్యయగు ధూమిని కొడుకు సంతతిలో నిరువదెనిమిదవనాడగు జనమేజయుడనువాడు సంతతిలేక వేయి సంవత్సరములు స్థాణుత్వమున తపము జేయుచున్న ఉగ్రాయుధడను సూర్యవంశజుని పుత్రునిగాగొని దాయాదులను దోలి ధర్మసిక్ర్పచే జ్ఞానము బొందె. అజామిాళుని మూడవభార్య సంతతిని ముప్పదితొమ్మిదవ పురుషుండగు కృతుడనువాడు సామవేదము పఠించె. అజామిాళుని నాలవసతియగు నీలిని యనుదానికి నీళుడు కలిగె. అతని సంతతిని నాలవవానికి అయిదుగురుపుత్రులు కలిగి అయిదు దేశంబు లేలిరి. వా రేలిన దేశములే పాంచాల దేశము లందురు. ఆపాంచాలురిలో నొకిడగు ముద్గలునకు మౌద్గల్యులుపుట్టె యీాయన్వజులగు మౌద్గల్యులందరును గార్గ్యాయనుల చందంబున బ్రహ్మ క్షత్రియాధికారంబులు గల్గి యుందురు. ఆ ముద్గలునకు బ్రహ్మిష్టియు నతనికి వంధ్యాశ్వుడు నతనికి దివోదాసుడను సుతుడును అహల్యయను కన్యకయును గలిగిరి. అందు దివోదాసునకు మిత్రాయతి,మైత్రాయనుడు అను తనయులు జనించిరి. అందు మైత్రాయనునకు మైత్రేయుడు కలిగె. ఆ యహల్య గౌతముని భార్యయై శతానందుని గనియె. శతానందునకు సత్యధృతియు ననుకొడుకు గలిగె. ఈ సత్యధృతి యొకనాడు జలమధ్యంబున నొకయచ్చరకన్నెం గని మోహించిన నతని యమోఘవీర్యము వెడలి భూమిపయింబడి యొకపుత్రుడును, నొకపుత్రికయు నయ్యె. వీరలే కృపాచార్యులు కృపియనుస్త్రీ. అట్టి చిన్నవాండ్రా కొలనుగట్టున నుండ శంతనుండు గని తనపురికి గొనిచని వారిం బెంచె. అజామిాళుని ప్రథమభార్యయగు ధూమిని సంతానతృప్తిలేక తపంబున నజామిాళునిమెప్పించిన నతండు దానికి క్షత్రుడను పుత్రుని కలుగంజేసె.

ఆ క్షత్రునకు సంవరణమునియు, నతనికి కురువును గలిగిరి. ఆ కురువు ప్రయాగాది దేశంబులేలుచు పెద్దతపముంజేసెగాన వ_త్తలము కురుక్షేత్ర మనబరగె. అతని వంశజులే కౌరవులు. ఆ కురువుకు నాలవ పురుషుడు చైద్యుడును వానికి బృహద్రథుడు, యజువు మొదలగు నేడ్గురు సుతులు గల్గిరి. అందు బృహద్రథుని సంతతిని తొమ్మిదవవా

డగు బృహద్రధునకు, జరాసంధుడును, యితనికి సహదేవుడును. వీరలు మగధ దేశాధీశులు.

ఆచైద్యుని అయిదవ సుతుడగు యజుని వంశంబున పదునాలవ వాడగు ప్రదీపునకు దేవాపి, శంతనుడు, బాహ్లికుడు అన ముగ్వురు సుతులుజనించి వారిలో దేవాపి కుష్టురోగముచే మునియై తపంబు కేగె. బాహ్లికునకు బాహ్లీశ్వరులన నేడుగురు పుత్రులు కలిగిరి. శంతనుడు రాజ్యముబూని యధిక ధార్మికుడై యుండె. ఆశంతనుడు గంగనువరించి దానియందు భీష్మునిగాంచె. నాశంతను సుతుడగు విచిత్రవీర్యుని భార్య యందు వ్యాసులు ధృతరాష్ట్రుని, పాండుని; దాసియందు విదురునిం గాంచె. అందు ధృతరాష్ట్రునకు నూరుగురు సుతులు గలిగిరి.

పరీక్షిత్తు కుమారుడగు జనమేజయుడు యాగముజేసి యందు యాజ్ఞవల్క్యుల బ్రహ్మగా నియమించె. అదిజూచి వైశంపాయనుడు సైరింపక జనమేజయుని మాట చెల్లకుండునట్లును నతనికి యజ్ఞాధికార ముండకుండునట్లును శపించె

ప్రశ్న:— శ్లో॥ బ్రాహ్మణః। బాహోర్వ్రాతః॥ బాహుజః॥
బ్రహ్మబాహువులయందు బుట్టినవారు ప్రథమక్షత్రియులు రాజులు అనియును ప్రమాణములుండగా నీచంద్రవంశజు లెట్లగుదురు?

ఉత్త:— ప్రపంచమందు సూర్యవంశ చంద్రవంశ క్షత్రియులని చెప్పబడి యున్నది గాని వీరుగాక బ్రహ్మయొక్క బాహువుల యందు జనించినవారిని, వారి వంశమును కానము. సూర్యవంశ మునకు సూర్యుడును, చంద్రవంశమునకు చంద్రుడును మూలము.

వారి జననములు.

భార - హరి - సూర్యజననం.

క. తనహృదయేశ్వరు గశ్యపు ననుకూల ప్రీతిగొలిచి యదితి యతని పా వన తేజంబున దాల్చెను దనయస్థూలుగ సహస్రధాము మహాత్మున్.

తా॥ కశ్యపప్రజాపతి అదితియందు సూర్యుని గాంచిన అదిత్యు డనంబరగె ననియు జెప్పియుండుటచే సూర్యవంశమగు క్షత్రియ వంశము బ్రహ్మయొక్క బాహువులయందు జనించినట్టు తోచదు.

చంద్రుని జననం. భాగ - నవ.

సీ. ఒక వేయి తలలతో నుండు జగన్నాథుని బొడ్డుతమ్మిని బ్రహ్మబుట్టె మొదల, నతని గుణంబుల నతసి బోలెడు దక్షుడత్రియు సంజాతుడయ్యె నత్రి, కడకంటి చూడ్కుల గలువలసంగడీ డుదయించె విప్రుల కోమధులకు, నంబుగర్భములకు నజునిపంపున నాథుడై యుండి రాజసూయంబుజేసి, మూడులోకములను గెల్చి మోదమునను జనె బృహస్పతిసతి జారజారుమూర్తి, దార నిలుపొచ్చి గొనిపోయి తన్ను గురుడు, వేడునందాక నయ్యింతి విడువడయ్యె.

తా॥ సహస్ర శిరస్సులతో ప్రకాశించు నారాయణమూర్తి యొక్క నాభికమలమందు బ్రహ్మజనించె ననియు నతనికి గుణతుల్యులగు దక్షుడు, అత్రియు జనించెననియు అత్రియొక్క కడకంటి చూడ్కులను జంద్రుడుదయించి విప్రులకు, యోమధులకు, మేఘములకు బ్రహ్మపంపున నాథుడై యుండి రాజసూయ యాగముజేసి త్రిజగ విజయం బొనర్చెననియు జెప్పబడి యున్నది. ఇట్టి సూర్యచంద్రు లెవ్వరు బ్రహ్మ బాహువులయందు బుట్టినట్లు కనుపడదు. బ్రహ్మ బాహుజులు కారసిన వేదవిరుద్ధం బగుటయెగాక క్షత్రియత్వంబునకు హానివాటిల్లును. కావున రజోగుణ విశ్వమూర్తియందు రెండవ జాతి యని అన్వయించవలయును. మరిన్ని బాహువులచే జీవించువా రవుట వలన బాహుజులని చెప్పబడియున్న దింతియెకాని మరియొకటి కాదు.

ప్ర:— భగవద్గీత॥ మోక్షసంన్యాసయోగం ౧౮ అధ్యాయం.

శ్లో॥ శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్య పలాయనం । దాన మీశ్వర భావశ్చ క్షాత్రం కర్మస్వ భావజం॥

తా॥ శూరత్వము, తేజము, ధైర్యము, సామర్థ్యము, యుద్ధమునందు పారిపోక నుండుట, దానము, ప్రభుత్వము ఇవి క్షత్రియులకు స్వభావమువలన బుట్టినకర్మలు అని చెప్పియుండగా నీ చంద్రవంశ క్షత్రియులు స్వకుల ధర్మంబగు ప్రభుత్వమును విడచి పశుపాలనత్వం బెందు కంగీకరించిరి ?

ఉత్త:— పూర్వయుగమందు దేవాసురయుద్ధంబున మరణించిన రాక్షసులు ద్వాపరయుగంబున చంద్రవంశ క్షత్రియులై జనియించి

సర్వభూఖండంబులాక్రమించి మదించి ధర్మంబుదప్పి దుష్టప్రవర్తనంబుల లోకంబుల బాధింప, భూదేవి దద్దోషభారంబు భరియింపం జాలక బ్రహ్మాదిదేవతలం గూడుకొని శ్రీవిష్ణుని వేడిన, కరుణించి తద్భూభారనివారణార్థము తానును, దేవతలును, యదువంశంబున రాజులై జన్మించెదమని జెప్పి, తత్ప్రకారము జనించి కంసాది రాక్షసుల దర్పంబున కాగజాలక రాజ్యపాలిత వృత్తులు వదలి స్వకుల ధర్మంబు దప్పనీక గోపాలనం బొనర్చిరి.

ఇందుకు దృష్టాంతంబు లుగ్గడించెద వినుము.

భాగ. ద. పూ.

సీ. రాజేంద్రవినుతొల్లి రాజలాంఛనముల వేలసంఖ్యల దైత్యవిభులుదన్ను
నాక్రమించిన భారమాపజాలక భూమి గోరూపియై బ్రహ్మ జేరబోయి
కన్నీరుమున్నీరుగా రోదనము జేయ గరుణతో భావించి కమలభవుడు
ధరణినూరడబల్కి ధాత్రియు వేల్పులు గదలిరా విష్ణునిగాన నేగి
　　పురుషసూక్తంబు జదివి యద్భుత సమాధి
　　నుండ నొక మాటవిని వారిజోద్భవుండు
　　వినుడు వేల్పులు ధరయు నేవిన్నయట్టి
　　పలుకు వివరింతునని ప్రీతిపలికె దెలియ.

క. యాదవకులమున నమరులు। మేదినిపై బుట్ట జనుడు మీయంశములన్
　శ్రీదయితుడు వసుదేవున కాదరమునబుట్టి భారమంతయు బాపున్.

భాగ. ద్వితీ.

చ. నరకము రప్రలంబయవనద్విపముష్టిక మల్లకంస శం
　బర శిశుపాలపంచజన పౌండ్రక పిప్పలదంతవక్త్ర వా
　నర ఖర సాల్వవత్స బకనాగ విదూరక రుక్మికేశి
　దుర్ధర వృషధేనుక ప్రముఖ దుష్టనిశాటులద్రుంచె వ్రేల్మిడిన్.

ఈపద్యమందు కనుపర్చిన నరకాసురాది రాక్షసులను యదువంశమునందు శ్రీకృష్ణుడు జనించి సంహరించినాడనియు.

భారతం. అర. 6. ఆ.

క. క్షితిసంళప్తకులనగా। శతలక్షసహస్రసంఖ్య జనియించిరి ద
　ర్పితులయిదనుజులు తద్బల। తతిచే సమరముననింద్రతనయుడుచిక్కన్

భాగ. ద. పూ.

సీ. ఒకనాఁడు నారదుండొయ్యన కంసునియింటికి చనుదెంచి యేకతమున
మందలోపలనున్న నందాదులునువారిభార్యలుపుత్రులుబాంధవులును
దేవకిమొదలగు తెరవలు వసుదేవుఁడాది గాఁగల సర్వయాదవులును
సురలుగాని నిజంబు నరులుగారని చెప్పి కంసుండనీవురక్కసుఁడవనియు
దేవమయుఁడు చక్రి దేవకీదేవికి। పుత్రుఁడై జనించి భూతలంబు
చెరుపబుట్టినట్టి చెనటి దైత్యులనెల్ల।జంపుననుచు చెప్పిచనియె దివికి.

క. నారదుమాటలువిని పెల్లారాటముబొంది యదువులనిమిషులనియుఁ గా
నారాయణ కరఖడ్గవి। దారితుఁడగు కాలనేమి దానని మరియున్.

భాగ. ద. పూ.

సీ. అవనీశవినుద్రోణుడనువాఁడువసువులయందుముఖ్యుఁడుధరయతనిభార్య
వారినిద్దరి బ్రహ్మవసుధపై జన్మించుఁడంచు బంపిన వారలతని జూచి
విశ్వేశ్వరుండైన విష్ణుసేవారతి మాకిచ్చితేనియు మహిజనింతు
మనవుఁడు నట్లుగా కనియె వేల్పులపెద్ద యాద్రోణుడీ నందుఁడై జనించె
ధరయశోదయయ్యె దనుజేంద్రవైరియు। కములగఱ్ఱుమాటగారవించి
తల్లిదండ్రులంచు దగవారి మన్నించె। నధిక భక్తితోడ నలరిరిట్లు.

పైమూడు పద్యములకు ఒకే తాత్పర్యము.

ఒకకాలమందు నారదుండు కంసునికడ కేతెంచి రహస్యముగా నందాదులును వారి పుత్రమిత్రకళత్రాదులును దేవకి మొదలగు గోపికలును వసుదేవుఁడాదిగాఁగల సమస్తయాదవులు దేవతాంశసంభూతులు గాని నరులుకారనియు దుష్టరాక్షస శిక్షణకై దేవకీదేవికి నారాయణుండు జనియించు ననియును, నీవు కాలనేమియనెడు రాక్షసుండవనియు వసువులలో పెద్దవాడగు ద్రోణుడను వానిని చతుర్ముఖుడు భూలోకమున జనించుమనిన నతడు విష్ణుసేవారతి గలిగిన జనింతుననన, విధియొడంబడుటచే నతనిమాట గారవింపదలంచి శ్రీవిష్ణువు ద్రోణుడను నందునిచేతను ధరయను నతనిభార్య యశోదచేతను కృష్ణుడై పోషింపబడెననియు, నారదునిచే దెలిసికొని చింతించెనని చెప్పియున్నది. గావున యదువంశ్యులగు క్షత్రియులు దేవతాంశులనియు కంసాదులు రాక్షసాంశులనియు నెరుంగునది.

ఇంకను కంసునిచే యాదవాదులు విదేశీయులైనందుకు — భాగ. ద. పూ.

వ. తదనంతరంబ తొల్లి కంసభీతిచే విదేశీయులై కృశియింపు చున్న యదు, వృష్ణి, భోజ, మరు, దశార్హ, కుకుర, అంధక, ప్రముఖు లగు సకలజ్ఞాతి సంబంధులరావించి చిత్తంబులలర విత్తంబులిచ్చి వారి వారి నివాసంబులనుండ నియోగించె. నివ్విధంబున.

హరివంశము ఉత్తరభాగము - ౨ ఆశ్వాసము

సీ॥ భోజవంశమువారు రాజులై యుండంగ యాదవుల్ కింకరులై చరింతు రట్టి యన్వయమున బుట్టియు గడుబాలుమాలితి నీకంటెబాలిశుండు గలడెయెవ్వడుబుత్త్రుబాలియించియాకృష్ణుడెక్కటితద్రాజ్యమెల్ల దాన గొనిరిత్తపట్టంబు నినుబూన్పనతనిపెట్టెడు నన్నపిండంబు గుడిచెదకట యెట్లుగా పెద్దవాడవై తేమి బ్రతుకు।సిగ్గఱిన భోగమెట్లురుచించెనీకు హరికి బంటవుగాక నీ వవనిపతివె। యిట్టి రాజధర్మధ్వంసి నేనుసైప.

ఇట్లు కంసవధానంతరము శ్రీకృష్ణుకు కంసునిచే రాజ్యవిభవా దులు వదలి పలాయనులైన యదువృష్టి భోజాంధకాది చంద్రవంశ క్షత్రియులను యథాస్థానంబున నుండ నియమించి జ్ఞాతి పోషణంబు జేసెననియు కంసుడు రాజ్యముచేయు కాలమున యాదవులు దాసు లయి వర్తించిరనిచెప్పి యుండుటచే దుర్మార్గులగు కంసాదులచే నుత్తమ క్షత్రియులకు కాలవశంబున నిట్టి విదేశీయత్వము రాజ్యవైభవ విఫల త్వము ఘటిల్లుటచేత క్షత్రియులైనవారికి గోపాలనంబు భూపాలనంబు మాడ్కి స్వకుల ధర్మంబగుటచే రాజధర్మ విరుద్ధవృత్తులకు లోబడక గోపాలనత్వం బంగీకరించిరి.

గోపాలనంబు క్షత్రియులకు పరమ ధర్మంబైనందుకు దృష్టాంతము. భాగ. ద. పూ.

మ. అమరశ్రేణికి నెల్ల జక్రిముఖరుం డాచక్రిధర్మంబునం
దమరు న్గోవులు భూమిదేవులు దితిక్షామ్నాయకారుణ్య స
త్యములున్ యాగ తపోదమంబులును శ్రద్ధాశాంతులున్ విష్ణుదే
హము లిన్నింటిని సంహరించిన నతం డంతంబునుం బొందెడిన్.

తా॥ దేవతలందరికి విష్ణువుకర్తయనియు ఆవిష్ణువుధర్మంబునందు దేవతలు, గోవులు, భూమిదేవతలు, దీక్షలు, ఆమ్నాయములు, భూత

దయయు, సత్యము, యజ్ఞములు, తపమును, అంతరేంద్రియనిగ్రహం బును, శాంతంబును నివియన్నియు విష్ణుని దేహమని చెప్పియుండుటచే (నావిష్ణుః పృథివీపతిః) యను న్యాయంబున నతని దేహసంబంధమైన ధర్మములను రక్షణ చేసికొనకున్న రాజైన వానికి విపత్తు కలుగును. కనుక గో బ్రాహ్మణాది రక్షణంబు క్షత్రియులకు పరమధర్మంబై యున్నదిగాక.

భార. అను. 2 ఆ.

క. నీవును నవధానముతో। గోవుల మన్నింపు పాత్రకోటి కొసగు త
త్సేవిత పుణ్యాచరితము। లావెరవుగ బోల వెన్నియైన గుమారా.

తా॥ నీవు గోవుల నెక్కుడుశ్రద్ధతో రక్షించుటయు పాత్రత గల దానము చేయుటయు ముఖ్యము. ఆ పుణ్యమునకు సరియైన పుణ్యము లెన్నియైన కావని భీష్మాచార్యుడు ధర్మరాజున కెరిగించె.

భాగ. స.

గీ. శుద్ధసాధులందు సురలందు శ్రుతులందు
గోవులందు విప్రకోటియందు
ధర్మపదవియందు దగిలి నాయందు వా
డెన్నడలుగు నాడె హింసజెందు.

అని యిట్లు దేవతలతో నారాయణు డనుజ్ఞ యిచ్చినట్లును.

భాగ. ప్రథమ.

క. దేవతలకు ఋషులకు పితృ। దేవతలకు నాకు నీకు ధీరులకును
నానావర్ణాశ్రమములకును।గోవులకును బాధయనుచు గుందెదననఘా.

ఇట్లు గోరూపిణియగు భూదేవితో ధర్మదేవత పలికినట్లును.

భారతము. అను. 3 ఆ.

గ్రంథవిస్తరణభీతిచే గోప్రభావమందు ముఖ్యతాత్పర్యము.

పూర్వంబున విశ్వకర్మ తపోనియతుండై యజ్ఞార్థము తన మనో వృత్తిచే కామరూపిణియగు సురభియను కన్యలు పురుషుని సృజియిం చిన నా సురభింజూచి పురుషుండు మోహితుండై యార్తినొందుట జూచి మార్తోభవయని యతని యార్తి మాన్పుటచే మార్తాండుండని

యతనికి నామంబిడి యా సురభిని యాతని కిచ్చిన యయ్యీశ్వరువురకు ప్రభవించిన సౌరభేయాకులంబు యానలతకు జనించిన యపత్యంబులు యాగాపవర్గ క్షీరజనకంబులై తనలోకంబున కుపరిలోకంబున వర్తింప బ్రహ్మ వరంబిచ్చి యయ్యీశ్వరువురకు ప్రభవించిన సౌరభేయాకులంబు సురాసుర ప్రముఖాఖిలజనంబులకు నమస్కారర్హంబును సపర్యాభాజనీయంబునై రాజిల్లునని జెప్పె. నమ్మార్తాండునకు యేకాదశరుద్రులు నట సౌరభేయంబగు గోకులంబు జన్మించె.

సీ. ఆననంబునను జిహ్వను శృంగముల బలనైరి । రంధ్రంబుల మారుతుండు । కకుదంబునందు శ్రీకంఠుడు పదములయందు మరుద్గణమనఘు కుక్షి । వహ్ని చన్నుల సరస్వతి పేడపంచితమున లక్ష్మియును గీర్తియును గ్రమమున । రుధిరంబునందు జంద్రుడు హృదయంబున భగుడను దేవత పాలవేధ । వెంట్రుకలయం దనుష్టానవితతి దోక ధర్ము డక్షుల సూర్యుండు చర్మమున ద । పంబు సిద్ధి తేజము సంధిపట్ల సిద్ధులునికి గలదట్టి గోవు నేమనగవచ్చు.

ఈ ప్రకరణమందే మరికొన్ని పద్యముల తాత్పర్యం.

మరిన్ని సుమిత్రుడను మునిచే పాలింపబడు గోవులుకొన్ని గోలోకధేనువులచే హవ్యకవ్యాతిథి పూజనంబులాదిగాగల పుణ్యకర్మంబులకు యోగ్యంబులగుపాలు మీరు కురియకుండుటచే గోలోకార్హులు కారని నిందింపబడి రంతిదేవుని యధ్వరోపయోగముగా శరీరంబులర్పించి యధ్వరోపయోగార్హతగలిగి యగ్గోవులు కొన్ని భూలోకంబునకు జనినట్లును దేవతలొక కాలంబున డాగవలసి వచ్చినప్పుడు అగ్నిదేవుని గోవులు తమయందుదాచి దేవతలు కోరినప్పుడు కనుపర్చుటక జేసి కపిలగోవుల దానాదికంబుల కెక్కుడు ఫలంబు నిచ్చుననియు అగ్ని తమయందు డాగుటక జేసి కపిలత్వంబు గలిగెననియు గోవుల పేడయందు లక్ష్మిదేవి నివసించుటకు గోవులచే వరంబు గొనెననియును.

భార. అను. ౨ ఆ.

సీ. గోవత్సుడను తపోభావితాత్ములకంటె నవగ దద్గౌరవంబునకు మేర । గలదె సత్యాఖ్యలోకంబున నవి సోమసంగతత్వంబున సంచ

రించు। వినుత హోమములకెల్లను బాలుపెరుగు నేయును నిచ్చు గరిశ
నంబునకు నొదుగు। దోలు శృంగంబులు వాలంబు రోమచయము
శకృన్మూత్రము లఖిలవర్త।నముల కుపచరించు శ్రమము శీతాతప।
వ్యథయు లేమి నెప్పుడతిభరింపు।పనులుసేయు గోవు బ్రాహ్మణుడ ననే
కత్వంబునగుట పరమపదము గాంచు.

తా. తాపసులకంటె గోవులెక్కువయనియు బ్రహ్మలోకమున
చంద్రుని సంగతముగా చరించుననియు ఆ గోవుల పాలుపెరుగు నేయి
హోమములకు యోగ్యకరములనియు వాటి చర్మము, రోమ్ములు,
తోక, రోమములు, మలమూత్రంబులు నఖిలకర్మంబులకు యోగ్యంబు
లనియు గరిశనమునకు లోబడుననియు వర్షము, యెండ, చలి, గాలికి
వ్యథపడక అతిభారమైన పనులు చేయుననియు గోవులు బ్రాహ్మణులు
సమానులే నని యు.

భార. అను. ౨ ఆశ్వా.

గీ. అనఘ గోవులు ప్రాణంబులని సమస్త
మునులు జెప్పుదు రట్లుగావున దలంప
బ్రాణదాన విధాన సంప్రాప్తమైన
ఫలము గోదానకర్తకు గలుగు జూవే.

తా. గోవులు ప్రాణతుల్యమనియు గోదానము చేయుటచే
ప్రాణదానఫలము కర్తకు గలుగుననియును.

గీ. రాజ ముఖ్యమగు సరస్వతి శిష్యున
కొసగ భూమిదాన మూర్జితముగ
జేసినట్టి ఫలము సిద్ధించు ధేనువు
నిచ్చుటయును భూమి నిచ్చుటయును.

క. గోదానఫలము సపథగ। మైదాత్రకునెల్ల మేలు నాపాదించున్
వేదప్రియ మదిదురితో। త్పాదకమగు నాతనికి విపథగతేమైనన్.

భార. అను: 3 ఆశ్వా.

గీ. శ్రుతులు నొపనిషధసూక్తులు గోస్వరూ।పరటులని సరోజభవుడు జెప్పె
ధర్మపరత్వ పరమతపము మహోత్సవ।మనగ గోసమర్చనంబు దెలియు.

గీ. కాలఁగేల గొల్ల కపిల దండించిన । నరకవాసమునకు నరుగవలయు
బూరినీరు లెస్సయారసి యగ్గోవు । సత్కరింప సుగతి సంభవించు.

ర పద్యములకు ముఖ్యతాత్పర్యము.

భూమియు, గోవు నొక్కటేననియు గోదానం బిచ్చిన, భూదానం బిచ్చిన ఫలంబు ప్రాప్తించుననియును వేదములు, నుపనిషత్తులు గోస్వరూపమనియు అట్టి గోవును పూజించుట పరమతపము, మహా ధ్వరము చేయుటయనియు కాల, చేత తన్నుట, కొట్టుట ఆలకాపరి చేసిన నరకమనియు గడ్డి, నీరు లెస్సగా విచారించిన మోక్షము కలుగుననియును.

ఇట్లు చెప్పియుండుటచే సకల సుర, మునిజన పూజ్యార్హతగలిగి సర్వజన పోషణీయమై వేదోపనిషత్స్వరూపమగు గోవులను రక్షించుట క్షత్రియులకు పరమధర్మముగాదా! ఇట్లు శ్రుత్యాదులు పలుకుచుండుటయు, ధృతరాష్ట్ర, విరాట్రాజు మొదలయినవారికి గోపరి పాలనత్వంబు గలిగినట్లు భారతాదులయందు వినియుంటిమిగదా!

అదియునుంగాక —

భాగ. చతు.

క. మహిపతినప్పుడు కనుగొని
మహిగోరూపమున కంప్యమానయు నగుచుఁ
గుహకుండగు లుబ్ధకుగని
గహనంబున దిరుగు హరిణికైవడి బారెన్.

భార. హరి. పృథుచక్రవర్తికిని గోరూపధారియగు భూదేవికిని న సంవాదమునందు —

సీ. స్వాలోచిషుండను జనుమను ప్రవరుని వత్సంబుగా జేసి వరలు దనదు
హస్తంబుపాత్రమై యతికయిల్లగ మహి ధేనుపుబితికి ధాత్రీజనులకు
సకలసస్యంబులు సర్వయుగంబున వృధబోక ఫలియించు విధముగాక
నొనరింపలోకు లభ్యుదయసమేతులయి పర్లిల్లి రతడెల్ల వలనుగలుగు
భువనవాసులబిలచి వారవికలముగ
వలయునని వేరు వేరనీ వలనమెరయ

నిర్ధరాదోగ్ధ్రి గ్రేపుల నెమ్మిఁజేర్చి
పితికి గొనుఁడనుచు బలికె సమ్మతము మిగుల.

క. సోముఁడువత్సముగాసూ। త్రామగురుఁడు దోహకుఁడుగ దగ నఖిలచ్ఛం
దోమయపాత్రిక బితికిరి। నామయులగుమునులు బ్రహ్మమనుదుగ్ధంబుల్

క. సురలుగొనిరి కాంచనవి। స్ఫురదజపాత్రమున బలరిపుని వత్సముగా
మరగించి సవితదోగ్ధగ। నరుదగుతేజంబు దుగ్ధమై సిద్ధింపన్.

క. పితృకోటి పితికె వేద। స్వత కాలురు గ్రేపు పితుకువారునుగా రా
జితపాత్రంబున దుగ్ధం। బతులాస్వదమై యలర్వ నవనీసురభిన్.

క. ఆయసపాత్రంబున ఘువ। మాయాదుగ్ధంబుగొని రమర్త్యవిరోధుల్
పాయకవిరోచనుఁడు గ్రేఁపై యొక్కఁడు ద్విమూర్ధుఁడను సురారిపితకగన్.

క. వసురుచిపితుకగ బాత్రము। బిసరుహముగ జిత్రరథుఁడు పెయ్యగ గొనిరిం
పెసగంగా సక్షీరం। బసముగ గంధర్వవరులు సమరాంగనలున్.

క. తార పితికెకొనజాలి కు। బేరుని వత్సముగ విడిచి పితికిరి యక్షుల్
ధీరుతు లాయసపాత్రను। వారంతర్ధానశక్తి తగుదుగ్ధముగన్.

గీ. రజితనాథుఁడు దోగ్ధగా రాక్షసులు
పిశాచములు నృకపాల భాజనములందు
గనిరి నరరుధిరాఖ్య దుగ్ధముసుమాలి
వత్సమై పెంపొనర్పఁగ వసుధపతికి.

క. వాసుకి పితికెడువాఁడుగ। భాసతఫణ పాత్రగరళ బహుదుగ్ధము లు
ల్లాసమున గ్రేపుతక్షకుఁడై సమకొనగొనిరి దారుణాద్భుత భుజగుల్.

క. మేరుగిరిదోగ్ధగా నీ। హిమనగరము గ్రేపుజేసి యద్రుల బితికె
న్మ్బారిశిలాపాత్రికలను। గోరి మహౌషధులు రత్నకోటులు నుర్విన్.

అన్నిటికి ముఖ్యతాత్పర్యము.

పృథుచక్రవర్తి యాజ్ఞప్రకారము భూదేవి గోరూపధారిణియై మునులకు బ్రహ్మమను దుగ్ధమును, దేవతలకు తేజమను దుగ్ధమును, పితృదేవతలకు కవ్యమనుదుగ్ధమును, రాక్షసులకు మాయాదుగ్ధంబును, గంధర్వులకు గానవిద్యయను క్షీరంబు, పిశాచరాక్షసులకు రక్తమను

దుగ్ధంబును, సర్పములకు విషదుగ్ధమును, పర్వతములకు ఓషధులు రత్నంబులను దుగ్ధంబును, నింక నెట్టివారి కట్టి దుగ్ధంబు గురిసి రక్షించినట్లును.

హరి. క. గోవు మహి దేవి బడసి । తీవు ప్రియసతీతిలకమనఁ
గావున గోవిందుడవను । భావంబున వామనుడనబరగితి ప్రేమఁ.

తా. గోవు భూదేవియనియు నా భూదేవిని భార్యగా సంగీకరించుటచే గోవిందుడవను నామము గలిగినదనియును.

భారతము. శాంతి.

భూదేవి కశ్యపుని కశ్యపునితో పరశురామునిచే జావని రాజులం జెప్పిన విషయమందు.

వ. అని పలికి యద్దేవి తనసురక్షితంబున హైహయులు కొందరు చావునకుఁ దప్పుటయు పౌరవాన్వయ ప్రభువుండగు విధూరథ సుతుండు ఋక్షపర్వతంబున ఋక్షంబులచే రక్షితుండగుటయు సౌదాస వంశజనితుండగు నొకండు పరాశర సంయమివరు నధ్వరకాలంబునఁ జేరిన కారుణ్యాతిశయంబున నమ్మహాత్మునంపు వాని శూద్రప్రవర్తనంబున సర్వకర్ముండనంబరగుటయు శిబిమనుమడు గోపతియనువాడు వనంబున గోవుల రక్షించిన బ్రతికియుండె. ప్రబర్ధనపుత్రుండు వత్సాభిధానుండు వత్సంబుల గోష్టంబు రక్షణం బాచరింప సంచరించుటయు విధూరథతనయుండగు దధివాహకొడుకు అంగుడు అనువాడు గంగాకూలంబున కౌతుకమునీంద్రు రక్షజేసి నిర్భయుండై వర్తిల్లుటయు బృహద్రథ కులజాతుండగు భూతినామధేయుండు గృధ్నకూట శైలంబున గోలాంగూలంబుల రక్షించుటవలనం గలిగియుండుటయు మరుత్త సంతాన సంభవులు చతుర్వర్ష వయస్కులు ముఫ్వురను సముద్రుండు రక్షకుండై బెనుపం దత్తీరంబున బెరుగుటయుఁ జెప్పి వారుత్తమ క్షత్రియులు సమ్యక్పరిపాలనంబున నన్నరయువారు గావున ననుగ్రహించిన నచలితనై యుండెద.

క. వారలపెద్దలు నాకై । పోర పరశురాముచేత బొలిసిరి నాకుఁ
వారి నధిపతుల జేయుట । గోరందగుగాన నిట్లు గోరితి నసఘా.

ఇట్లు పరశురామునిచేత మరణమునకు దప్పిన క్షత్రియులు కొందరు భూపాలకత్వము విడిచియు స్వకులధర్మంబగు గోపాలనత్వం బుల గొంతకాలంబు జరించి తిరిగి భూపాలనత్వంబుకూడా పొంది యున్నట్టును చెప్పియున్నది.

ఇదియునుంగాక గోవులకున్ను భూమికి అన్వయవ్యతిరిక్తము లేక తుల్యత్వమువహించి రాజలక్షణ ధర్మానుకూలంబై యుండుటచే క్షత్రియులకు భూపాలకమెట్లు ధర్మమో గోపాలకత్వ మట్లు తెలియవలయు.

ప్రశ్న:— శ్లో॥ కృషిగోరక్ష్య వాణిజ్యం । వైశ్యం కర్మస్వభావజం॥

భగవద్గీత - మోక్షసన్యాసయోగము. ౧౮ అధ్యాయము.

భాగవతము

ఉ. స్తేయములేనివృత్తి యశుచిత్వము సన్నుతియు న్నిజేశులక
మాయలులేక డాయుటయు. మంత్రము జెప్పక పంచయజ్ఞముల్
సేయుటయుక ధరామరుల సేవయు గోవుల రక్షణంబున
న్యాయము లేమియుక మనుజనాథ యెరుంగుము శూద్రధర్మముల్.

ఇందునబట్టి గోపాల భూపాలకత్వంబుల కభేదార్థ న్యాయమం గీకరించిన వైశ్యులను, శూద్రులను యేల రాజులని చెప్పకూడదు?

ఉ:— అట్లు చెప్పకూడ దేలననగా అగ్రజాతియగు బ్రాహ్మణులకు గల యజనాది షట్కర్మలలో ప్రతిగ్రహాముతప్ప తక్కిన అయిదుకర్మల కధికారము క్షత్రియులకు కలిగియున్నప్పటికి బ్రాహ్మణులెట్లుగారో, అట్లును వైశ్యులకు క్షత్రియధర్మములుకలిగిన వైశ్యులు క్షత్రియులెట్లుకారో, శూద్రులకు వైశ్యధర్మమగు పశుపాలనవలన వైశ్యులెట్లుకారో అట్లు గోపాలనత్వంబున భూపాలక క్షత్రియనామం బన్యులకు చెల్లదు.

ప్రశ్న:— అట్లయిన వైశ్యులకును, శూద్రులకును స్వకులధర్మంబైన గోపాలనవృత్తిచే గొల్లలని యెందుకు జెప్పకూడదు?

ఉ:— గొల్ల గోపాలయను వృత్తినామము గోపాలనంబు జేయు వారందరియందున వర్తించునని యిదివరకే చెప్పియుండబడెను గావున వైశ్యులకు, శూద్రులకు ప్రత్యేకముగా కులవృత్తి అయివున్నందున

వృత్తినామంబు వారియందు వర్తించుట కేయాక్షేపణయు లేదు. ప్రతికులమువారికి విధింపబడియుండిన అనేక వృత్తులలో నేవృత్తి యెల్లప్పుడాచరింపబడునో వారలకావృత్తినామంబులు కలిగియుండుట లోకప్రసిద్ధము.

ప్రశ్న:— బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను చాతుర్వర్ణంబులలో చంద్రవంశక్షత్రియుడగు శ్రీకృష్ణుడు వరించిన పదియారువేలగోపికలనువారేజాతివారు ?

ఉ:— గోపికయను శబ్దంబు వృత్తినామంబగు గోపాలక శబ్దంబునకు స్త్రీవాచకం బగును. గోప, భూప, శబ్దంబుల కేకార్థం బగుటచే రాజస్త్రీలనియును కూడా జెప్పవచ్చును.

భాగ. దశ.

ఉ. రాజకులావతంసుడు పరాజితకంసుడు సొచ్చి కాంచె ఘో
రాజుల రాజులన్నటు శరాహతి నొంచి ధరాతనూజుడు
ద్త్రేజిత శక్తిదొల్లి చెరదెచ్చినవారి పదారువేల ధా
త్రీజనమాన్యలన్ గుణపతివ్రత ధన్యల రాజకన్యలన్.

భాగ. దశ.

చ. అమితవిహారుడీశ్వరు డనంతుడు దానొకనాడు మంచిల
గ్నమున బదారువేల భవనంబులలోన బదారువేల రూ
పముల బదారువేల నృపబాలల బ్రీతి బదారువేల చం
దముల విభూతినొందుచు యథావిధితో వరియించె భూవరా.

చ. నరవర యొక్కనాడు విను నారదసంయమి మాధవుండు దా
నరకుని ద్రుంచి వాని భవనంబుననున్న పదారువేల సుం
దరులను నొక్కనాడె ప్రమదంబున నందరికన్నిరూపులై
పరిణయమయ్యె నావిని శుభస్థితి తద్విభవంబుజూడగన్.

ఇందువలన గోపికలు రాజకన్యలనియును, విధ్యుక్తముగా వివాహమాడినాడనియు స్పష్టముగా నిరూపింపబడియున్నది.

ప్రశ్న:— శ్రీకృష్ణునకు జనించిన పుత్రులసంఖ్య లెక్కించుటకు పదివేల సంవత్సరములకు దీరదనియును, తద్బాలకులకు విద్యాదులు

గరపిన గురుజనసంఖ్య మూడుకోట్ల యెనుబదెనినిమిదివేల సూర్ధ రనియు జెప్పితిరి. అష్టభార్యలును, షోడశసహస్ర గోపికలును మాత్రము కలిగినవారా శ్రీకృష్ణునకు వీరుగాక భార్యలసంఖ్య కూడా అమితమయియుండెనా, అట్లుండిన ప్రమాణమేమి?

ఉ:— పైన జెప్పిన షోడశసహస్ర గోపికలు గాక ఋషిగోపికలును, మిథిలాగోపికలును, కౌసలగోపికలును, అయోధ్యాగోపికలును, పుళిందగోపికలును, శ్రీలోకాచల రమావైకుంఠ ఊర్ధ్వవైకుంఠ వాసినీ గోపికలును, దివ్యస్త్రీగోపికలును, జాలంధరీ గోపికలును, సముద్రగోపికలును ఇట్లు పెక్కుమంది గలరు. వారల వృత్తాంతము వినుము.

### శ్రీకృష్ణకథామంజరి - ఋషిగోపికల వృత్తాంతము.

వంగదేశమునందు మంగళుడను గోపవరుడు కలడు. యతనికి తొమ్మిదిలక్షల గోవులు కలవు. పెద్దలసేవించు నతడు అయిదువేల గోపికల పెండ్లియాడి బహుమంది కూతుళ్లగని పిమ్మట ఆ దేశమేలు రాజునకు తనకు కలహముపొసగి పశ్వాదికముల గోలుపోయి మిగుల దరిద్రుడై యుక్తవయస్కలగు కన్నెలకు వివాహము సలుపలేమి దుఃఖించుచుండ నందునియేలికయగు బృందావనమునుండి విజయుడను గోపవరుడు యీయన యింటికివచ్చి యీవృత్తాంతము దెలిసి యితని వలన నందునివృత్తాంతము దెలుసుకొని వివాహమునకై యితని వెంబడి కూతుళ్లను నందుని యింటికి పంపించి నందునింట సౌఖ్యపడుచు యమునానదిగూర్చి శ్రీకృష్ణుడు తమకు భర్తగావలయునని తపంబు సేయ నామె ప్రత్యక్షమయి వరంబిచ్చె. అందువ ఆ కృష్ణునకు భార్యలయిరి. ఈ గోపికలు పూర్వము రామావతారమునందు దండకారణ్యమున రాముని మోహించిన ఋషులు.

### మిథిలాగోపికల వృత్తాంతము.

శ్రీరామావతారమందు మిథిలానగరములో స్త్రీలు రాముని మోహించుటచే నవనంధుల గృహములందు గోపికలయి జనించిరి. ఆ సుందరులు శ్రీకృష్ణుని భర్తగా బడయవలయునని రాధాదేవికడ

కేతెంచి యామెయనుమతిని యమునాతటంబున కాత్యాయనివ్రతంబు జేయుచున్న నొక్కనాడాదేవిని పూజించుటకు వేకువను లేచి వివస్త్రలై యమునానదిలో స్నానమాడుట దెలసి శ్రీకృష్ణుడు చీరె లెత్తుకొని పొన్నవృక్షమునందుండి వారల నమస్కారములనంది వారల గైకొని కోర్కెలీడేర్చెను.

### కోసలాగోపికల వృత్తాంతము.

కోసలదేశమునందు వసియించెడి స్త్రీలు శ్రీరాముని వలచి వరము నందియున్నందున వారు ఉపనందులనియెడి నందరాజ సహోదరులగు తొమ్మండుగురు గోపకులయిండ్లలో జనియించిరి. వీరితరగోపకుల పెండ్లియాడినను జారిణీధర్మముచే శ్రీహరితో విహరించిరి.

### అయోధ్యాగోపికా వృత్తాంతము.

సింధుదేశంబేలు విమలుడను రాజుగల(డు). అతడు ఆరువేల మంది యువతుల పెండ్లియాడి సంతతిలేక వ్యసనప(డు)చున్న విమలుని కడకు యాజ్ఞవల్క్యఋషి వచ్చిన తన ఖిన్నం బతనితో విన్నవించిన దివ్యదృష్టిని పరికించి అసంఖ్యాకమగు పుత్రిక లుద్భవింతురని చెప్పిన, పుత్రులులేక గతులులేవుగదా! దీనికేమి యుపాయము(ని), శ్రీకృష్ణుండు మధురయందు వసుదేవునకు జనించు. అతడు శ్రీమన్నారాయణుం(డు). ఆతనికి నీ కూతుళ్ళను, నీ రాజ్యము నర్పించిన, నీ పితౄరుణములు దీరి నీకు మోక్షము కలుగునని చెప్పిన, తనకుగలిగిన కుమార్తెలను శ్రీకృష్ణునకు నిచ్చి వివాహముచేసి తాను మోక్షముబొందెను. ఈ గోపికలు శ్రీరామావతారములో శ్రీరాముని మోహించి వరంబు గొనిన అయోధ్యాస్త్రీలు. వీరిని బృందావనమునకు గొనితెచ్చి మేడలయందుంచి సుఖంచె.

### యజ్ఞగోపికల వృత్తాంతము.

శ్రీరాముడు తన సతియగు సీత నరణ్యంబున కంపిన కాలమున తా ననేకయజ్ఞంబు లాచరించినందున సతీయుతముగా జేయుట కర్తవ్యమగుటచే బంగారముచే సీతాప్రతిమ చేయించి ప్రాణప్రతిష్ఠలు చేయించి కార్యంబులు గడుపుచుండుటచేత నా ప్రతిమలు సజీవులై రాముని రతిగోరిన, యా రాము డేకపత్నీవ్రతస్థుడగుటచే నయనంతరము శ్రీ

కృష్ణావతారమున మిమ్ముఁ బొందెదనని వరంబిచ్చుటవలన యీ కనక సీతలు ఉశీనర దేశమునందు కొందరిగోపాలకులకు జనించినందున వారు ద్వాదశ వర్షమునకు నందరాజు చెంతకు గోవ్రజంబులతో చేరి కాళిందీ తీరంబున నిలయంబు లేర్పరచుకొని వసించిరి. పిమ్మట యీ కన్నియలు శ్రీకృష్ణుని తమకు వరునిగా బడయుటకు రాధాదేవి యానతిన ఏకాదశి వ్రత మవలంబించి శ్రీకృష్ణుని యనుగ్రహపాత్రులైరి.

### పుళిందగోపికల వృత్తాంతము.

వింధ్యపర్వతప్రాంతమునందు కొందరు పుళిందులు వసించి బల సంపన్నులై రాజులయిండ్ల ధనంబులు దోచుచుండ నా దేశపుప్రభువు వారలతో యుద్ధముచేసి వంచింప కంససహాయుడగు ప్రలంబుడను రాక్షసుని సహాయముతో వారలా ప్రభువును పారదోలి కంసునకు భృత్యులై గానుగిరియందు వసించిరి. శ్రీరాముడు పంచవటియందు వసించినప్పుడు పుళిందులు రాముని వరించినకతంబున యీపుళిందులకు కన్నియలై జనించి శ్రీకృష్ణుని భక్తిభావ మదనసుఖంబు లనుభవించిరి.

### శ్రీలోకాచల రమావైకుంఠ ఊర్ధ్వవైకుంఠవాసినీ గోపికల వృత్తాంతము.

నందవ్రజమునందు నీతివేధి, మార్గదుడు, శుక్లుడు, పతంగుడు, దివ్యవాహనుడు, గోపేష్టుడు అను నార్గురు వృషభానులు గలరు. వారికి పాలకడలి తరుచునెడ లక్ష్మితోడఁ జనియించి యీ శ్రీదేవి యేలుచుండెడి వైకుంఠమున వసియించు నా రామామణి కనుంగు చెలులగు విలాసినులు ఊర్ధ్వవైకుంఠమున నుండెడి లక్ష్మీదేవి చెలి కత్తియలును, సముద్రమునబుట్టి శ్రీలోకాచలవాసము చేయు శ్రీదేవి సఖియలును నారాయణుని వరంబున వృషభానుల యిండ్ల జనించి గోవిందునిగోరి మాఘవ్రత మాచరించు యువతులకు ప్రత్యక్షమై మదనతమి దీర్చుమనిన గోపికలును.

### దివ్యస్త్రీ గోపికావృత్తాంతము.

వీతిహోత్రుడు, అగ్నిభుక్కు, సాంబుడు, శ్రీకరుడు, గోపతి, శ్రుతుడు, వ్రజేశుడు, పావనుడు, శాంతుడు, అను ప్రసిద్ధనామంబులు గల యుపనందులు, నందవ్రజంబునందు గలరు. కౌసలగోపికోపాఖ్యా

నంబునం జెప్పిన నవోపనందులుకారు. ఆ వృపనందులు బహుళమగు స్త్రీల పెండ్లియాడ పెక్కు పుత్రులును, మరికొందరు కన్యకలును జనించిరి. ఈకన్యలలో కొందరు దివ్యలు, కొందరు త్రిగుణవృత్తులు, కొందరు భూమిగోపికలు. వీరు నానావిధ వ్రతంబులాచరించి రాధాదేవికి చెలికత్తియలయి రాధాకృష్ణుల కేళికోత్సవముల దోడ్పడుచుండురు. ఫాల్గుణమాసమందు దొకనాడు వేలకొలంది కోట్లకొలంది గుంపులయి శ్రీకృష్ణుని దొడరిన వారికందరి కన్నిరూపుల తృప్తిపరచెను.

## దేవజన గోపికావృత్తాంతము.

మాళవదేశంబునందు నందిదివస్పతియను గోపవరుడనేక స్త్రీల పెండ్లియాడి తీర్థయాత్రాగమనము జేయుచు నందరాజు మహిమలువిని బృందావనంబున జేరి నందునిచే సన్మానింపబడి యా బృందావనము వసతిగా జేసుకొని ఘోషమేర్పరుచుకొని పుత్రమిత్రకళత్ర బంధుయుతముగా నివసించి పూర్వము దేవలునివరంబున వరంబువడసిన దేవకన్నియలితనికి పుత్రికలయి జనించి శ్రీకృష్ణునిగోరి యమునానదియందర్ధోదయ కాలంబున దానమాడి శ్రీకృష్ణలీలలచే పరితృప్తి నొందుచున్న నొకనాడు శ్రీకృష్ణుడు వరంబులొసగి వరించె.

## జాలంధరీ గోపికల వృత్తాంతము.

సప్తనదీతీరమునందు రంగపత్తన మొందుగలదు. దానియందు రంగోజియనెడు గోపవరుడు అనేక గోపకులకు నేలికయై ధనధాన్యసమృద్ధిచేతను పుత్రమిత్ర కళత్రాదులచేతను మించి హాస్తినాపురాధిపతియగు ధృతరాష్ట్రునకు సంవత్సరమునకు పదివేలనిష్కములు పన్ను కట్టుచు పరిపాలించుచు పన్నుకొంత కట్టకున్నందున రాజుచేయుద్ధము జరిగి కంససహాయుడై ధృతరాష్ట్రుని జయించి కంసునిచెంతకు జేరి మధురకుసమీపమందున్న బార్హిషదంబను పురంబునకు రాజుగానుండి యతని భార్యలయందు పూర్వము శ్రీహరివరంబున వడసిన జాలంధర కాంతలు గోపికలై జనించి ఇతరగోపికలను పెండ్లియాడి జారత్వంబున శ్రీకృష్ణునితో కలిసి చైత్రమాసంబున భక్తిమార్గంబున రాసమునందు విహరించిరి.

సముద్ర గోపికల వృత్తాంతము.

శోణపురంబున కధినాధుండగు నందుండను గోపవరు: ఐదు వేలమంది గోపికల పెండ్లియాడ అతనికి సముద్రకన్యకలును, మత్స్యమూర్తివరంబు బొందినవారును, అత్రివరంబున పృధ్వీదోహనము జేసి హరికృపపడసిన యప్సరసలును, నారాయణుని వరంబుబొందిన యప్సరసలును, వామనుని వరంబు వడసిన సుతలవాసినులగు కన్యకలును, శేషునివరంబుబొందిన నాగకన్నికలును గోపికలై జనించి దూర్వాసుని యనుగ్రహంబున యమునా పంచాంగమును కవచ స్తవ సహస్రనామ పటలపద్ధతులనియెడి యైదంగములు గతులతోడన బడసి దానిచే గుమునసుపూజించి తద్వారంబున శ్రీకృష్ణునకు సతులుగాబడసి బృందావనంబున రాధాకృష్ణునకు డోలోత్సవంబు సల్పి హరిని మెప్పించి పతినిగా బడసిరి. ఇట్లు శ్రీకృష్ణకి ధామంజరియందు గలదుగావున శ్రీకృష్ణుండగణితంబగు గోపికలను వరించి లెఖ్ఖలేనిసంతతిని బడసినాడని స్పష్టముగా తెలియుచున్నది.

ఆపస్తంభ సూత్రము. ౧-౧-౧౧

ప్రశ్న:— అశూద్రాణా మదుష్టకర్మణా ముపాయనం। వేదాధ్యయన మగ్న్యాధేయం ఫలవంతిచ కర్మాణి॥ చంద్రవంశక్షత్రియులగు యదు భోజాంధకాదులు రెండవజాతి వారైనయెడల యజనాదిషట్కర్మలలో ప్రతిగ్రహముతప్ప తక్కినకర్మలు యుపనయనాదులు జరిగి యుండవలెనుగదా! అట్లు నెవ్వరేని వీరలలో జరిపియున్నారా?

భాగ. నవ.

ఉ:- సీ. హరికళాసంజాతుడైన దత్తాత్రేయు సేవించి సద్యోగసిద్ధిబొంది బహుయజ్ఞదానతపంబులు గావించి సకలదిక్కులుగెల్చి జయముతోడ సతతంబు హరినామసంకీర్తనము జేయ ధనములబొందియు దారవృత్తి యెనుబదియైదు వేలేండ్లు భూచక్రంబు ఘనకీర్తి దనపేరుగాగ నేలె ముదిమిలేకతరుణమూర్తియై యురుకీర్తినమరె కార్తవీర్యుడనగవిభుడు నిజము వానిభంగి నేలయేలినయట్టిరాజు నెరుగమెందు రాజముఖ్య.

యదువంశమందు జనించిన కార్తవీర్యార్జునుం డనేక యజ్ఞదాన తపంబు లాచరించి పెద్దకాలంబు రాజ్యంబేలినట్లున్న, మరియు

నితని కుమారులలో మధువనువానికి వృష్ణుండును, యితనికి నూర్వురు పుత్రు లందులో నగ్రజుడు వృష్టి యనువాడు గావున వానివంశము వారు వృష్ణులు యాదవు లనంబరగిరి.

భాగ. ద. పూ.

క. గర్గాదిభూసురోత్తమ। వర్గముచే నుపనయనము వసుదేవుడు స
న్మార్గంబున జేయించెను। నిర్గర్వ చరిత్రులకును నిజపుత్రులకున్.

క. ద్విజరాజవంశవర్యులు। ద్విజరాజముఖాంబుజోపదిష్టవ్రతులై
ద్విజరాజత్వము నొందిరి। ద్విజరాజాదిక జనంబు దీవింపంగన్.

ఉ. వేదశ్రేణియు నంగశంబులు ధనుర్వేదంబు దంత్రంబు మ
న్వాది వ్యాహృతధర్మశాస్త్రములు నుద్యన్న్యాయమున్ దర్కవి
ద్యాదక్షత్వము రాజనీతియును శబ్దప్రక్రియన్ జెప్పె నా
భూదేవాగ్రణి రామకృష్ణులకు సంభూతప్రమోదంబునన్.

వ. అనఘా మన మధ్యయనము జేయుచు అన్యోన్య స్నేహావాత్సల్యంబులన్ జేయు కృత్యంబులు మరువముగదాయనియు,

చంద్రవంశశ్రేష్ఠులగు బలరామకృష్ణులకు వసుదేవుం డుపనయనము చేయించెననియును చతుర్వేదంబులు ధనుర్వేదంబును మన్వాది ధర్మశాస్త్రంబులును తర్కవిద్యాదిగాగల సర్వవిద్యలు సాందీపునిచే రామకృష్ణులు నేర్చుకొనిరనియును.

భార. ఆది. ౫ ఆశ్వా.

వ. ఈదేవి పతితోడన పోవ సమకట్టి పుత్రరక్షణార్థంబు మునిగణ ప్రార్థితయై యెట్టకేని మృతప్రాణియయ్యె. నిక్కుమారులు గురుకుల విస్తారకులు దేవమూర్తులు యుధిష్ఠిర భీమార్జున నకుల సహదేవు లనంగా దేవాధిష్ఠిత నామంబులందాల్చి బ్రహ్మఋషి ప్రణీతోపనయనులై శ్రుతాధ్యయన సంపన్నులగుచు దిరుగుచున్నవారు. బ్రహ్మర్షులచే పాండవు లుపనయనాధ్యయనములు నొందినట్లును.

భాగ. నవ

గీ. వినుము దూరంబు నాడిన వినుచునుంపు
మఱియు జూడము డగ్గర నడుగుదేర

నరులలో బభ్రుకంటె నున్నతుడు లేడు
యోజ దేవావృధునకంటె నొరుడు గలడె.

క. పదునాలుగువేవురు నలు । వదినాలుగు నరులు ముక్తి వడసిరి బభ్రుం
డుదితుడు దేవావృధుడును।పదపడి యోగంబు దెలియబలికిన కతనన్.

యదువంశంబున జనించిన సాత్వతునికుమారు లేడుగురియందు దేవావృధుడును యీయన కుమారుడు బభ్రుడనువారలు మోక్షోప దేశార్హతగలిగి దేశికస్వాములై పదునాలుగువేల యరువది నలువు రును విదేహకైవల్యంబుబొంది తాము నట్టి పదవి బొందిరనియు వీరి మహిమ నెప్పుడు మహాపురుషులందరు శ్లోకరూపంబున పఠించుచుందు రనియు నీదేవావృధుని తమ్ముడు మహాభోజుడనువాని పేర వంశంబు వృద్ధిబొందుటచే నావంశంబువారు భోజులనంబరగిరి. శ్రీకృష్ణుడును యుద్ధవార్జున విదురాది యనేకులకు పరబ్రహ్మోపదేశంబు జేసినటుల భగవద్గీతాదులయందు ప్రత్యక్షనిదర్శనీయంబై యుండె. మఱియు.

భార. శాంతి. అ.

గీ. దీని నెరిగించునపుడు భక్తియును శమము
దమము నాశ్రయమును వేదతత్పరతయు
గలుగువారల కెరిగింపు కాని వాని
కీకుమీ విద్యపాత్ర దానైకనిరత॥

గీ. అఖిలవస్తుపూర్ణమగు వసుంధర యెల్ల
నొసగితేని యొసగు యోగ్యతాభి
యుక్తి లేనివాని కొసగకు మీవిద్య
తగిన పాత్రమైన తడయకిమ్ము.

ఇట్లు భీష్మాచార్యులు ధర్మరాజునకు తత్వోపదేశం బొసంగె ననియును మఱిన్ని చంద్రవంశ క్షత్రియులగు పురూరవుండాదిగా గల సకల భరత, కురు, యదు, వృష్ణి, భోజాంధక ప్రభృతులు ప్రతిగ్రహంబు దప్ప యజనాది వేదోక్త కర్మంబులాచరించి రాజ్యాది స్వకులధర్మంబు లందు కొరంతలేక చిరకీర్తిగలవారయినట్లు పంచమవేదంబగు భారతంబు భాగవతంబు మొదలుగాగల సకలపురాణములున్ను ప్రత్యక్ష

ప్రమాణంబులై యుండగా యీచంద్రవంశక్షత్రియులయొక్క యథార్థమును గురించి యింతగా దెల్పవలసిన నిమిత్తంబు కనుపడదు.

ప్రశ్న:— పరాశరస్మృతి. ౧౮౭ పద్యం. తృతీయఖంబ.

శా. శౌచాచారగరిష్ఠమైన నృపవాసంబందు బచ్చింట సం
కోచంబందక దైవపైతృకములన్ గోరం సదా యగ్రజా
నూచానుల్ దిను టొప్పుగున్ జమురునందుం భాలతో గాపుచే
ప్రేచంబడ్డ పదార్థముల్ నదులకుం వేంచేసి బోసేవలెన్.

పూర్వయుగమునందు గొల్లలను వృత్తినామముగల చంద్రవంశక్షత్రియుల యింట బ్రాహ్మణులు భుజించినట్లు ప్రమాణములు గలవా?

భార. అను.

ఉ:— (వచనములో కొంతభాగం.) నొక యాశ్చర్యంబు జెప్పెద నాకర్ణింపుము. దూర్వాసుండు మన మందిరంబునకు వచ్చి మంద హాసంబు జేయుచు గోపించుచు సుముఖుండగుచు విముఖుండగుచు కుడువ నొల్లననుచు బెక్కుంద్రకుం గావించిన కుసుపుకూరలు దా నొక్కండు భుజియింపుచు సెజ్జ నిద్రించుచు భూమి శయనించుచు నెందేని బోవుచు మరలివచ్చుచు నిట్లు వర్తించుచుండి యొక్క నాడు కృష్ణా! నాకు పాయసంబుమీద వేడుకబుట్టెడు పెట్టింపవే యన తత్క్షణంబ గావించినన్ గొంతగుడిచి కొంత తన యొడల బూయుమనిన బూసితి. శ్రీకృష్ణునియింట దూర్వాసుండు భుజించి నట్లు కృష్ణుండు ప్రద్యుమ్నునకు బోధించె.

భారతం. హరి. ౬ ఆశ్వా.

(వచనములో కొంత) కర్తవ్యానుష్టానంబులు సెల్లిన పిదప నిటకువిజయంజేయు డిదె మేలిమిమీగడతోటి పెరుగునుం గలిపిన చల్దినంటకంబు చిక్కంబున నున్నయది. మరియు శర్కరామిశ్రమంబగు పాయసంబు వలసినంతయు దెచ్చినారము. మీకు ప్రియంబైన విధంబున నారగింప నర్హులరు. శ్రీకృష్ణుంను గోపాలురతో గూడి వామదేవ భరద్వాజులను ప్రార్థించి భుజింపబెట్టినట్లును.

భార. ఆది. 7 ఆశ్వా.

సీ. ఆతడు తద్భావ మరయంగ మదిగోరి రూపింప నొకమరి రేపువత్తు
ననిపోయి నడిరేయి యర్థితో జనుదెంచి రేయివచ్చెదనని రేపువచ్చు
నేప్రొద్దువచ్చిన నింతియప్పుడ భక్ష్యభోజ్యముల్ క్రొత్తపోల్పుగ నొనర్చు
నెయ్యదిగోరిన నిచ్చ్చకురాబెట్టు నలయదు మదిలోన నలుగదెపుడు
ననుదినంబు భోజుడాత్మజ బిల్చి తద్వర్తమాన మడుగ వనజముఖియు
దానిగొల్చు తెరగు తాపసవర్యుచందమును జెప్పుచుండుసదంఘ్రియులర.

యదువంశ సంభవుండగు కుంతిభోజునింట దూర్వాసులవారు భుజింపుచు భోజునికుమార్తెయగు కుంతీదేవిచే నుపచర్యలను బొందె ననియును.

భాగ. దశ. పూ.

సీ. అతిథి భూసురుడొక డాహారమడిగిన గడపక ప్రియముతో గారవించి
హరిసమర్పణమంచు నన్నంబుఁగొసగమిచ్చిన భుజియించియేగె నాత
డంతలో నొకశూద్రు దర్శనార్థియైవచ్చి పొడసూప లేదని పోకతనకు
నున్నయన్నములోననొక భాగమిచ్చిన సంతుష్టుడైవాడుచనిన వెనుక
కుక్కగమియు తానునొక్క జేతేర నాయన్న శేషమిచ్చి సన్నుయమున
వానిమ్రొక్కి పంప వరుసతో చండాలుడొక్క డరుగుదెంచి చక్క నిలిచి.

ఇట్లు రంతీదేవుడను రాజు భూసురున కాహారమిడె ననియును.

భార. అర. ప్రథ.

గీ. వనమునకు వచ్చి నవయుగవలవ దుఃఖగు
డనిన నుఃఖగక మీతోన యరుగదలతు
యరుగుదెంతుమనిరి బ్రాహ్మణుల్ వీరి
కాహార మేయుపాయమున బడయవచ్చు.

చ. ఆదరగ ధర్మనందను డహస్పతిచేత వరంబు వరంబునెమ్మితో
బడసి మహీసురోత్తముల భవ్యుల బల్వుర నిర్వహించె న
ప్పుడు ద్రుపదాధిరాజసుత బొల్పుగ వండిన శాఖమూలముల్
గడురుచి నిష్టభోజనసుఖంబున దృప్తియు జేయుచుండగన్.

ఇట్లనేక సహస్రమహీసురవరుల ననుదినంబు నభిమత భోజనం బులం దనిపి విఘసామృతభోజనంబులం దృప్తులైన పతులభుక్తశేషంబు ద్రుపదపుత్రిక యుపయోగించుచుండఁ గొన్ని దినంబు లందయుండె చంద్రవంశక్షత్రియులగు పాండవులు తనభార్యయగు ద్రౌపదిచేవండిన వంటకంబులచే బ్రాహ్మణులు సంతసింపబడిరనియు.

ఏతత్ప్రమాణములచే ఆయాయుగములయందు పిఖ్యాక్తముగా రెండవజాతియగు చంద్రవంశక్షత్రియుల వంటకంబు బ్రాహ్మణులు భుజింపబడిరని తెలియవలెను.

ప్రశ్న:— మీరారు వివరించిన గొల్లలను వృష్ణినామముగల క్షత్రియులగు యదు, వృష్టి, భోజాంధకాదులకును; కురు, భరత వంశీయులకును భేదమేమైన గలదా?

ఉ:— భేదమేమియులేదు. ఎట్లనగా భరతవంశములో బుట్టిన హస్తియనువాడు తనపేర హస్తినగరము నిర్మించె. ఇప్పటికి ఢిల్లియను నామాంతరంబున ప్రసిద్ధిగాంచె. నా హస్తికొడు కజమీఢుండను వాని మునిమనుమండగు కురువు తనపేర కురుక్షేత్రము నిర్మించె. నిప్పటికీ నది యొక్క పుణ్యక్షేత్రం బనబరగె. నా కురువంశ్యులు కౌరవులనియు చెప్పబడుదురు. భరతవంశ్యులు యయాతిమహా రాజు కనిష్టకుమారుడగు పూరునివంశీయులు. భరతవంశ్యుల విశేషములు దెల్పుటచే భారతమనంబరగె. నీభరతవంశస్థులగు పాండవాదులు యాదవులతో నన్యోన్యసంబంధబాంధవ్యములు జేయుట ప్రశస్తముగా నెల్లరకు విశదమే. అయినను కొంత వివరించెద. శ్రీకృష్ణుని మేనత్తయగు కుంతిని పాండురాజునకును, బలరాముని తోబుట్టువగు సుభద్రను నర్జునునికిని, బలరాముని కూతురగు శశిరేఖను అభిమన్యునకును, దుర్యోధనుని కూతురుని శ్రీకృష్ణుని కుమారుడగుసాంబునకును భార్యలగానిచ్చి సంబంధబాంధవ్యములు చేసినట్లు భారత భాగవతములయందు కనబడుచునేయున్నది.

భాగ. పంచ.

గీ. యాదవులకు మీకు నత్యంత కులగురు
వైన కృష్ణు డెచటనైన గలడు

కొలుచువారి కెల్ల సులభుఁడై మోక్షంబు
నిచ్చు జింతసేయ నేల నీకు.

యదువంశులకు మీకు అనగా భరతవంశులకు కులగురువు అనగా యీ రెండువంశములకు అధికఘనత వహించినవాడని పరీక్షన్మహారాజును గూర్చి శుకులవారు పలికినట్లును.

భాగ. దశ. ఉ.

గీ. కూడి నహువంశ గని వారితోడ బలుడు
ధార్తరాష్ట్రులు మనకు నెంతయును డాసి
నట్టి బంధులు వారిపై నిట్టి యలుక
యెత్తి చనుచుంట యిది నీతియే తలంప॥

తా. ధృతరాష్ట్రాదులు తమకు దగ్గిరబంధువులనియు, నట్టి బంధువులపై గోపమున యుద్ధసన్నద్ధులమై పోవుట యుచితముగాదని యదు, వృష్ణి, భోజాంధకబలంబులతో బలికినట్లును.

గీ. మనము బంధువరుస మన్నించు మన్నన
గాదె రాజ్యభోగగరిమ బొదలి
వసుధ బేరుగల్గి వాసికెక్కుట లెల్ల
దనకు ననుభవంబు దగినయట్టి.

తా. తాననుభవించుకీర్తి మర్యాద రాజ్యభోగ గౌరవములు మనము బంధువులని మన్నించుటచేతగదా కలిగెను. అని దుర్యోధనుడు బలరాములగూర్చి పలికినట్లును.

భాగ. ప్రథ.

సీ. మాతామహుండైనమనశూరుడున్నాడె మంగళమేమనమాతులునకు
మోదమే నలుగురుముగురు మేనత్తల కానందమే వారియాత్మజులకు
నక్రూర కృతవర్మ లాయుష్మమేతులే జీవితుడే యుగ్రసేనవిభుడు
కల్యాణయుక్తులె గదసారణాదులు మాధవుతమ్ములు మానధనులు
నందమే మన సత్యకనందనునకు భద్రమే శంబరాసుర భంజనునకు
కుశలమే భాణదనుజేంద్రకూతుపతికి హర్షమే పార్థమునసలికి హాలికిబలికి.

భాగ. ప్రథ.

మ. చెలమిం మేనమఱందివై సచివుడై యేమేటి మాతాతలం
బలమింగాచి సముద్రముద్రితధరం బట్టంబుగట్టించె న
య్యలఘుం డీతడు చక్రిగతుడు నా కన్యుల్ ప్రదక్షుల్
గలరే వేడెద భక్తినా గుణనిధిం గారుణ్యవారాంబుధిం.

ఇట్లు భారత భాగవతాదులయందు యదు కురువంశ్యులకు పరస్పర బంధుప్రమాణంబులు గలిగియుండగాను యదు కురువంశ్యులు చంద్రవంశక్షత్రియులై యుండగాను యయాతికుమారుల సంతతివై వీరినిగురించి భేదాభేద విచారముచేయుట లెక్కువగా దైనను గ్రంథాంతరములయం దక్కడక్కడ బంధుసంబంధంబు లెక్కువారు లుగ్గడింప కుండుటచే యాద్యంతంబులుగా విచారింపనివారి సందేహ నివృత్తికై దెల్ప నావశ్యకమైనదిగాని భేదమేమియు లేదు.

భాగ. దశ. పూ.

ప్ర:- చ. అనఘ యయాతిశాపమున యాదవవీరులకు న్నరేశ్వరా
సనమున నుండరాదు నృపసత్తమ రాజవుగమ్ము భూమికి
న్నినుగొలువంగ నిర్జరులు నీ కరిబెట్టుదు రన్యరాజుల
న్ననిగొను టెంత రమ్ము జనపాలనశీలివిగమ్ము వేడ్కతోం.

అను ప్రమాణంబుచే గొల్లలను వృత్తినామము గల యదువంశక్షత్రియులకు యయాతి శాపమువలన సింహాసనాధికారార్హత లేనట్లు చెప్పియుండగా పాండవాదులకును యదువులకును భేదము నేమియు లేదనుటకు కారణమేమి?

ఉ:— నరేశ్వరాసనమున నుండరాదను పదమునకు యదువంశమునకు రాజసింహాసనాధికారార్హత యేమియు లేదని యర్థము కాదు. ఆ రాజు పరిపాలనచేయు రాజ్యమునకు రాజధానియగు మధురాపట్టణమందుగల సింహాసనమునకు మాత్రమే యర్హత లేనట్లు నెఱుంగవలయు.

ఇందుకు దృష్టాంతములు - భారతము. ఆది. 3 ఆశ్వా.

వ. నా జరాభారంబుదాల్చిన పుత్రుండు రాజ్యంబున కర్హుండును వంశకర్తయగుననియు శుక్రవచనంబు నిట్టిదియనియు యమాత్యు

ప్రభృతి జనంబుల నొసంబరచి పూరు నఖిలభూభార దురంధరుంజేసి యదుప్రభృతుల ప్రత్యంతభూములకు రాజులంజేసి తాను తపోవనంబు నకుం జనియె.

భార. ఆది. ౪ ఆశ్వా. (శాపవిధము)

వ. అని యొడంబడకున్న యదువంశంబువారు రాజ్యంబున కనర్హులుగా, దుర్వసు వంశంబువారు ధర్మాధర్మ వివేకశూన్యులై సంకీర్ణ కిరాత దేశంబులకు రాజులుగా, ద్రుహ్యువంశంబువారు దకప్లవ విరహితంబైన దేశంబునకు రాజులుగా, జరాదూషకుండగుట నను వంశంబువారు ముదిమియగునంతకునుండక యవ్వనంబున పంచత్వంబు నొందువారునుగా శాపంబిచ్చి.

భాగ. నవ.

(వచనములో కొంత) పూరుని యువ్వసంబిచ్చి ముదిమి తాన గైకొని విగతలోభుండై నిజ భుజశక్తి పాలితంబగు భూమండలంబు విభాగించి ద్రుహ్యునకు పూర్వభాగంబును, యదువునకు దక్షిణభాగం బును, దుర్వసునకు పశ్చిమభాగంబును, ననువునకు నుత్తరదిగ్భాగం బును సంరక్షింపుండని యిచ్చి వారల సమక్షంబున.

క. నాలుగుచెఱగుల నేలయు । బాలింపుండంచు నగ్రభవులకు బంచెన్
భూలోక మేలుమనుచును । బాలార్హోదారు బూరు బట్టముగట్టెన్.

మత్స్యపురాణం. ౩౪ అ.

శ్లో॥ యఃపుత్రో గుణసంపన్నో మాతాపిత్రోర్హితస్సహి ।
సర్వశోర్హతి కల్యాణం కనియానపి సప్రభుః॥

శ్లో॥ అర్హాః పూరు రిదం రాజ్యం యః ప్రియః ప్రియకృత్తవ।
వరదానేన శుక్రస్య వశక్యం వక్తుం ముత్తరమ్॥ ౨౭

తా. జననీజనకుల వాక్యానుసరణి నటించెడు కొడుకు కొడుకు గాని, జడమతిచే జనకు నుల్లంఘించినకొడుకు కొడుకుగాడు గావున వారు రాజ్యార్హులుగారు. శుక్రవచన మిట్టిదయె.

మ. ౩౬. ఆధ్యా.

శ్రక్ర॥ శ్లో॥ యదా పూరు స్తవరూపేణ
రాజర్షరాం గృహీత్వా ప్రచచారలోకే
తదాసరాజ్యం సమ్ప్రదాయైవ
తస్మై త్వయా కిము క్తః కథయెహాసత్యమ్॥ ౪

యయాతిః॥ గఙ్గా యమునయోర్మధ్యే కృత్స్నోయం విషయ స్తవ।
మధ్యే పృథివ్యా స్త్వం రాజా భ్రాతరోన్త్యాధిపా స్తవ॥ ౫

తా. పూరునకు పట్టముగట్టుచో యేమిచెప్పితివని యింద్రుడు యయాతి నడిగిన తాను పూరునకు గంగా యమునల మధ్యరాష్ట్రిం బేలునటులను అతనియన్నలు దానిచుట్టునున్న రాజ్యంబులంబాలించు నటులను యేర్పరచితినని చెప్పెను.

ఇట్లు యయాతి జరిగించినట్లు జెప్పియుండుటచే యయాతి కాలములోనె యదువు మొదలగు వారికి సింహాసనార్హత కలిగినట్లు కను పడుచున్నది.

భాగ. నవ.

సీ. హరికళాసంజాతుడైన దత్తాత్రేయు సేవించి సద్యోగసిద్ధిబొంది
బహుయజ్ఞదాన తపంబుగావించి సకలదిక్కులుగెల్చి జయముతోడ
సతతంబుహరినామసంకీర్తనము జేయు ధనములబొందియుదారవృత్తి
యనుబదియైదువేలేండ్లు భూచక్రంబు ఘనకీర్తి దనపేరుగాగనేలె
ముదిమిలేక తరుణమూర్తియై యురుకీర్తి
నమరె గార్తవీర్యుడనగ విభుడు
నిజమువానిభంగి నేలయేలినయట్టి
రాజు గానమెంచ రాజముఖ్య.

ఇతడు యదువంశమందు జనించిన కార్తవీర్యార్జునుండు.

భాగ. నవ.

మ. కృశమధ్యల్ పదివేవురంగనలతో గ్రీడన్స్రమోదింప స
త్కులశీలుండై పదివేలులక్షలు సుపుత్రుల్భక్తిసేయగా జతు

ర్ధశరత్పూండను యోగిసాబరంగి సప్తద్వీపరాజేంద్రుఁడై
శశిబిందుం డురుసితిమంతు డమరేశ సత్కాంతిపూర్ణేందుఁడై.
ఇతఁడు యదువు రెండవకుమారుఁడైన క్రోష్టువు వంశమందు జనించినవాఁడు.

యదువంశమునకు సింహాసనార్హతయే లేనియెడల యీ వంశమందు జనించిన కార్తవీర్యార్జునుఁడు శశిబిందుఁడు మొదలగువారు భూచక్రంబంతయు వేలసంవత్సరము లెట్లేలిరి?

భారతం. మౌసల.

సీ. నిలిపిన తెరఁగెల్ల నృపవర జెప్పెద విను కృతవర్మనందనునిఁజూచి
నీతల్లియును నీవు నీతోడఁబుట్టినవారును మృత్తికావరపురమున
నిలుఁడ బహుసంపదలబొల్చు నప్పట్టణంబు తదీయదేశంబునిచ్చి
యభిషిక్తుఁ జేసిన నాతండు నిజపరిజనములు దాను హార్దంబొలర్ప
నందు బోయె సరస్వతి యనఁగ బరగు
ఘననగరమున సాత్యకి తనయునట్లు
నెయ్యమును గారవంబును నెరయనిల్పి
యనుపముదమున నందుల కతఁడు చనియె.

సీ. తక్కినవారి నింద్రప్రస్థ నగరంబునకు గొనిచని వజ్రునాథుగాఁగ
నందు బట్టముగట్టి హస్తితురంగరథంబుల విభజించి తగినభంగి
నమ్మువురకు సమర్పితమ్ములుజేసి యవ్వైబంధుల నందునందు
నిలుచునట్లొందగనియమించి యంతట యక్రూరుభార్య నాత్మజులను
వజ్రునకు నొప్పగించె నవ్వ్యాసుదేవు
పౌత్రుఁ డతివినయంబున బట్టువరుస
వారు నిలువక పోయిరి వలయు నెడకు
దానివిని యూరకుండె భీమానుజుండు.

భాగ. ప్రథ.

సీ. కలివర్తనంబున గార్శ్యహింసాసత్య దంభకౌటిల్యాద్య ధర్మచయము
పురములగృహములభూముల దములోనగలుగుటదలపోసికరిపురమున
మనుమనిరాజుగా మనుమని దీవించి సింధుతోయ కణాభిషిక్తుఁ జేసి
యనిరుద్ధనందనుండైన వజ్రుని దెచ్చి మథుర బట్టముగట్టి మమతబాసి

కరులతురగములనుకంకణాదికములు। మంత్రిజనులబుధుల మానవతుల
నఖిలమైనధనము నభిమన్యుసుతునకు । నప్పగించి బుద్ధి నాశ్రయించి.

ఈ మూడు పద్యంబులకు ముఖ్యతాత్పర్యము.

కలియుగాదియందు కృతవర్మకుమారునకు మృత్తికాపురము రాజధానిగా నియమించి పట్టాభిషిక్తుని జేసినట్లును, సరస్వతి యను పేరుగల గొప్పపట్టణమును రాజధానిగా నియమించి సాత్యకి కుమారునకు పట్టాభిషేకము జేసి సింహాసనాధ్యక్షుని చేసినట్లును, శ్రీకృష్ణుని మనుమడగు వజ్రుని యింద్రప్రస్థనగరంబున రాజుగా నియమించి పట్టాభిషిక్తుని జేసినట్లును, మరియును మధురకును నావజ్రుని పట్టాభిషిక్తుని జేసినట్టు జెప్పియున్నది. ఈ మొదలైన కారణములనుబట్టి యదువంశక్షత్రియులకు రాజసింహాసనాధికారము కలిగియేయున్నది. ఇచ్చట యదువంశసంభవుండగు వజ్రునకు యింద్రప్రస్థ పురమును, మధురయును రాజధానులుగా నిరూపించుటేమియని సందియంబు ప్రతిపాదించునట్లేల జేసిరనిన, యయాతిశాపమున తత్సింహాసనాధికారము లేకపోవుటచే అనగా మధురయందు సింహాసనము యయాతి యెక్కినది. వీలుగలుగక యింద్రప్రస్థపురంబు ముఖ్యరాజధానిగా నియమించి సింహాసనస్థుని జేసి తత్పూర్వరాజధానియగు మధురకును కూడా వజ్రుని నధిపతిగా నియమించిరని యెరుంగవలయును.

(అనఘ యయాతిశాపమున) అనెడు పద్యమందు శాపకారణ సిద్ధాంతముగా తాను యదుకులమునందు జనించినవాడననియు తనకు రాజసింహాసనార్హత లేనట్లు బలికి యుగ్రసేనునకు పట్టాభిషేకము జేయుటలేమనిన ఆ మధురరాజధాని యయాతి యేలిన సింహాసనమై యుండుటనుబట్టియును తాను రాజ్యభరాపేక్ష లేనివాడవుటవలనను పుత్రదుఃఖనివారణార్థము రాజ్యసుఖంబు లనుభవింప జేయుటకు నట్లు జరిగింపబడియె. అట్లు గాకున్న రాజ్యసింహాసనార్హత లేని శ్రీకృష్ణునికి ధర్మరాజానతిచ్చి రాజసూయయాగమందు సకలరాజన్యులమండలిలో నగ్రపూజార్హత యెట్లు గలిగినది? విష్ణువవుటచే నట్లు జరిగించిరనిన, శ్రేయోధర్మనిరతులగువారు లౌకిక విరుద్ధంబున కెట్లంగీకరింతురు? అట్లంగీకరించిన మహావిష్ణువగు శ్రీకృష్ణుండు రాజపీఠార్హత కెందు

కంగీకరింపబడదు ? కావున యయాతిశాపాభిప్రాయము పెద్దకొడుకగు యదువువంశమువారికి రాజ్యపరిపాలనత్వాదులు లేకపోవుట కాదు. రాజపీఠార్హత లేదనగా అప్పుడు మధురయందుగల సింహాసనము పూరునివంశమువారు యెక్కవలసినదిగాని యదువంశమువారెక్కరాదని శపించినట్లు యెరుంగవలయును. ఎందువల్లననగా ఆ యయాతి యదువునకు దక్షిణదేశము భాగమిచ్చినట్లును, తన రాజధానియందు గల సింహాసనము పూరునకిచ్చినట్లున్నది. శాపఫలమేమనగా పెద్ద కుమారునకు తండ్రి రాజపీఠాభిషేకహక్కు ధర్మశాస్త్రమైయుండగా పితృవాక్యపాలనచేయుని కుమారుని అగ్రజునిగా భావింపక కనిష్ఠపుత్రుడైనా పితృవాక్యపరిపాలన ధర్మం బాచరించుటచేత, అగ్రజాధికారమివ్వబడి, యగ్రకుటుంబాధికారహక్కు దప్పించి, కనిష్ఠకుటుంబమునకు గలిగించుటయే శాపఫలంబని యెరుంగుము.

ప్రశ్న:— ఈ చెప్పబడిన చంద్రవంశ క్షత్రియులకును సూర్యవంశ క్షత్రియులకును భేదమేమైనకలదా ?

ఉ:— సూర్యవంశమునకు మూలము సూర్యుడు.

భార. ఆది. 3 అశ్వా.

తొల్లి దాక్షాయణియైన యదితికి కశ్యపునకు బుట్టిన వివస్వంతునకు వైవస్వతుండను మనువును, యముండును, శనైశ్చరుడును, యమున దపతియును బుట్టిరి. అందు వైవస్వతుడను మనువునందు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులైన మానవులు బుట్టి మరియు వానికి బ్రముఖులైన రాజులేబండ్రుబుట్టి వంశంకరులై తమలో దాము యుద్ధంబులుజేసి చనిరి. మరియు మనుపుత్రియైన యిలయను దానికి చంద్రుని కుమారుడగు బుధునకును పురూరవుండను జన్మించి చక్రవర్తియయ్యె. నతనికి నూర్వసియందు నాయువు ధీమంతు వసువు ధృతాయువు వనాయువు శతాయువులను నార్వురుకుమారులలో నాయువునకు స్వర్భానునతనికి నహుషుడాదిగా నలువురు గలిగిరి. యా నహుషుని యందు బ్రియంవదయను దానికి యయాతి యాదిగా అయిదుగురు పుత్రులు యదువు మొదలుగాగలవారు జనించి వంశకర్తలైరి.

భారతం. ఆది. ౭ ఆశ్వా.

సీ. ఆదిత్యునకు పుత్రియనగ సావిత్రికి ననుజయు త్తమ లక్షణామలాంగి
తపతియనఁగన్యక ధవళాయతేక్షణ యవ్వనసంప్రాప్త యైనదాని
జూచియక్కన్యకసురచిరగుణముల కనుగుణుండగు నిర్మలాభిజాత్యు
బతి నెవ్విధంబున బడయుదునోయని తలచుచునున్న యత్తపనుగూర్చి
భక్తి తపముజేసె ప్రభుడజామీఢ నం
దనుఁ డు భరతకులుడు ధర్మవిదుడు
సర్వగుణాహితుండు సంవరుణుండను
వాఁడు కృతజపోపవాస విధుల.

వ. డానం జేసి మహీతలంబున కనావృష్టియైన యెరింగి వసిష్ఠుండు శాంతికపౌష్టిక విధుల నొనర్చి సంవరుణుండోడ్డాని హాస్తిపురంబున కరిగిన నఖిల ప్రజకు ననురాగంబయ్యె. ననావృష్టి దోషంబులుం బాసె నంత సంవరుణునకుం దపతికిం దాంపత్యుండన గురుఁడు బుట్టె. నది మొదలుగ మీరు దాంపత్యులై తిరని గంధర్వుండు సెప్పిన నర్జునుం డిట్లనియె.

ఇట్లు చంద్రవంశ సంభవుండగు బుధుడు వైవస్వత మనువు కూతురగు యిలయను దానిసి, ఆదిత్యుని కూతురగు తపతియను దానిని సంవరుణుండను పరిగ్రహించుట చే.

మనుస్మృతి

సవర్ణాగ్రేశ్వజాతీనాం ప్రశస్తాదారకర్మణి।
కామతస్తుప్రవృత్తానా మిమాస్స్యుఃక్రమతోవరా॥ ఇతి॥
శూద్రైవ భార్యా శూద్రస్యా సాచస్వాచవిశస్మృతే।
తేచస్వాచైవరాజ్ఞస్స్యు స్తాశ్చస్వాచాగ్రజన్మన॥

ఆయాయుగములయందు గొప్పవంశస్త్రీని తక్కువవంశీయులు పెండ్లియాడుట విధిలేనందువలన పవిత్రమైన కులము గలవానికై సూర్యుండు ప్రయత్నించి సంవరుణునకు దపతి నిచ్చుటచేతను, చంద్రవంశ క్షత్రియులకన్న సూర్యవంశపురాజు లధికులైనట్లు కనుపించదు.

ప్రశ్న:—　　　　　　భాగ.

కం. వాలాయము యదుకుల నిర్మూలకరంబైనయట్టి ముసలంబొక టీ
　　బాలిక కుదయించును బొం|డాలస్యము లేదటంచు నని పల్కుటయున్

　　అను ప్రమాణంబున మునిశాపంబున యదువంశక్షత్రియుడగు సాంబునకు ముసలంబుబుట్టి యదుకులమంతయు నిర్మూలమైనట్లు జెప్పియుండగా నీ కలియుగంబున గొల్లలను వృత్తినామము గల వారు యదువంశక్షత్రియులని యెట్లు చెప్పవచ్చును?

ఉ:— చంద్రవంశ క్షత్రియులలో యదువృష్టి భోజాంధకాది వంశంబులు బహుళముగా వృద్ధిబొంది గణనాతీతంబై యొప్ప నెట్లనగా.

భాగ. దశ. ఉ.

సీ. హరియిట్లు గృహమేధియగుచు శతోత్తర షోడశసహస్రసుందరులను
　　మును నీకు నెరుగ జెప్పినరీతి నందర కన్నిరూపములు దా నర్థిదాల్చి
　　కైకొని యొక్కొక్క కామినీమణియందు రమణ నమోఘువీర్యమున జేసి
　　పదు రేసికొడుకుల బడసె రుక్మిణ్యాదిపట్టమహిషులకు సంభవములైన
　　　　నందనులలోన ధరణి నన్నంగ బాహు
　　　　బలపరాక్రమ విజయ సంపద్విశేష
　　　　మానితాత్ములు పదునెనమండ్రు వారి
　　　　నెఱుగ వినుపింతు వినుము రాజేంద్రచంద్ర.

　　వ. అని యిట్లనుచారలు ప్రద్యుమ్న, అనిరుద్ధ, దీప్తమద్భాను, సాంబ, మిత్ర, బృహద్భాను, మిత్రవింద, వృక, అరుణ, పుష్కర, దేవబాహు, శ్రుతదేవ, సునందన, చిత్రబాహు, వరూధ కవి న్యగ్రోధ నామంబులచే ప్రసిద్ధులైరి. వెండియు, త్రివక్రయందు సంభవించిన యుపశ్లోకుండనువాడు తన జనకుండగు కృష్ణుపాదారవింద సేవావ్రతుండగుచు నారదయోగీంద్రునకు శిష్యుండై యఖండిత దివ్యజ్ఞాన బోధాత్మకుండగుచు స్త్రీ శూద్ర దాసీజన సంస్కారంబై స్మరణమాత్రంబున ముక్తి సంభవించునట్టి సాత్వతతంత్రంబను వైష్ణవస్మృతి గల్పించె. నిట్లు మధుసూదననందనులు బహుప్రజలును నధికాయురన్నతులును ననల్పవీర్యవంతులును బ్రహ్మణ్యులునై విఖ్యాతింబొందిరి. వారిని లెక్క

బెట్ట పదివేల వత్సరంబులకైనం దీరదు. మున్ను నీ కెఱింగించినట్లు తత్కుమారులకు విద్యావిశేషంబుల నియమించు గురుజనంబులు మూడుకోట్ల యెనుబదెనిమిదివేల నూర్గురను గలిగియుండు. నక్కుమారుల లెక్కింప నెవ్వారికిని శక్యంబుగాదదియునుంగాక.

క. నరవర దేవాసురసం। గరమున మును నిహతులైన క్రవ్యాదసము
త్కరము నరేశ్వరులై ద్వా।పరమున జనియించి ప్రజల బాధలబఱుపన్

క. హరి తద్వధార్థమై ని।ర్జరులను యదుకులమునందు జనియింపింపన్
ధర నూటొక్కకులంబై పరగిరి వారిని గణింప బ్రహ్మకు వశమే.

యదువంశక్షత్రియుడగు శ్రీకృష్ణునకుమాత్రము పదహారువేల గోపికలయందు నొక్కొక్క స్త్రీకి పదురేసివంతున కొడుకులును, పట్టపుదేవులగు రుక్మిణ్యాది యెనిమిదిమందికి పదునెనిమిదిమంది బలవీర్య విక్రమాది విశేషవంతులగు ప్రద్యుమ్నాదికుమారులును త్రివక్రయందు సుపశ్లోకుడనువారి గనినట్లును వారి లెక్కబెట్ట పదివేల వత్సరంబులకు దీరదనియును, తద్బాలకులకు విద్యాదులు గరపిన గురుజనసంఖ్య మూడుకోట్ల యెనుబదెనిమిదివేల నూర్గురనియును నందుచేత నగణితంబనియును చెప్పియున్నది. ఇక్కడ నొక్క సందియంబు బాధించుచున్నదదేమనిన, నొక్కొక్క స్త్రీకి పదిమంది చొప్పున నన్నప్పుడు స్త్రీసంఖ్యనుబట్టి యొకలక్ష యఱువదివేల సంఖ్య కనుపడుచుండగా నగణితమని చెప్పరాదు. అట్లేల జెప్పెననిన యొక్కొక స్త్రీకి పదుగురికి తక్కువగాకుండా కన్నాడని యర్థము చేయవలెను. ఇంత వృద్ధికి కారణము దేవాసురయుద్ధమున మరణించిన రాక్షససమూహమంతయు ద్వాపరంబున క్షత్రియవంశమునందు జనించి జనుల బాధించుటకు జేసి దేవతలు హరియును యదువంశమునందు జనియించిరనియు నీయదువంశమందు జనియించినవారి వంశంబులు నూటొక్కకులమైనదనియు వారలగణింప వశముకాదనియు భాగవతమునందు జెప్పబడియున్నది. ఈ నూటొక్క కులమువారు ద్వారకయం దుండినను గదా మునిశాపమరణము తటస్థపడును. ఎవరెవ రేయేదేశముల నెందరెందఱుండిరో తెలియ దంద రొక్కమాటు నశించిరని చెప్పరాదు. ముని

శాపమందరిని నశింపచేయక తప్పునాయనిన కొందరు యదువంశ్యులు తప్పినట్లు భాగవతమునందు జెప్పియున్నది.

భాగ. ద. ఉ.

వ. అట్టిసమయమునందు మాధవునకు రుక్మిణీ పితృసముండును సమగ్ర భుజావిజృంభణుండును ప్రద్యుమ్నుండు జనించె. నతనికి రుక్మిణి కూతురు శుభాంగివలన ననిరుద్ధుఁడుదయించె. నతనికి మాసలావసిష్టుఁడయిన వజ్రుండుసంభవించె నతనికి ప్రతిబాహుండుపుట్టె. వానికి సుబాహుండు జనించె. నతనికి నుగ్రసేనుండు ప్రభవించె. నాతనికి శతసేనుండుగలిగె. నిట్లుయదువృష్టి భోజాంధకవంశంబులు పరమపవిత్రంబులై పుండరీకాక్షు కటాక్షవీక్షణ శయ్యాసనానుగతసంసాలాప స్నానాశన క్రీడావినోదంబుల ననిశంబుజెందుచు సర్వదేవతార్థంబు సమస్తంబులైన క్రతవులొనరింపుచు పరమానందకందళిత చిత్తులైరనిచెప్పి వెండియు.

భాగ. ప్ర.

మ. యదువీరుల్ మునినాథుశాపమున గాలాధీనులై యందఱున్
మదిరాపాన వివర్ధమానమద సమ్మర్దోగ్ర దోషాంధులై
కదనంబుల్ దమలోన ముష్టిహతులన్ గావించి నీరైరి న
ష్టదశన్ జిక్కిరి నల్గురేవురచటన్ సర్వంసహావల్లభా.

సీ. కలివర్తనంబున క్రౌర్యహింసాసత్య దంభకౌటిల్యాద్య ధర్మచయము
పురములగృహముల భూములదమలోన గలుగుటదలపోసికరిపురమున
మనుమనిరాజవై మనుమనిదీవించి సింధుతోయక్షణాభిషిక్తుజేసి
యనిరుద్ధనందనుండైన వజ్రునిదెచ్చి మధురబట్టముగట్టిమమతబాసి
కరులతురగములనుకంకణాదికములమంత్రిజనులబుధులమానవతుల
నఖిలమైనధనము లభిమన్యుసుతునకు నప్పగించి బుద్ధినాశ్రయించి.

మముఖ్య తాత్పర్యము

శ్రీకృష్ణుని మనుమండగు వజ్రుడనువాడు మాసలావశిష్టుఁడైనట్లును వానిని ధర్మరాజు కలియుగాదియందు మధురకు బట్టము గ ట్టినట్లును యతనికి సుబాహుండాదిగాగల పుత్రులు జనించి వంశంబులు వృద్ధిబొందినట్లును పూరువంశజుడగునట్టియు నర్జుననిమనుమండగు పరీ

క్షిత్తును హస్తిపురంబునకు పట్టాభిషిక్తుని జేసినట్లును. ఇదియునుంగాక మునిశాపకారణమున గలిగిన యుద్ధమందు మరణింపక నలువురేవురు జిక్కిరనియు జెప్పియున్నది. (నష్టదళం జిక్కిరి నల్వురేవు రనుచో) తొమ్మండుగురు నిలచిరని యర్థము జేయుటకంటె నలుగురైదుగురు పదైదుగురు అనుట, ఇందరు అని యెన్నికచేయని కొద్దిసంఖ్యను దెల్పు లోకసాధారణ వాచకమైయున్నది. అందుచేత అపరిమిత జనసంఖ్య యందు యుద్ధమందు నిలచినవారు బహుకొద్ది యని చెప్పుటయె కాని నిష్కృష్ట సంఖ్యావాచకము గాదు. గాక,

భాగ. తృ.

క. శౌరియు నతిరథవరులు మ|హారథికసమరథులు యదుబలాదిపులెల్లన్
బోరి మృతిబొంద నుద్ధవు | డేరీతి బ్రతికె దాని నెరిగింపు తగన్.

తా. శ్రీకృష్ణుడు, అతిరథ, మహారథ, సమరథులు యుద్ధమందు మృతిబొందగా నుద్ధవుడు మాత్ర మెట్లు బ్రతికియుండెనని శుకులవారిని పరీక్షిన్మహారాజు ప్రశ్న జేసినట్లు చెప్పియున్నది.

భారతం. మౌసల.

సీ. పథపడి యాదవ భామినీ బాలక వృద్ధజనంబు నాశుద్ధబుద్ధి
కల్గయుంగ గైకొని పలుకుల మార్దవమార పురంబున కరుగ జెప్ప
రామకృష్ణులు తపోరతులై ప్రవర్తించు వనభూమియారసికొని తదీయ
సందర్శనమునకు జనుటకై వారల కామంత్రితుల జేసి యేమి యనుచు
టకును శోకముమాన్పుటకును దారకుడాదియైన తగినవారినర్థ్వ వచన
రచన నెరయబనిచియుచితత్వకతిపయ|జనులతోడరాగ జనియెనధిప.

తా. అర్జునుండు ద్వారవతికేగి యదుక్షయానంతరమున గల స్త్రీ బాలవృద్ధ జనులను మిక్కిలి యాదరణగల మాటలచే యింద్రప్రస్థపురంబున కరుగ నియోగించి స్త్రీ బాల వృద్ధ దుఃఖోపశమనము నకై వారలవద్ద నిల్పెననియు.

భారతం. మౌస.

సీ. కోపించి గాంధారి శాపమిచ్చిన యది యాదవసంక్షయమగుట యెట్లు
దప్పదు మనము తద్బాల వృద్ధ స్త్రీజనంబుల నెల్ల నర్థ్వంబులైన

తావుల సప్రతిష్ఠావిశేషంబుగా జేయంగవలయు నక్కాలమునకు
నాదవియుత్తరగున నుత్సహించుట కృత్యమర్జుననీకనియానుచుండు
బలుమరునుదలంచి పాండవాగ్రజుడది। కారణముగ నతనికరుణ పెంపు
నొప్పు నెరుగుగాన నప్పార్థుడయ్యెడు। నికరశేషజనుల నెన్నుసిల్పి.

సీ. నిలిపిన తెరగెల్ల నృపవర జెప్పెద విను కృతవర్మనందనునిజూచి
నీతల్లియును నీవు నీతోడబుట్టినవారును మృత్తికావరపురమున
నిలుడని బహుసంపదల బొల్చు నప్పట్టణంబు తదీయదేశంబు నిచ్చి
యభిషిక్తుజేసిన నాతండు నిజపరిజనములతోడ హర్షంబెలర్ప
నందుబోయె సరస్వతీ యానగబరగు
ఘనసగరమున సాత్యకి తనయు నట్లు
నెయ్యమును గారవంబును నెరయనిల్పి
యనుప ముదమున నందులకత .. చనియె.

సీ. తక్కినవారి నింద్రప్రస్థనగరంబునకు గొనిచని వజ్రునాథుగాగ
నందు బట్టముగట్టి హస్తి తురంగ రథంబుల విభజించి తగినభంగి
నమ్మువ్వురకు సమర్పితంబులు జేసి యవ్వైబంధుల నందునందు
నందును నిలుచునట్లొందగానియమించి యక్రూరుభార్యల నాత్మజులను
వజ్రునకు నొప్పగించిన వాసుదేవు।పౌత్రుడతి వినయంబున బట్టువరుప
వారునిలువక పోయిరివలయు నెడకు। దానివిసియూరకుండె భీమానుజుండు

గీ. వినుడు యాదవ భామినీ వృద్ధ బాలజనులందరి నుచితవర్తనముతోడ
ప్రొద్దువడవక ముందరబురజనప్రయుతముగాబురి వెలువరించితిగడంగి.

గీ. చాపదండని యతినోపిన భంగి గి।రాతకోటినాగి రామకృష్ణ
వల్లభాదులైన వనితల గొందర। వృద్ధబాలకులను వెరవుతోడ.

అన్నిటికి ముఖ్యతాత్పర్యము.

పూర్వము గాంధారి కృష్ణునిపై కోపించి శాపం బిచ్చుటచేత
యదు సంతతియంబుగాక తప్పదనియు తద్బాలవృద్ధ స్త్రీ జనంబుల
నాకాలంబునకు తగినచోటుల ముందు ప్రతిష్ఠించుటకు కర్తవ్యుడ వీవె
యని ధర్మరాజు అర్జునునితో నాడుచుండెననియు నట్లనె యుప్పు డ్య

నుండు యదు నికర శేషమగు కృతవర్మనందనుని, యతని తల్లిని, తోడ బుట్టినవారితో సహా మృ_త్తికాపురమునవిల్పి తత్పట్టణము దద్దేశము వారికిచ్చి పట్టాభిషేకము జేసెననియును సరస్వతి యను పేరుగల పట్టణమునకు సాత్యకికుమారుని రాజుగా నియమించి తద్దేశములు నొసంగి పట్టాభిషిక్తు జేసెననియు దక్కినవారిని ఇంద్రప్రస్థపురంబునకు దోడ్కొని పోయి తద్దేశమునకు శ్రీకృష్ణుని పౌత్రుడగు వజ్రుని రాజుగా నియమించి తద్రాజ్యమునకు పట్టభద్రునిగా నొనరించి రథగజతురగాదుల ముప్వురికి సమంబుగా బంచియిచ్చెననియు తక్కిన బంధువుల నక్కడక్కడ నుంచెననియు నక్రూరుని భార్యయు పుత్రులు వజ్రుపాలనలో నుండక యిష్టము వచ్చినచోట నుండిరనియు యదుసంబంధమైన స్త్రీలను, వృద్ధులను, బాలురను గ్రామములోనుం..ు యితర జనులతో గూడా వుదయము గాకపూర్వము ద్వారవతి వెడలించితినని రుక్మిణ్యాది కృష్ణమహిషులతో నర్జును డాడినట్లును బామకృష్ణవల్లభాదులైన స్త్రీలను, వృద్ధులను, బాలకులను కిరాతదండనకు చిక్కకుండునట్లుజేసి తెచ్చితినని వ్యాసులవారితో అర్జునుండాడుటయు మొదలుగాగల ప్రమాణంబులను జూడగా యదువంశమునందనేకులు వంశాకరులై యదుక్షయంబున దప్పిరని దెలియవచ్చుచున్నది. (సీ. పదపడి యాదవ భామినీ బాలక వృద్ధజనంబు) రెండవ పద్యములో రెండవ చరణము (దప్పదు మనము తద్బాల వృద్ధ స్త్రీజనంబులనెల్ల) గీతపద్యము ప్రథమపాదంబున (వినుడు యాదవ భామినీ వృద్ధబాలజనుల) రెండవగీతపద్యములో (వల్లభాదులయిన వనితల గొందఱ వృద్ధ బాలకులను) అని చెప్పియుండుటచే బాలురు, వృద్ధులు, స్త్రీలు నిలచిరని విస్పష్టముగా వ్రాసియుండుటనుబట్టియు యాదవాదులలో ప్రముఖులైనవారే మరణించిరిగాని అనేకమంది బాలురు, వృద్ధులు, స్త్రీలు, వజ్రుడు సాత్యకి కుమారుడును కృతవర్మకుమారుడును విదేశీయులు మొదలగువారు చాలామందినిలచి యుండుట దెల్పబడియె యున్నది. నూటొక్కవంశములుగా నేర్పడిన శ్రీకృష్ణసంతతి యంతయు_కొందరు యదుక్షయములో ప్రముఖులయిన వారలు గలసినను పెక్కుమంది వంశాకరులై మనిరనుటకు యే యాక్షేపణయును లేదు.

# చంద్ర (యదు) వంశ వృక్షము

1 నారాయణమూర్తి

2 బ్రహ్మ

3 అత్రి

4 చంద్రుడు

5 బుధుడు

6 పురూరవుడు — ఇతను చక్రవర్తి.

7 ఆయువు
8 శ్రుతాయువు
9 సత్యాయువు
10 రయుడు
11 జయుడు
12 విజయుడు

} నె 6 వ పురూరవుని కుమారులు ఆర్వురు.

13 భీముడు — యితడు నె 12 వ కుమారుడు.

14 కాంచనుడు

15 హోత్రుడు

16 జిహ్నువు — యితను గంగను పుక్కిట నిడినవాడు.

17 పూరుడు

18 బాలకుడు

19 నజకుడు

20 కుశుడు

21 సాంబుడు
22 ధూర్తయుడు
23 వసువు
24 కుశనాభుడు

} నె 20 వ కుమారులు నల్వురు.

25 గాధి — నె 21 వ కుమారుడు. ఇతడు రాజ్యపాలన చేసినవాడు.

26 విశ్వామిత్రుడు — ఇతను రాజఋషి. నూటొక్క కుమారులు. అందులో కొంతమంది శునస్సేపుని, అన్న యనుమనిన అనక తండ్రి యాజ్ఞ మీరిన మ్లేచ్ఛులగుటకు శాపమంది మ్లేచ్ఛులయిరి.

27 శునస్సేపుడు లేక దేవరాతుడు
28 మధుచ్ఛందుడు
29 యష్టకుడు
30 హారితుడు
31 జయంత
32 సుమదాగుడు

యీ ఆర్గురు నెం 26 రు కుమాళ్లు. మరికొంతమంది గలరు.

33 నహుషుడు — యితడు 7 నెంబరుగల ఆయువుకుమారుడు. ఇంద్రత్వమును బొందినవాడు.

34 క్షత్రవృద్ధుడు
35 రజి
36 రంభుడు
37 నేనస్సు

యీ అయిదుగురు ఆయువుని కుమాళ్లు.

38 సుహోత్రుడు — నెం 34 రు క్షత్రవృద్ధుని కొడుకు.
39 గాస్యుడు
40 గాశి
41 సురాష్ట్రుడు
42 దీర్ఘతముడు
43 ధన్వంతరి — ఇతడు వైద్యుడు.
44 కేతుమంతుడు
45 భీమరథుడు
46 ద్యుమంతుడు
47 ప్రవర్ధనుడు
48 .........

49 కుశుకు — నె 38 రు రెండవ కుమారుడు.

50 ప్రీతి

51 సంజయుఁ

52 జయుడు

53 కృతుడు

54 హరియధ్వనుడు

55 సహదేవుడు

56 భీముడు

57 జయత్సేనుడు

58 సంకృతి

59 జయుడు, క్షత్రధర్ముడు — వీరలు క్షత్రధర్ముని వంశమునంగల రాజులయిరి.

60 యతి, 61 సంయాతి, 62 యయాతి — నె 33 రు నహుషుని కుమాళ్లు. యితని కుమాళ్ళు మువ్వురుగాక మరి నలువురు గలరు.

63 దంతధ్వజుడు — నె 47 రు కొడుకు.

64 కువలయాశ్వుడు — యితడు రాజ్యమేలినవాడు.

65 అలర్కుడు

66 సన్నతి

67 సునీతుడు

68 ధర్మకేతువు — యితనికొడుకు సత్యకేతువు.

69 దృష్టకేతువు — యితను సత్యకేతువుని కొడుకు.

70 సుకుమారుడు

71 వీతిహోత్రుడు

72 భర్గుడు

73 భార్గభూమి — రి వంశమువారు గాశ్యవంశజులయి వృద్ధక్షత్రవంశజాతులన బరగిరి.

74 దృషద్వతు

75 యదువు

76 దుర్వసుడు

77 అనువు

78 పూరుడు

ఈ ఐదుగురు నె62 రు యయాతి కుమారులు. వీరిలో యదువంశమున బుట్టినవారు యాదవు లనబరగిరి. పూరుని వంశమువారు పౌరవులు.

79 బభ్రుసేతువు — నె 74 రు కొడుకు.

80 నారబ్ధుడు

81 గాంధారుడు

82 ఖర్మ్నుడు

83 ఘృతుడు

84 దుర్మదుడు

85 ప్రచేతస్సు

86.........

87.........

యితనికి నూర్వురు కొడుకులు పుట్టి మ్లేచ్ఛాధిపతులై యుదీచిదిశ నాశ్రయించిరి.

88 వహ్ని — నె 76 రు కుమారుడు

89 భర్గుడు

90 భానుమంతుడు

91 త్రిసానువు

92 కరంధముడు

93 మరుత్తుడు — ఇతనికి యయాతిశాపవశంబున సంతతి లేదయ్యె.

94.........

95.........

96 సభానరుడు

97 చక్షుస్సు

98 పరోక్షుడు

వీరు ముప్పురు నె 77 రు అనువు కొడుకులు.

99 కాలనాభుడు — యితడు నె 96 రు కొడుకు.

100 సృంజయుడు

101 పురంజయుడు

102 జనమేజయుడు

103 మహాంసాలుడు

104 మహామనస్సు

105 సీనరుడు
106 తితిక్షువు
} యీ యిరువురు నె 104 రు కొడుకులు.

107 ఉరుశద్రధుడు — యితడు నె 106 కొడుకు.

108 హోముడు

109 సుతరస్సు

110 బలి

111 అంగ
112 వంగ
113 కళింగ
114 సింహళ
115 పుండ్ర
116 ఆంధ్ర
} వీరు ఆరుగురు నె 110 రు కుమాళ్లు. తామేలిన దేశములకు తమ నామములు స్థాపించిరి. ఇప్పటికి యీనామములే సమస్త గ్రంథములయందు వాడుచుండిరి.

117 గ్రిమి
118 వసుడు
119 శిబి
} యీ మువ్వురు నె 105 రు కుమాళ్లు.

120 వృషదర్భుడు
121 సువీరుడు
122 మద్రకేకయుడు
} ఈ మువ్వురు నె 119 రు కుమాళ్లు.

123 సత్యరధుడు — యితడు నె 121 రు కుమారుడు.

124 నిరధుడు

125 ధర్మరతుడు

126 చిత్రకేతుడు — ఇతనికి రోమపాదుడను నామాంతరంబు గలదు. ఇతను సూర్యవంశ క్షత్రియుడగు దశరథుని కూతురగు శాంతను దత్తతజేసుకొని ఋష్యశృంగుడను ఋషికి వివాహముచేసెను.

127 చతురంగుడు

128 పృథులాక్షుఁడు యితనికి బృహద్రథాది నలువురు కొడుకులు.
129 బృహద్రథుఁ
130 బృహన్మనస్సు
131 జయద్రథుఁడు
132 విజయుడు
133 ధృతి
134 ధృతవ్రతుఁడు
135 సత్యకర్ముఁడు
136 అతిరథుఁడు
137 కర్ణుఁడు ఇతడు సూర్యునకును కుంతికిని పుట్టినవాడు.
138 వృషసేనుఁ ఇతను కర్ణునికొడుకు. మరికొందరు గలరు.
139 చంపుఁడు ఇతడు నెం 128 రు పృథులాక్షుని కొడుకు. వీని పేర చంపానగరము నిర్మింపంబడియె.
140 హర్యంగుడు
141 భద్రరథుఁడు
142 బృహత్కర్ణుడు
143 బృహద్భానుడు
144 జయద్రథుఁడు
145 బృహత్కర్ముడు
146 విజయుడు
దృఢవ్రతుడు
147 సత్యకర్ముడు ఇతనిది (111) అంగ, వంగ, వంశము.
కృత్స్నమదుడు ఇతడు పురూరవుని మునిమనుమడగు నెం 38 రు సుహోత్రుని కొడుకు.
148 శునకుడు యితను కృత్స్నమదుని కొడుకు.
149 శౌనకుడు యితఁడు బహ్వృచ ప్రవరుండై జన్మించి తపోనియతుండై చనియె.
150 రభసుడు యితను నెం 36 రు కొడుకు.

151 గంభీరుడు

152 కృతుడు ఇతను బ్రహ్మకులంబున బుట్టె.

153 శుద్ధుడు ఇతడు పురూరవునిమనుమడు. నె 37 రు కొడుకు.

154 శుచి

155 రజస్సు

156 త్రికకుత్తు

157 కృతకృత్యుడు ఇతను విజ్ఞానియై కృతకృత్యుడై చనియెను.

158 జనమేజయుడు ఇతను నె 83 రు నహుషుని మనుమడు. నె 78 రు పూరుని కొడుకు.

159 ప్రాచీవానుడు

160 ప్రవిరోధనమన్యుడు

161 చారువు

162 సుజ్యువు

163 బహుగతుడు

164 శర్యాతి

165 సంయాతి

166 రౌద్రాశ్వుడు

167 ఋతేపువు
168 కక్షేపువు
169 స్థలేపువు
170 కృతేపువు
171 జలేపువు
172 సన్నతేపువు
173 ధర్మేపువు
174 సత్యేపువు
175 వనేపువు
176 వ్రతేపువు

(167–176) వీరు పదిమందియు నె 166 రు రౌద్రాశ్వుని కొడుకులు.

177 నంతిసారుడు ఇతడు నె 167 రు ఋతేపువుకొడుకు.

178 సుమతి
179 అప్రతిరథుడు } యీముగ్వురు నె 177 ర కొ...కులు.
180 ధృవుడు

181 కణ్వుడు ఇతను ర 179 ర అప్రతిరథుని కొడుకు.

182 మేధాతిథి

183 బ్రస్కందుడు ఈ మొదలైన బ్రాహ్మణులు జన్మించిరి.

184 .........

185 రైభ్యుసు ఇతను నెం 178 ర సుమతికొడుకు.

186 దుష్యంతుడు ఇతను విశ్వామిత్ర మేనకలకు పుట్టినవాడు.

187 భరతుడు ఇతను భారతవంశ కర్త.

188 భరద్వాజుడు ఇతనికి వితథుడు అను నామాంతరము గలదు. భరతుడనియు గలదు. బృహస్పతి, తనఅన్న భార్య గర్భవతియైయుండగా నామెనుపొందిన నావీర్యము గర్భపిండమును తన్నుటచేత నది దిగువబడి బాలుండైన, నతనిని వదిన పెంప కున్న, బృహస్పతియును వదలిన, మరుత్తులు పెంచి అపుత్రకుండగు భరతునకు దత్తతగా నిచ్చిరి. ఇతసు భరత వంశమునకు కర్త యయ్యె.

189 మన్యువు

190 బృహత్క్షత్ర
191 జయ
192 మహావీర్య } ఈ అయిదుగురు నె 189 ర మన్యువు కుమాళ్లు.
193 నర
194 గర్గసు

195 ఉరుక్షయు ఇతసు నె 192 ర మహావీర్యుని కొమారుడు.

196 బ్రయ్యారుణి
197 కవి } ఈ ముగ్వురు బ్రాహ్మణులై చనిరి.
198 పుష్కరారుణి } ఈ ముగ్వురు నె 195 ర కుమాళ్లు.

199 సుహోత్రుడు — ఇతఁడు నె 190 రు బృహత్క్షత్రుని కొడుకు.
హస్తి — ఇతని పేరట హస్తినాపురి నిర్మింపబడినది. దీనికి ఢిల్లీ యని యిప్పుడు నామాంతరంబు గలదు.

200 అజమీఢుడు
201 ద్విమీఢుడు
202 పురుమీఢుడు
— ఇతనికి నళినియందు ప్రియమేధాదులు బుట్టి బ్రాహ్మణులైరి. ఈ ముగ్గురు హస్తి కుమారులు. వీనికి సంతతి లేదు.

203 యవీనరుడు — ఇతను నె 201 రు ద్విమీఢుని కొడుకు.
204 కృతిమంతుడు
205 సత్యధృతి
206 దృఢనేమి
207 సుపార్శ్వకృతుడు
208 పార్శ్వుడు
209 సుమతి
210 సన్నమంతుడు
211 కృతి — ఇతఁడు హిరణ్యనాభునివలన యోగమార్గంబెరింగి తూర్పుదేశంబున సామసంహిత పఠించె.
212 నుగ్రాయుధుడు
213 క్షేమ్యుడు
214 సువీరుడు
215 పురంజయుడు
216 బహూరథుడు

217 సుహోత్రుడు
218 సుతహోత
219 గయుడు
220 కపిలుడు
— ఈ నలుగురు నె 188 రు భరద్వాజుని కొడుకులు.

221 ఋత్సుడు
222 నీలుడు
223 బృహదిషుడు
— ఈ ముగ్గురు నె200 రు నజమీఢునికొడుకులు

224 బృహాధనుడు — ఇతను నె 223 రు బృహాజిషుని కొడుకు.

225 బృహాత్కాయుడు

226 జయద్రధుడు

227 విశ్వజిత్తు

228 సేనజిత్తు

229 వత్సుడు

230 కాశ్యుడు

231 దృఢాహానువు

232 రుచిరాశ్వుడు

(229–232) ఈ నలుగురు నె 228 రు సేనజిత్తునికొడుకులు

233 ప్రాజ్ఞుడు — ఇతడు నె 232 రు రుచిరాశ్వునికొడుకు.

234 ప్రధసేనుడు

235 బారుడు

236 నీపుడు — ఇతనికి శకునికూతురు సుందరివలన 100 కొడుకులు పుట్టిరి.

237 బ్రహ్మదత్తుడు — రాజ్యపాలకుడు.

238 విష్వక్సేనుడు

239 ఉదక్సేనుడు

240 భల్లాదుడు — ఇతనివంశమువారు బార్హదిమవులను రాజులైరి.

241 శాంతి — ఇతడు నె 222 రు నీలునికొడుకు. నడమీాఢుని మనుమడు.

242 సుశాంతి

243 పురుజానుడు

244 అర్కుడు

245 భర్మ్యాశ్వుడు

246 సృంజయుడు

247 ముద్గలుడు

248 పీనరుడు

249 బృహాదిషుడు

250 కాంపిల్యుడు

(246–250) వీరలు నె 245 రు భర్మ్యాశ్వుని కొడుకులు. ముద్గలునివలన బ్రాహ్మణ కులంబున బుట్టి ముద్గలగోత్రంబున నెగడె.

251 దివోదాసుడు ఇతడు నె 247 రు ముద్గలుని కొడుకు.
252 మిత్రాయువు
253 చ్యవనుడు
254 సుదాసుడు
255 సహదేవుడు
256 సోమకుడు
257 జన్మకృతు ఇతనికి నూర్వురు కొడుకులు.
258 జంతువు } ఇతడు నె 257 రు జన్మకృతునకు జ్యేష్ఠుడు.
259 వృషదుడు } ఇతడు ,, ,, కనిష్ఠు...
260 ద్రుపదుడు ఇతడు నె 259 రు వృషదుని కొడుకు. ఇంకా కుమారులు గలరు.
261 ద్రుష్టద్యుమ్నుడు నె 260 రు ద్రుపదుని కొడుకు.
262 ద్రౌపది పాండవుల భార్య.
263 దృష్టకేతుడు ఇతడు నె 261 రు ద్రుష్టద్యుమ్నుని కొ..కు. పాంచాలరాజులని యెరుగవలెను.
264 అహల్య ఈమె నె 247 రు ముద్గలుని కూతురు. ఈమెను గౌతముడు పెండ్లియాడె.
265 శతానందుడు
266 సత్యధృతి
267 కృపి } వీరల నిద్దరిని శంతనుడు పెంచి కృపిని ద్రోణాచార్యునకు భార్యగా నిచ్చెను.
268 కృపుడు }
269 సంవరణుడు ఇతను నె221రు ఋక్షునికొడుకు, నజమీఢుని మనుమడు. ఇతనిభార్య తపతియను సూర్యుని కూతురు.
270 కురువు ఇతను నె 269 రు కొడుకు. తన పేర కురుక్షేత్రంబు నిల్పె. రాజ్యపాలనుడు. కౌరవుల వంశకర్త.

| | |
|---|---|
| 271 సుధనస్సు<br>272 పరిక్షిత్తు<br>273 జహ్నువు<br>274 నిషధుడు | యీనలువురు నె 270 రు కొడుకులు. |
| 275 సుహోత్రుడు | ఇతను నె 271 రు సుధనస్సు కొడుకు. |
| 276 చ్యవనుడు | |
| 277 కృతి | |
| 278 వసువు | |
| 279 బృహద్రధుడు<br>280 కుసుంభుడు<br>281 మత్స్యుడు<br>282 ప్రత్యగ్రుడు<br>283 చేదిషుడు | వీరు ఐదుగురు నె278రు వసువు కొడుకులు. |
| 284 జరాసంధుడు | ఇతను నె 279 రు కొడుకు. మరియొకడు గలడు. మగధ దేశాధీశుడు. |
| 285 సహదేవుడు | |
| 286 సోమాపి<br>287 మార్జాలి | వీరిరువురు నె 285 రు సహదేవుని కొడుకులు. |
| 288 శ్రుతశ్రవుడు | యితను నె 286 రు కొడుకు. |
| 289 శ్రుతశ్రవస్సు | యితను నె 287 రు కొడుకు. |
| 290 నయుతాయువు | |
| 291 నిరమిత్రుడు | |
| 292 సునక్షత్రుడు | |
| 293 బృహత్సేనుడు | |
| 294 కర్మజిత్తు | |
| 295 శ్రుతజయుడు | |
| 296 విప్రుడు | |
| 297 శుచి | |
| 298 క్షేముడు | |

299 సువ్రతుడు
300 ధర్మనేత్రుడు
301 శ్రుతుడు
302 దృఢసేనుడు
303 సుమతి
304 సుబలుడు
305 సునీతుడు
306 సత్యజిత్తు
307 విశ్వజిత్తు
308 పురంజయుడు
309 జహ్నువు — ఇతను నె 270 రు గురువుకు మారుడు.
310 సురథుడు
311 విదూరథుడు
312 సార్వభౌముడు
313 జయత్సేనుడు
314 రథికుడు
315 ఆయుతాయువు
316 క్రోధనుడు
317 దేవాతిథి
318 ఋక్షుడు
319 భీమసేనుడు
320 ప్రతిపుడు
321 దేవాపి
322 బాహ్లీకుడు
323 శంతనుడు

(321–323) ఇతడు యోగియయ్యెను. వీరుముగ్గురు నె 320 రు ప్రతిపుని పుత్రులు. శంతనునికి సత్యవతి భార్యయయ్యె.

324 సోమదత్తుడు — ఇతడు నె 322 రు బాహ్లీకుని కొడుకు.
325 శల్యుడు
326 భూరిశ్రవుడు
327 భూరి

(325–327) యీ ముప్పురు నె 324 రు సోమదత్తుని కొడుకులు. ఈ శల్యుడే కర్ణసారథి.

| | |
|---|---|
| 328 భీష్మాచార్యులు<br>329 విచిత్రవీర్యుడు<br>330 చిత్రాంగదుడు | ఇతడు దేవవ్రతుడు. వీరుముగ్గురు నె 328 రు శంతనుని కొడుకులు. చిత్రాంగదుడు గంధర్వునిచే కాలధర్మము నొందెను. విచిత్రవీర్యుడు కాశిరాజు కుమార్తెలగు అంబి అంబాలికలను పెండ్లియాడి రాజయక్ష్మముచే కాలధర్మము జెందెను. |
| 331 వ్యాసులు | శంతనుని భార్యయగు సత్యవతి – పెండ్లికాక పూర్వము పరాశరునితో కూడుటచే ఇతడు జనించె. పుత్రప్రాయుడగు వ్యాసునిచే శంతనుని వంశోద్ధారణకై విచిత్రవీర్యుని తన భార్యలయందు ధర్మసంతతి బడసె. |
| 332 ధృతరాష్ట్రుడు<br>333 పాండురాజు<br>334 విదురుడు | యీ ముగ్గురు ధర్మసంతతివారు. |
| 335 దుర్యోధనుడు<br>336 దుశ్శల | దుర్యోధనాది నూర్గురు కొడుకులను, దుశ్శల యను కూతురిని గాంధారియందు ధృతరాష్ట్రుడు కనెను. ఈదుశ్శల సైంధవుని భార్య. |
| 337 ధర్మరాజు<br>338 భీముడు<br>339 అర్జునుడు<br>340 నకులుడు<br>341 సహదేవుడు | వీరి అయిదుగురిని కుంతి మాద్రులయందు నె 333 రు పాండురాజు ధర్మ సంతతి వడసె. |
| 342 దేవకుడు<br>343 ప్రతివింధ్యుడు | వీరిద్దరు నె 337 రు ధర్మరాజుకుమాళ్ళు. |
| 344 సర్వాంగదుడు<br>345 ఘటోత్కచుడు<br>346 శృతసేనుడు | వీరుముగ్గురు నె 338 రు భీముని కుమాళ్లు. |

347 అభిమన్యుఁడు
348 బభ్రువాహనుఁడు
349 నిశావంతుఁడు
350 శ్రుతకీర్తి
— వీరు నలువురు నె 339 రు అర్జునుని కుమాళ్ళు.

351 నిరమిత్రుఁడు
352 శతానీకుఁడు
— వీరు నె 340 రు నకులుని కుమాళ్ళు.

353 సుహోత్రుఁడు
354 శ్రుతకర్ముఁడు
— వీరిద్దరు నె 341 రు సహదేవునికుమాళ్లు.

355 సహస్రజిత్తు
356 క్రోష్టుఁడు
357 నలుఁడు
358 రిపుఁడు
— యీ నలుగురు నె 75 రు యదుమహారాజు కుమాళ్లు.

359 మహాహయుఁడు
360 వేణుహయుఁడు
361 హేహయుఁడు
— యీ ముప్వురు నె 355 రు సహస్రజిత్తు కొడుకులు.

362 ధర్మ[illegible] — ఇతఁడు హేహయుని పుత్రుఁడు.

363 నేత్రుఁడు
364 కుంతి
365 మహిష్మంతుఁడు
366 భద్రసేనుఁడు
367 దుర్మదుఁడు
368 ధనికుఁడు

369 కృతవీర్యుఁడు
370 కృతాగ్ని
371 కృతకర్మ
372 కృతౌజస్సు
— ఈ నలుగురు నె 368 రు ధనికుని కుమాళ్లు.

373 కార్తవీర్యార్జునుఁడు ఇతఁడు నె369రు కొడుకు. రాజ్యపాలకుఁడు.

| | |
|---|---|
| 374 జయధ్వజుడు | |
| 375 సూరసేనుడు | |
| 376 వృషణుడు | ఈ యేవురు కార్తవీర్యార్జునుని పుత్రులు. |
| 377 మధువు | |
| 378 వూరితుడు | |
| 379 తాళజంఘుడు | ఇతడు నెం 374 రు జయధ్వజుని కొడుకు. ఇతనికి వీతిహోత్రుడు మొదలుగాగల 99 కొడుకులు గలరు. |
| 380 వృష్ణుడు | ఇతడు నెం 377 రు మధువు కొడుకు. ఇతనికి 100 కొడుకులు. వారిలో జ్యేష్ఠుడు వృష్టి. |
| 381 వృష్టి | ఇతని పేర వంశంబు వృద్ధిబొంది వృష్ణులు యాదవు లనంబరిగిరి. |
| 382 వృజనవంతుడు | ఇతడు యదువు మనుమడు. నెం 365 రు క్రోష్టుని కుమారుడు. |
| 383 శ్వాహితుడు | |
| 384 బేరుసిసేకుడు | |
| 385 చిత్రరథుడు | |
| 386 శశిబిందుడు | ఇతడు సప్తద్వీపములు యేలినవాడు. ఇతనికి చాలాసంతతి గలదు. ముఖ్యులు ఆరుగురు. అందులో జ్యేష్ఠుడు పృథుశ్రవుడు. |
| 387 పృథుశ్రవుడు | |
| 388 ధర్ముడు | |
| 389 యుశనస్సు | ఇతడు రాష్ట్రమేలినవాడు. |
| 390 రుచికుడు | |
| 391 పురుజిత్తు | |
| 392 రుక్మ్ముడు | |
| 393 రుక్మేషువు | ఈ యేవురు న 390 రు రుచికుని కొడుకులు. |
| 394 పృథువు | |
| 395 జానుజంఘుడు | ఈతనిభార్య శైబ్య. |

396 విదర్భుడు

397 క్రథుడు

398 కృథుడు

399 రోమపాదుడు

ఈ ముగ్గురు నె 396 రు విదర్భుని కొడుకులు.

400 బభ్రువు — ఇతను నె 399 రు కొడుకు.

401 విభువు

402 కృతి

403 ఉశికుడు

404 చేదుడు — ఇతనికి చైద్యాదులుపుట్టి రాష్ట్రపాలకులైరి.

405 .........

406 కుంతి — ఇతడు నె 398 రు కృథునికొడుకు.

407 దృష్టి

408 నిర్వృతి

409 దశార్హుడు

410 వ్యోముడు

411 జీమూతుడు

412 వికృతి

413 భీమరథుడు

414 నవరథుడు

415 దశరథుడు

416 శకుని

417 కుంతి

418 దేవరాతుడు

419 దేవక్షత్రుడు

420 మధువు

421 కురువశుడు

422 అనువు

423 పురుహోత్రుడు

424 సంశుడు

| | |
|---|---|
| 425 సాత్వతుడు | |
| 426 భజమానుడు | ఇతనికి యిద్దరుభార్యలు. |
| 427 భజయు | |
| 428 దివ్యుడు | నె 426 రు నుండి నె 432 రు వరకు |
| 429 వృష్టి | నె 425 రు సాత్వతుని కుమాళ్లు. |
| 430 దేవావృధుడు | ఇతడు యోగపురుషుడై బహుమందికి బ్రహ్మోపదేశ మొనర్చి మోక్షమును బొందెను. |
| 431 మహాభోజుడు | ఇతనిపేర వంశంబు వర్ధిల్లి భోజులనం బరగిరి. |
| 432 అంధకుడు | ఇతని వంశస్థులను అంధకు లనియెదరు. |
| 433 బభ్రుడు | ఇతను నె 430 రు కొడుకు. బ్రహ్మోపదేశకర్తయై బహుమందిని మోక్షము జెందించెను. |
| 434 నిమ్రోచి | |
| 435 కంకణ | |
| 436 శతజిత్తు | ఈ యార్వురు నె 426 రు భజమానుని |
| 437 సహస్రజిత్తు | కొడుకులు. |
| 438 అయుతజిత్తు | |
| 439 వృష్టి | |
| 440 సుమిత్రుడు | వీరిరువురు నె 439 రు వృష్టికుమాళ్లు. |
| 441 యుధాజిత్తు | |
| 442 శని | వీరిరువురు నె 441 రు యుధాజితుని |
| 443 అనమిత్రుడు | కుమాళ్ళు. |
| 444 నిమ్నుఁడు | ఈ ముప్వురు నె 443 రు అనమిత్రుని |
| 445 శిని | కుమారులు. |
| 446 బృశ్ని | |

447 సత్రాజిత్తు
448 ప్రసేనుడు

పీరిద్దరు నె 444 రు నిమ్నుని కుమారులు. పీరిలో సత్రాజిత్తు సూర్యుని మెప్పించి శ్యమంతకమణినిగొని తత్కారణమున తన కూతురగు సత్యభామను, మణిని శ్రీకృష్ణునకిచ్చెను.

449 సత్యకుడు — ఇతడు నె 445 రు శినియనువాని పుత్రుడు.

450 సాత్యకి — ఇతనికి యుయుధానుడను ఉపనామముగలదు.

451 జయుడు

452 గుణి

453 యుగంధరుడు

454 శ్వఫల్కుడు
455 చిత్రతుడు

పీ రిరువురు నె 446 రు కుమారులు.
ఈతని భార్య గాందిని.
ఈతనికి బహుమంది కుమారులు గలిగి వృష్టి వంశ్యులయిరి.

456 పృథుడు
457 విదూరథుడు

పీ రిరువురును, మఱికొందరును నె 454 రు కుమారులు. వీరు వృష్టివంశ జాతులయిరి.

458 అక్రూరుడు
459 అసంగుడు
460 సారమేయుడు
461 మృదుకుడు
462 మృదుపచ్ఛివుడు
463 వర్మదృక్కుడు
464 దృష్టవర్ముడు
465 క్షత్రోపేతుడు
466 అరిమర్దనుడు
467 శతఘ్నుడు
468 సుగంధమాదుడు
469 ప్రతిబాహుడు
470 సుచారువు

నె 458 రు అక్రూరునుండి నె 470 రు సుచారువువఱకు నె 454 రు శ్వఫల్కుని కుమారులు. ఈ అక్రూరుడే - ధనుర్యాగ నెపమున కంసునిచే శ్రీకృష్ణునిఁబిలుచుకొనివచ్చుటకు పంపబడినవాఁడు.

| | |
|---|---|
| 471 భజమానుడు<br>472 కుకురుడు<br>473 శుచి<br>474 కంబలబర్హిషుడు | ఈ నల్వురు సాత్వతునికొడుకగు నె 432 రు అంధకుని పుత్త్రులు. |
| 475 విదూరథుడు | ఇతను నె 471 రు భజమానుని పుత్త్రుడు. |
| 476 శూరుడు | |
| 477 శిని | |
| 478 భోజుడు | |
| 479 కృతవర్మ<br>480 శతధన్వుడు<br>481 హృదీకుడు | ఈ ముగ్వురు నె 478 రు భోజుని కుమారులు. |
| 482 వృష్ణి | ఇతడు నె 472 రు కుకురుని కుమారుడు. |
| 483 విలోమతనయుడు<br>484 దేవమీఢుడు<br>485 విధాజిత్తు<br>486 మిత్రవర్థనుడు<br>487 సుమిత్రుడు | ఈ ఐదుగురు నె 482 రు వృష్ణి కుమారులు. |
| 488 కపోతలోముడు | ఇతడు నె 483 రు విలోమతనయునికొడుకు. |
| 489 అనువు | ఇతను తుంబురుసఖుడు. |
| 490 దుందుభి | |
| 491 రవిజ్యోతుడు | |
| 492 పునర్వసు | |
| 493 ఆహుకుడు<br>494 ఆహుకియనుస్త్రీ | ఇతను నె 492 రు పునర్వసుని కొడుకు.<br>ఈమె ,, ,, కూతురు. |
| 495 దేవకుడు<br>496 ఉగ్రసేనుడు | నె 493 రు ఆహుకుని కొడుకులు. |

497 దేవలుఁడు
498 ఉపదేవుఁడు
499 సుదేవుడు
500 దేవవర్ధనుడు
501 ధృతదేవ స్త్రీ
502 శాంతదేవ స్త్రీ
503 పదేవ స్త్రీ
504 శ్రీదేవ స్త్రీ
505 దేవరక్షిత స్త్రీ
506 సహాదేవ స్త్రీ
507 దేవకి స్త్రీ

నె 495 రు దేవకునకు నలువురు కుమారులు, యేడుగురు స్త్రీలు కలిగిరి. ఈ యేడుగురుస్త్రీలను శూరుని కుమారుడగు వసుదేవుడు పెండ్లియాడెను.

508 ఉగ్రసేనుడు

ఇతడు నె 493రు ఆహుకుని కొడుకు. రాష్ట్రపాలుడు. ఇతని రాజధాని మధురాపట్టణము.

509 కంసుడు
510 న్యగ్రోధుడు
511 సునాముఖుడు
512 గవ్యాడు
513 శంకుడు
514 సుభువు
515 రాష్ట్రపాలుడు
516 విశ్రుష్టుడు
517 తుష్టిమంతుడు
518 కంస స్త్రీ
519 కంసవతి స్త్రీ
520 సురభి స్త్రీ
521 రాష్ట్రపాలిక స్త్రీ

ఈ పదమువ్వురు స్త్రీ పురుషులు నె 508 రు ఉగ్రసేనుని సంతతి. యీ కంసాదులు శ్రీకృష్ణునకు మేనమామలు.

522 శూరుడు లేక శూరసేనుడు

ఇతడు అంధకుని మునిమనుమడగు నె 484 రు దేవమీఢుని కొడుకు.

| సంఖ్య | పేరు | వివరము |
|---|---|---|
| 524 | వసుదేవుడు | ఇతని భార్య దేవకి. |
| 525 | దేవభాగుడు | ఇతనిభార్య కంస. |
| 526 | దేవశ్రవుడు | ఇతనిభార్య కంసవతి. |
| 527 | యానకుడు | ఇతనిభార్య సురభి. |
| 528 | శ్రుంజయుడు | ఇతనిభార్య రాష్ట్రపాలిక. |
| 529 | శ్యామసీకుడు | నె 524 ఉ లగాయతు నె 538 ఉ వరకు గల స్త్రీ పురుషులు నె 522 ఉ శూరుని కుమాళ్ళు, కుమార్తెలు. |
| 530 | కంకుడు | |
| 531 | నకుడు | |
| 532 | వత్సకుడు | |
| 533 | వృకుడు | |
| 534 | ప్రుధ స్త్రీ | ఈమెను కుంతిభోజునకుదత్తుయిచ్చినందున కుంతి యను నామాంతరము కలిగినది. ఈమెను పాండురాజునకు భార్యగా యిచ్చినందున పాండవవంశము వృద్ధిబొందె. |
| 535 | శ్రుతదేవ స్త్రీ | ఈమెను గారూమకుండైన వృధశర్మ పెండ్లియాడె. వారికి మునిశాపంబున దంతవక్త్రుండను రాక్షసుండు జనియించె. |
| 536 | శ్రుతకీర్తి స్త్రీ | ఈమెను కేకయుడు పెండ్లియాడిన నా దంపతులకు ప్రతర్ధనాదులు పుట్టిరి. |
| 537 | రాజాధిదేవి స్త్రీ | ఈమెను జయత్సేనుడు పెండ్లియాడిన వీరి వలన విందానువిందులు జనించిరి. |
| 538 | శ్రుతశ్రవస్సు స్త్రీ | ఈమెనుచేదిదేశాధిపతిఅగు దమఘోషుడు పెండ్లియాడిన వారికి శిశుపాలుడు జనించె. |
| 539 | చిత్రకేతుడు | వీరిరువురు నె 525 ఉ దేవభాగుని కుమార్లు. |
| 540 | బృహద్బలుడు | |
| 541 | వీరుడు | వీరిరువురు నె 526 ఉ దేవశ్రవుని కుమార్లు. |
| 542 | నిమమంతుడు | |
| 543 | ఉతధాముడు | వీరిరువురు నె 527 ఉ యానకుని కుమార్లు. |
| 544 | జయుడు | |

545 వృషుడు } వీరిరువురు నె 528 రు సృంజయుని కుమా-
546 దుర్మర్షుడు } రులు. ఇంకా గలరు.

547 హరికేతుడు } వీరిరువురు నె 529రు శ్వానకుని కొడుకులు.
548 హిరణ్యాక్షుడు } ఇంకా గలరు.

549 బకుడు
550 సత్యజిత్తు } ఈ ముగ్గురు నె530 రు కంకుని కొడుకులు.
551 పురజిత్తు

552 సుమిత్రుడు
553 ఆనకుడు } ఈ ముగ్గురు నె 531 రు నకుని కొడుకులు.
554 శాహుకుడు

555 వృకుడు ఇతను నె 532 రు వత్సకునికొడుకు.

556 దత్తుడు
557 పుల్కలుడు } ఈ ముగ్గురు నె 533 రు వృకునికొడుకులు.
558 సాళ్వుడు

559.........

560 ఇకను వసుదేవుని సంతతి దెల్పుచున్నాను.

561 వసుదేవుడు రోహిణి, పౌరవి, మదిర, కౌసల్య, రేచన, ఇళ, సహదేవి, శాంత, దేవాత్మజ, ఉపదేవి, శ్రీదేవి, దేవరక్షిత, సహదేవ, దేవకీదేవి వీరు వసుదేవుని భార్యలు.

562 బలుడు లేక బల
563 రాముడు
564 గదుడు
565 సారణుడు
566 దుర్మదుడు } ఈ యెనమండుగురు నె 561 రు వసుదేవునికి రోహిణియందు జనియించినవారు. ఇంకా మరికొంతమంది గలరు.
567 విపులుడు
568 ధృవుడు
569 కృతుడు

570 సుభద్రుడు
571 భద్రబాహువు
572 దుర్మదుడు
573 భద్రు-బూతుడు
574 దృవుడు

ఈ ఐదుగురు వసుదేవునకు పౌరవియందు జనించినవారు. మరికొందరు గలరు.

575 నందుడు
576 ఉపనందుడు
577 శ్రుతశ్రుతుడు
578 శూరుడు

ఈ నలుగురు మదిరయందు గలిగినవారు.

579 కేశి — ఇతడు వసుదేవునందు కౌసల్యకు పుట్టినవాడు.

580 అస్తుడు — ఇతను రేచనకు బుట్టినవాడు. మరికొందరుగలరు.

581 వల్కలుడు — ఇతడు శాంతకు పుట్టినవాడు.

582 త్రిపృష్టుడు — ఇతడు ఉపదేవికి బుట్టినవాడు.

583 ప్రశ్రమ
584 ప్రశ్రితుడు

వీరిద్దరు శ్రీదేవికి బుట్టినవారు.

585 కల్పుడు — ఇతడు దేవరక్షితకు బుట్టినవాడు. మరికొందరు గలరు.

586 గదుడు
587 జరూథుడు
588 శ్రుతముఖ్యుడు

వీరు సహదేవికి బుట్టినవారు. మరికొందరు గలరు.

589 కీర్తిమంతుడు
590 సుసేనుడు
591 భద్రసేనుడు
592 ఋజువు
593 భద్రుడు
594 సమదనుడు
595 సంకర్షణుడు
596 శ్రీకృష్ణుడు
597 సుభద్ర — ఈమె అర్జునుని భార్య.

నె 589 రు నుండి నె 597 రు వరకు దేవకీవసుదేవులయందు జన్మించినవారు.

598 ప్రద్యుమ్నుఁడు
599 అనిరుద్ధుఁడు
600 దీప్తమద్భానుడు
601 సాంబుడు
602 మిత్రుడు
603 బృహద్భానుడు
604 మిత్రవిందుడు
605 వృకుఁడు
606 అరుణుడు
607 పుష్కరుడు
608 దేవబాహుడు
609 శ్రుతదేవుడు
610 సునందనుఁడు
611 చిత్రభానుడు
612 వరూథుడు
613 కవి
614 న్యగ్రోధుడు

వీరలు శ్రీకృష్ణుని భార్యాష్టకమందు జనించిన ముఖ్యులు. వీరుగాక పదహారువేల గోపికలయందును, అష్టభార్యలయందును లెక్కింపరానిపుత్రులు జనించిరి. ఇందును గురించి భాగవతమందు దశమస్కంధోత్తర భాగమందు (మధుసూదననందనులు బహు ప్రజలు నధికాయురోన్నతులు ననల్పవీర్యవంతులు బ్రాహ్మణ్యులునై విఖ్యాతిబొందిరి. వారిని లెక్కింప పదివేల వత్సరంబులకైనం దీరదు. తత్కుమారులకు విద్యావిశేషంబుల నియమించు గురుజనంబుల సంఖ్య మూఁడుకోట్ల యెనుబది యెనిమిది వేల నూర్గురు గలియుగంబందు నక్కుమారుల లెక్కింప యెవ్వరికి వశంబుగా దనియునుంగాక) అని చెప్పియున్నది.

615 ఉపశ్లోకుడు

ఇతడు త్రివక్రి యనుదానికి శ్రీకృష్ణుని యందు జనియించినవాడు. జనకుండగు శ్రీకృష్ణదేవుని పాదారవింద సేవాభిరతుండగుచు నారద యోగీంద్రునకు శిష్యుండై యఖండజ్ఞాన భావాత్ముండగుచు స్త్రీశూద్ర దాసీజన సంస్కారంబై స్మరణమాత్రంబున ముక్తిసంభవించునట్టి సాత్వతతంత్రంబను వైష్ణవస్మృతి గల్పించె.

616 అనిరుద్ధుడు

ఇతడు శ్రీకృష్ణుని కొడుకగు నె 598 రు ప్రద్యుమ్నుని కొడుకు.

617 వజ్రుడు — ఇతడు నె 616 ఉ అనిరుద్ధుని పుత్రుడు. శ్రీకృష్ణుని మనుమడు. ఇతనినే కలియుగాది యందు మధురకును, యింద్రప్రస్థపురంబునకు సింహాసనస్థుని జేసిరి.

ఇచ్చటికి కలియుగాంతమువరకు గల రాజుల వివరము సమాప్తము.



# రెండవ భాగము

## కలియుగాది చంద్రవంశ క్షత్రియులు.

పరిక్షిన్మహారాజు — ఇతను శ్రీకృష్ణుని మేనల్లుడగు అభిమన్యుని కుమారుడు. హాస్తినాపురి రాజధానిగా భూమండలము పాలించినవాడు. ఇతడు శ్రీ శుకుల వారిచే శ్రీమద్భాగవతోపదేశము నొందె.

జనమేజయుడు
శ్రుతసేనుడు
భీమసేనుడు
ఉగ్రసేనుడు

ఈ నలువురు పరిక్షిన్మహారాజు కుమారులు.

శతానీకుడు — ఇతడు జనమేజయుని కుమారుడు.

సహస్రానీకుడు
అశ్వమేధజుడు
అశీమకృష్ణుడు
నీచకుడు
నప్తుడు
చిత్రరథుడు
శుచిరథుడు
వృష్టిమంతుడు

ఈ యిరవై ఆర్వురు అనగా సహస్రానీకుడు మొదలు క్షేమకుడు వరకు పరంపరా పుత్రసంతతిగా నెరుంగునది.

సుషేణుడు
సునీతుడు
నృచక్షుస్సు
సుఖానిలుడు
పరిప్లాదు
మేధావి
సునయుడు
శృతజయుడు
దూర్వాసుడు
సిమి
బృహాద్రధుడు
సుధాంశుడు
శతానీకుడు
దుర్దమనుడు
ఎహీనరుడు
దండపాణి
మితుడు
క్షేమకుడు

బ్రహ్మక్షత్రుడు — ఇతడు దేవఋషి సత్కృతుండై కలియుగంబున జనగలవాడు.

వజ్రుడు

ప్రతిబాహుడు — ఇతను వజ్రుని కుమారుడు.

సుబాహుడు — ఇతను ప్రతిబాహుని కొడుకు.

ఉగ్రసేనుడు — ఇతను సుబాహుని కొడుకు.

శతసేనుడు — ఇతను ఉగ్రసేనుని కొడుకు. మరిన్ని కృతివర్మ కుమారుడును, సాత్యకికుమారుడు మొ॥ వారు కలియుగంబున నిలచి నూటొక్క వంశములుగా నేర్పడిన శ్రీకృష్ణ సంతతియందు కొందరుప్రముఖులు యదుతుయంబునందు గలసినను ఒక్కమంది వంశాకరులై యుండిరి.

ఈక్రింది వంశవృక్షము చాళుక్యులగు చంద్రవంశ క్షత్రియులది.



15 విజయాదిత్యుడు (918) (14 వ చాళుక్యభీముని కుమారుడు)

16 అమ్మరాజవిష్ణువర్ధనుడు (918–925)

22 చాళుక్యభీముడు (934–945)

17 బేటవిజయాదిత్యుడు (925)

20 భీముడు (926–927)

24 దానార్ణవుడు (970–973)

23 అమ్మరాజవిజయాదిత్యుడు (945–970)

సత్యాశ్రయుడు

25 శక్తివర్మ (1003–1015)

26 విమలాదిత్యుడు (1015–1022)

విజయాదిత్యుడు

విష్ణువర్ధనుడు

27 రాజరాజు (1022–1063)

విజయాదిత్యుడు

మల్లప్పదేవుడు

28 రాజేంద్రకులోత్తుంగచోడదేవుడు (1063–1112)

విజయాదిత్యుడు

29 విక్రమచోడుడు (1112–1127)

రాజరాజు

వీరచోడదేవుడు

మల్లవిష్ణువర్ధనుడు. (1202)

30 కులోత్తుంగ చోడదేవుడు. (1127–1158)

31 రాజేంద్రచోడుడు. (1158–1200)

32 రాజచోడుడు. (1200–1235)

---

పై వంశవృక్షము చంద్రవంశములోని పూరుని సంతతివారైనందుకు దృష్టాంతము.

కం. విమలాదిత్య తనూజుడు, విమలవిచారుడు కుమార విద్యాధరుడు
త్తమచాళుక్యుడు విదితా, గమ విహితక్రముడు కుహీనకరుడురుకాంతిన్.

— భారతము – ఆదిపర్వము.

పైనజెప్పబడిన చంద్రవంశక్షత్రియుల వివరమంతయును భాగవతము నవమస్కంధమునందు జూచుకునేది.

వీ రేశలింగం పంతులుగారివలన రచింపబడిన ఆంధ్ర కవుల చరిత్ర ప్రథమభాగము 1 వ పేజీమొదలుకొని 14 వ పేజీవరకు చెప్పబడిన విధిప్రకారం.

విజయాదిత్యుడు:- ఇతను భారతముకృతినందిన రాజరాజనరేంద్రుని పూర్వుడు. ఇత డయోధ్యానగరమునుండి దక్షిణదేశముమీందికి గండెత్తివచ్చి త్రిలోచన పల్లవునితో యుద్ధముజేసి కాలధర్మమునొందగా భర్తవెంటవచ్చిన యితనిభార్య గర్భవతియైయుండి ముదివేము అగ్రహారమునకు తప్పించుకపోయి విష్ణుభట్ట సోమయాజి యను తమ పురోహితునిచే పుత్రికవలె నాదరింపబడి పుత్రునిగనిన విష్ణువర్ధనుడని పేరుబెట్టిన నతడువృద్ధియై తన తల్లివలన పూర్వవృత్తాంతము తెలుసుకొని చాళుక్యపర్వతమున తపస్సుచేసి తనతండ్రి రాజ్యమును వహించి నర్మద మొదలుగా సేతుపర్యంతము యేబదిలక్షలు గ్రామములుగల దేశమంతయు పాలించె. అప్పటినుంచి విష్ణువర్ధనుడను బిరుదునామము ఆవంశమువారికి పరంపరా వచ్చుచున్నది. ఈచాళుక్యవంశపు రాజులు రెండుశాఖలవారై ఒకశాఖవారు కల్యాణపురమందును రెండవశాఖవారు రాజమహేంద్రవరమందును రాజ్యము జేయుచుండిరి. వీరింగో కల్యాణరాజధానిగాగలవారు పడమటిచాళుక్యులు, కుంతలులు, రాజులనియు; రాజమహేంద్రవరము రాజధానిగాగలవారు తూర్పు చాళుక్యులు వేగిరాజులనియును వ్యవహరింపబడుచు వచ్చిరి. ఈ విష్ణువర్ధనునికి జయసింహుడను బిరుదునామమున్నది. ఇతడు కాంచీపుర రాజధానిగాగల పల్లవరాజు కుమార్తెను వివాహమాడెను. ఆమెవలన.

విజయాదిత్యుడు:- ఇతనికి రణరాగుడను బిరుదునామముగలదు.

పులికేశివల్లభుడు:— విజయాదిత్యుని కొడుకు.

కీర్తివర్మ పృథివీపతి, మంగళేశుడు:— వీరిరువురు పులికేశి వల్లభుని కొడుకులు. వీరిలో కీర్తివర్మ క్రీస్తుశకము 567 సం॥ వరకు రాజ్యము చేసెను.

పులికేశివల్లభుడు, కుబ్జవర్ధనుడు:— వీరిరువురు కీర్తివర్మ కొడుకులు. వీరిలో పులికేశివల్లభుడు తన పినతండ్రియైన మంగళేశుని యనంతరము 610 సం॥ రాజ్యమునకు వచ్చెను. ఇతను మిగుల బలవంతుడై బహుదేశములు జయించి ఆకాలమందు పిష్టపురమనబడెడి పీఠికాపురమునందలి దుస్సాధ్యమయిన దుర్గమును బట్టుకొనియెను. యనంతరమితని తమ్ముడగు కుబ్జవిష్ణువర్ధనుడు 615 సం॥ చైత్ర శు 15 మందు రాజ్యమునకు వచ్చి క్రీ. శ. 633 సం॥ వరకు రాజ్యమేలె. నితడు తూర్పు చాళుక్యపు రాజులకు మూలపురుషుడై పూర్వచాళుక్య రాజ్యస్థాపకుడయి వేగిదేశము బౌద్ధమతస్థులకు సాలంకాయన రాజులనుండి గైకొనబడుటచే యితనివలన నీయాంధ్రదేశమునందు బౌద్ధమతమునకు క్షీణత్వమును బ్రాహ్మణమతమునకు ప్రాబల్యమును ప్రారంభమయ్యెను. ఈ చాళుక్యరాజు శైవబ్రాహ్మణ మతస్థుడు. మానవ్యగోత్రుడు. శాలివాహనశకము 555 సం॥ శ్రావణ శు 15 లు నాటికి సరియగు క్రీస్తుశకము 632 సం॥ జులై 7 తేది చంద్రగ్రహణమున విష్ణుశర్మ, మాధవశర్మలను బ్రాహ్మణులకు దిమిలిశీమలోని కలవకొండగ్రామము దానముచేసి శాసనము వ్రాసియిచ్చెను.

౨. జయసింహుడు:— ఇతడు కుబ్జవిష్ణువర్ధనుని జ్యేష్టపుత్రుడు. క్రీ॥ శ॥ 633 సం॥ మొదలుకొని 663 సం॥ వరకు 30 సం॥ ములు రాజ్యముచేసెను. ఇతనికి సర్వసిద్ధియని బిరుదునామముగలదు.

ఇతడు గుడివాడతాలూకాలో పెణుపఱ్ఱు అను గ్రామ మొక బ్రాహ్మణునికి యిచ్చినట్లు దానశాశనమున్నది. ఇతని దేశము నెల్లూరి మండలమువరకు వ్యాపించియున్నది.

౩. ఇంద్రభట్టారకుడు:— ఇతడు జయసింహుని ద్వితీయ పుత్రుడు. ఇతనికి ఇంద్రరాజని బిరుదునామమున్నది. ఇంద్రరాజు 663 సంవత్సరము మొదలుకొని 7 రోజులు మాత్రము రాజ్యమేలి మృతుడయ్యెను.

౪. విష్ణువర్ధనుడు:— ఇతడింద్రభట్టారకుని కొడుకు. సర్వలోకాశ్రయుడనియును విషమసిద్ధియనియును బిరుదునామములు గల

యితడు క్రీ॥ శ॥ 663 సం॥ మొదలుకొని 672 సం॥ వరకు రాజ్యమేలె. ఇతడు రెండవ విష్ణువర్ధనుడు. ఇతడుచేసిన యొక దానశాసనమందు "ఆత్మనో విజయ రాజ్య పంచమసంవత్సరే ఫాల్గుణ మాసే అమావాస్యాం సూర్యగ్రహణ నిమిత్తమ్" అని శకవత్సర 560 సం॥ ఫాల్గుణ బ 15 లకు సరియగు క్రీ॥ శ॥ 668 సం॥ ఫిబ్రవరి నెల 17 తేది యితనిరాజ్యములో నైదవయేడని చెప్పుటచే యితనిరాజ్యము 663సం॥ ఫాల్గుణ బహుళములో నారంభమైనట్టు తెలుచున్నది.

5. మంగియువరాజు:— ఇతడు రెండవవిష్ణువర్ధనుని పుత్రుడు. ఇతనికిన్ని సర్వలోకాశ్రయుడనియు, జయసిద్ధుడనియును బిరుదునామములుగలవు. ఇతడు క్రీ॥ శ॥ 672 మొదలుకొని 696 సం॥ వరకు 25 సంవత్సరములు రాజ్యమేలెను.

6. జయసింహుడు, 7. కొక్కిలిరాజు, 8. విష్ణువర్ధనుడు:— ఈ ముగ్గురు మంగియువరాజు కొడుకులు. జయసింహుడుమాత్రము ప్రథమభార్య పుత్రుడు. ఈ జయసింహుడు 696 సం॥ మొదలుకొని 706 సం॥ వరకు 13 సం॥ లు రాజ్యమేలె. కొక్కిలిరాజు 709 సం॥ లో 9 నెలలుమాత్రం రాజ్యమేలె. విష్ణువర్ధనుడు జయసింహుని మరణానంతరము తనకు రావలసిన రాజ్యమక్రమముగా నాక్రమించుకున్న తమ్ముడగు కొక్కిలిరాజును సింహాసన విహీనునిచేసి 709 సం॥ మొదలుకొని క్రీ॥ శ॥ 746 సం॥ వరకు 30 సంవత్సరములు దేశమేలెను. ఇతను 3 వ విష్ణువర్ధనుడు.

9. విజయాదిత్యుడు:— ఇతడు మూడవ విష్ణువర్ధనునికొడుకు విక్రమరాముడనియు విజయసిద్ధుడనియు బిరుదునామములు గలవాడు. ఇతడు క్రీ॥ శ॥ 749 సం॥ మొదలుకొని 764 సం॥ వరకు 15 సం॥లు భూపాలనముచేసెను. ఇతడు విజయాదిత్య నామము గలవారిలో మొదటివాడు.

10. విష్ణువర్ధనుడు:— ఇతను విజయాదిత్యుని కుమారుడు. 764 సం॥ మొదలుకొని 799 సం॥ వరకు 36 సం॥లు రాజ్యభారము వహించెను. ఇతడు 4 వ విష్ణువర్ధనుడు.

11. విజయాదిత్యుడు:— ఇతడు విష్ణువర్ధనుని కొడుకు మొదటి విజయాదిత్యుని మనుమడగు యీరెండవ విజయాదిత్యునకు నరేంద్ర మృగరాజనియు సమస్తభువనాశ్రయుడని బిరుదునామములు వహించి 799 సం॥ మొదలుకొని 843 సం॥ వరకు 44 సంవత్సరములు రాజ్యమేలెను. ఇతడు గాంగులతోను రాష్ట్రకూటులతో బహుయుద్ధములు చేసి వారినిజయించి తనరాష్ట్రమునందు నూటయేనిమిది శివాలయములు కట్టించెను.

12. విష్ణువర్ధనుడు:— ఇతడు విజయాదిత్యుని కొడుకు యైదవ విష్ణువర్ధనుడు. సర్వలోకాశ్రయుడనియు విషమసిద్ధియనియు బిరుదాంకములు వహించి క్రీ॥ శ॥ 843 సం॥ మొదలుకొని 844 సం॥ వరకు 18 నెలలు రాజ్యమేలెను.

13. గణకవిజయాదిత్యుడు, విక్రమాదిత్యుడు, యుద్ధమల్లుడు:- ఈ మువ్వురు విష్ణువర్ధనుని కొడుకులు. వీరిలో విజయాదిత్యుడు గణిత శాస్త్రమునందు పండితుడగుటచేత గణక విజయాదిత్యుడని యందురు. ఇతడు రాష్ట్రకూటులజయించి మంగియువరాజు శిరస్సుఖండించి క్రీ॥ శ॥ 844 సంవత్సరము మొదలుకొని 888 సం॥ వరకు 44 సంవత్సరములు ప్రజాపాలనము చేసెను. ఇతనికి యువరాజు విక్రమాదిత్యుడనియు యుద్ధమల్లుడనియు యిద్దరు తమ్ములు గలరు.

14. చాళుక్యభీముడు:— ఇతడు యువరాజ విక్రమాదిత్యుని కుమారుడు. ఇతడు తనపెదతండ్రియైన విజయాదిత్యుని పిమ్మట రాజ్యమునకు వచ్చి రాష్ట్రకూటరాజయిన రెండవకృష్ణునిజయించి యీవరకన్యాక్రాంతమయిన వేగిదేశముయొక్క భాగమును మరల నాక్రమించుకొని 888 సం॥ మొదలుకొని 918 సంవత్సరములవరకు 30 సంవత్సరములు రాజ్యమేలెను.

15. విజయాదిత్యుడు, విక్రమాదిత్యుడు:— వీరిరువురు చాళుక్యభీముని కొడుకులు. వీరిలో జ్యేష్ఠుడగు యీనాలవ విజయాదిత్యుడు కళింగులను జయించి 918 సం॥ మొదలుకొని 6 మాసములు రాజ్యమేలి దేశవియోగమును పొందెను.

16. అమ్మరాజ విష్ణువర్ధనుడు, చాళుక్యభీముడు:— వీరిరువురు నాలవ విజయాదిత్యుని కుమారులు. వీరిలో జ్యేష్ఠుడగు అమ్మరాజ విష్ణువర్ధనుడు రాజమహేంద్రుడను బిరుదునామము గలవాడు. ఇతని కాలములోనే రాజధాని రాజమహేంద్రవరమునకు మార్చబడెననియు యాతనిపేరనే యీపట్టణమునకు పేరుకలిగినదనియు చెప్పుదురు. ఇతడు ఆరవ విష్ణువర్ధనుడు. ఈ అమ్మరాజు 918 సం॥ మొదలుకొని 925 సం॥ వరకు 7 సం॥లు భూపాలన మాచరించెను.

17 విజయాదిత్యుడు, భీముడు, దానార్ణవుడు, అమ్మవిజయాదిత్యుడు:— ఈ ఐదవ విజయాదిత్యునికి బేటరాజని నామాంతరము గలదు. ఇత డమ్మరాజుయొక్క జ్యేష్ఠపుత్రుడు. 925సం॥లో 15దినములు రాజ్యముచేసె. ఇతనిని యుద్ధమల్లునికొడుకైన తాళ్ళరాజు రాజ్యపదభ్రష్టునిజేసి చెరసాలయందుబెట్టి రాజ్యముగైకొనియెను.

18 తాళరాజు:— యుద్ధమల్లుని కొడుకైన ఈ తాళ్ళరాజు రాజ్యమాక్రమించుకొని 925 సం॥లో నెలదినములు రాజ్యపాలనము చేసెను. తర్వాత చాళుక్యభీముని ద్వితీయపుత్రుడను నాల్గవ విజయాదిత్యుని యనుజుడైన విక్రమాదిత్యు డీతనినిజంపి రాజ్యముగైకొనెను.

19 విక్రమాదిత్యుడు:— చాళుక్యభీముని కొడుకైన యీ రెండవ విక్రమాదిత్యుడు వేగిత్రికళింగదేశములను 925–26 సం॥లో 11 మాసములు పాలించెను. తర్వాత అమ్మరాజవిష్ణువర్ధనుని కొడుకగు భీము డీతనిని సింహాసన విహీనునిజేసి రాజ్యముగొనెను.

20 భీముడు:— ఇతడు అమ్మరాజ విష్ణువర్ధనుని కొడుకును ఐదవ విజయాదిత్యుని తమ్ముడునైన యీ మూడవ భీముడు విక్రమాదిత్యుని జయించి 926–27 సం॥లో 8 మాసములు రాజ్యముచేసెను. తర్వాత తాళ్లరాజు కొడుకైన యుద్ధమల్లు డీతనినిజంపి రాజ్యముచేకొనెను.

21 యుద్ధమల్లుడు:— తాళ్ళరాజు కొడుకైన రెండవ యుద్ధమల్లుడు. ఇతడు 927 సం॥ మొదలుకొని 934 సం॥ వరకు 7 సంవత్సరములు రాజ్యముచేసెను. తర్వాత నాలవ విజయాదిత్యుని ద్వితీయ పుత్రుడైన చాళుక్యభీముడు జయింప రాజ్యపదభ్రష్టుడయ్యె.

22 చాళుక్యభీమ విష్ణువర్ధనుడు:— ఇతడు చాళుక్య భీముడు, 7వ విష్ణువర్ధనుడైన నాలవ విజయాదిత్యుని రెండవభార్య కొడుకు. అమ్మరాజవిష్ణువర్ధనుని సవితి తమ్ముడు. ఇతడు గండనుపేంద్రుడు రాజమార్తాండుడు అను బిరుదులు గలవాడై చోళరాజయిన లోవబిక్కి, రాష్ట్రకూట ప్రభువైన ఐదవ గోవిందరాజు మొదలైనవారిని జయించి 934 సం॥ మొదలు 945 సం॥ వరకు పండ్రెండేళ్లు రాజ్యమేలె.

23 అమ్మరాజవిజయాదిత్యుడు:— ఇతడు పై రెండవ చాళుక్య భీముని రెండవ కుమారుడు. ఇతడు శాలివా॥ శ॥ 867 సం॥ మార్గశిర బ ౧౩ శుక్రవారమునకు సరియగు క్రీస్తుశకం 945 సం॥ డిశంబరు నెల 5 తేదీని పట్టాభిషిక్తుడైనట్లు చెప్పబడినది. ఇతడు రాజపరమేశ్వర త్రిభువనాంకుశాది బిరుదాంకములు గలవాడై క్రీ॥ శ॥ 945 సం॥ మొదలుకొని 970 సం॥ వరకు 25 సం॥లు రాజ్యము పరిపాలించెను.

24 దానార్ణవుడు:— ఇతడు రెండవ చాళుక్యభీముని జ్యేష్ఠ పుత్రుడు. అమ్మరాజ విజయాదిత్యుని సవతియన్న. ఇతడు 970 సం॥ మొదలు 973సం॥ వరకు 3సం॥లు రాజ్యముచేసెను. ఒకశాసనములో నితడు 30 సం॥లు రాజ్యము చేసినట్లున్నది గాని 973 సం॥ మొదలు 1003సం॥వరకు 30సం॥లు దేశమరాజకమైనట్టు తెలియవచ్చుచున్నది. ఈకాలములో చోళులు యీదేశముపై దండెత్తివచ్చి గెల్చినట్లును కొంతకాలము వేగిదేశము పాలించినట్లును కనుబడుచున్నది.

25 శక్తివర్మ, 26 విమలాదిత్యుడు:— వీరిరువురు దానార్ణవుని కొడుకులు. వీరిలో శక్తివర్మకు చాళుక్యచంద్రుడను బిరుదు పేరు గలదు. ఇతడు 1003 సం॥ మొదలుకొని 1015 సం॥ వరకు 12సం॥లు దొరతనము జేసెను. దానార్ణవుని రెండవకొడుకు విమలాదిత్యుడు. ఇతడు రాజేంద్రచోళుని చెల్లెలును, గంగికుండైన రాజరాజకేసరివర్మ కూతురు నగు కుందమాంబాదేవి అను చోడరాజకన్యకను వివాహమాడి, యీమెవలన నాంధ్రభాష భారత కృతిపతియగు రాజరాజ నరేంద్రుని గనెను. రాజనరేంద్రునిది మాతామహునిపేరు. విమలాదిత్యుడు 1015 సం॥ మొదలు 1022 సం॥ వరకు 7 సం॥లు ప్రభుత్వము

జేసెను. ఇతనికి విష్ణువర్ధనుడను నామమొకటి యున్నది. ఇతను గోదావరి మండలములోని పెనుగొండలోనుండిన కుసుమశెట్టియను కోమటి యొక్క కుమార్తెను కామించి తన కిమ్మని యడుగగా, ఒప్పుకొనని సందున బలాత్కారముగా విష్ణువర్ధనుడు పట్టుకొనగా కుసుమశెట్టియును, కూతురును, 102 గోత్రముల యితర వైశ్యులును అగ్నిప్రవేశమైనట్టును, వైశ్యులలో 100 కుటుంబములు పడమరకును, 80 కుటుంబములు తూర్పునకు, 200 కుటుంబములు దక్షిణమునకును, 130 కుటుంబములు ఉత్తరమునకును పారిపోయినట్లు, కన్యకాశాపమువలన విష్ణువర్ధనునికి శిరస్సు వ్రక్కలై చచ్చినట్లును, అంతట నతని పుత్రుడైన రాజనరేంద్రుడు వైశ్యులను శాంతపరచి కుసుమశెట్టికొడుకైన విరూపాక్షుని 18 పట్టణములకు అధికారినిగ జేసి, మిగిలిన కోమట్లను పెనుగొండలో నుండునట్లు జేసెనని ఆంధ్రకవులచరిత్రము 144 పేజియందు చెప్పబడియున్నది.

27 రాజరాజవిష్ణువర్ధనుడు:— ఇతడు ఆంధ్రభారత కృతిపతి విమలాదిత్యుని పుత్రుడైన రాజరాజనబడినవారిలో మొదటివాడు. విష్ణువర్ధనులలో యెనిమిదవవాడు (విష్ణువర్ధనుండు వంశవర్ధనుండు) అని ఆంధ్రభారతములో సహిత మీ రాజనరేంద్రునకు విష్ణువర్ధన నామమున్నట్లు జెప్పబడియున్నది. ఇతడు తన మేనమామయగు రాజేంద్ర చోళునికూతురైన యమ్మంగదేవిని వివాహమాడెను. ఇతను శకసం॥ 944 సం॥ భాద్రపద బ ౨ గురువారము నుత్తరాభాద్ర నక్షత్రమున అనగా క్రీస్తుశకము 1022 సం॥ ఆగష్టునెల 16 తేదీన పట్టాభిషిక్తుడయ్యెను. ఇతని తమ్ముడు విజయాదిత్యుడు కులోత్తుంగచోళదేవుని కాలములో వేగిదేశమునకు పాలకుడుగా నుండెను. ఈ రాజనరేంద్రుడు 1022 సం॥ మొదలుకొని 1063 సం॥ వరకు 41 సంవత్సరములు రాజ్యపాలనము చేసెను.

28 కులోత్తుంగచోళదేవుడు:— ఇతడు రాజరాజనరేంద్రుని ప్రథమపుత్రుడు. ఇతడే రాజేంద్రచోడుడు. ఇతని మొదటిపేరిదే యైనను యితడు వేగిదేశ రాజ్యభారమువహించిన మొదటి సం॥లోనే చోడదేశముమీద దండెత్తి దానిని జయించి స్వాధీనపరచుకున్న

తర్వాత కులోత్తుంగచోళదేవు డనబడుచు వచ్చెను. ఇతనికి రాజ నారాయణుడని బిరుదు పేరు. ఈతనిని కలికాలచోళుడనియు వాడుచు వచ్చిరి. మూడు తరములనుండి చోళరాజుల కూతులను వివాహ మాడుచు వచ్చుటచేత తమ తల్లులను బట్టియు, భార్యలను బట్టియు చాళుక్యుల కంతకంతకు వేగిదేశమునకంటె చోళదేశమున నభిమాన మెక్కువయగుచు వచ్చెను. విమలాదిత్యుని రాజరాజు కూతురైన కుందమాంబాదేవిని వివాహమాడి తనకుమారునకు రాజరాజను పేరు బెట్టెను. రాజరాజు తనకు మేనమామయైన రాజేంద్రచోళుని కూతు రైన అమ్మంగదేవిని పెండ్లియాడి తనపుత్రునకు రాజేంద్రచోళు డని నామకరణముచేసెను. తర్వాత రాజేంద్రచోడుని కూతురైన మధు రాంతకదేవిని పరిణయముచేసుకొని చోడదేశముమీదనే అధికారము గలవాడై తానాదేశమును జయించినతోడనె తన రాజధానిని చోడ దేశమునకు మార్చుకొని వేగిదేశమును పాలించుటకై పాలకులను నియమించి రాజ్యాధికారమును వారికి విడిచిపెట్టెను. 1063 సం॥నందు వేగిదేశమును పరిపాలించుటకై కులోత్తుంగచోడదేవుడు తన పిన తండ్రియైన విజయాదిత్యుని నియమింపగా ఆతడు 15 సం॥లు రాజ్య పాలనముచేసి 1077 సం॥లో చోడదేశమునకు పోయిచేరెను. తరువాత 1077 సం॥లోనే వేగిదేశ పాలనమునకై తన రెండవకుమారుడైన రాజరాజును బంపిన నతడక్కడ నుండనొల్లక మరుసటి సంవత్సరము లోనే తల్లిదండ్రులవద్దకు లేచిరాగా 1078 సం॥ నందు శ్రావణమాస ములో తన మూడవకొడుకైన వీరచోడదేవుని వేగిదేశపాలునిగా బంపెను. ఈ వీరచోడదేవుడు 9 వ విష్ణువర్ధనుడను బిరుదుపేరుతో 1100 సం॥రము వరకు వేగిదేశాధిపతిగా యుండెను. కులోత్తుంగ చోడదేవునికి విక్రమచోడుడు, రాజరాజు, వీరచోడదేవుడు మొద లుగా గలవారు కొడుకులును, రాజసుందరి యను కూతురును గలిగిరి. ఈ రాజసుందరి కళింగరాజైన రాజరాజునకు భార్యయయ్యెను. కులో త్తుంగచోడదేవుడు 1063 సం॥ మొదలు 1112 సం॥ వరకు 49 సం॥లు రాజ్యముచేసెను.

29 విక్రమచోడుడు:— ఇతడు కులోత్తుంగచోడు డనబడెడు రాజేంద్రచోడుని జ్యేష్ఠకుమారుడు. ఇతడును కొంతకాలము వేగిదేశ పాలకుడుగా నుండెను. ఇతని తండ్రియొక్క మరణానంతరము వేగి దేశమును విడచి చోళరాజ్యమును వహించుటకు బోయెనని యొక శాసనమున్నది. ఇతడు 1112 సం॥ మొదలుకొని 1127 వరకు 15 సంవత్సరములు రాజ్యముచేసెను.

30 కులోత్తుంగ చోడదేవుడు:— ఈ రెండవ కులోత్తుంగుడు విక్రమచోడుని కొడుకు. ఇతను 1127 సం॥న రాజ్యమునకు వచ్చెను. ఇతడు చోళరాజ్యమును 1158 సం॥ వరకును పాలించెను. ఇతనికొడుకు రాజేంద్రచోడుడు 12 వ శతాబ్దమువరకు, రాజేంద్రచోడుని కొడుకు రాజరాజచోడుడు 1232 సం॥రము వరకును చోడరాజ్యము పాలించినట్లు కనుపడుచున్నది. ఈ రెండవకులోత్తుంగచోడదేవుని కాలములో వేగిదేశ మితరచాళుక్యుల యధీనమైనట్లు స్పష్టముగా కనుపడుచున్నది. 1202 సంవత్సరమందు మల్లవిష్ణువర్ధనుడు వేగిదేశపు ప్రభువుగా నుండి నట్లొక శాసనమున్నది. ఆ శాసనమునందె యతని తండ్రి విజయాదిత్యుడు చిరకాలము వేగిదేశమును పాలించినట్లు చెప్పబడియున్నది. వీనినిబట్టి చూడగా రెండవ కులోత్తుంగ చోడదేవుని కాలములోనే విజయాదిత్యుడు వేగిదేశ రాజ్యత్వము వహించినట్లు తోచుచున్నది. ఈ విజయాదిత్యుడు పై వివరింపబడిన 17వ తూర్పుచాళుక్య రాజగు బేటవిజయాదిత్యున కారవతరమువాడు. బేటవిజయాదిత్యుని కొడుకు సత్యాశ్రయుడు. సత్యాశ్రయుని కొడుకు విజయాదిత్యుడు. విజయాదిత్యుని కొడుకు విష్ణువర్ధనుడు. విష్ణువర్ధనుని కొడుకు మల్లప్పదేవుడు. మల్లప్పదేవుని కొడుకు వేగిదేశపు ప్రభువైన విజయాదిత్యుడు. 1228 సంవత్సరము కృష్ణా గోదావరి మధ్యమందున వేగిదేశమంతయు గణపతిరాజుల యధీనమైనది. కులోత్తుంగచోడదేవుని కాలమునుండియు చాళుక్యచోడు లందరును తాము వేగిదేశమును విడచి చోళుల బిరుదావళులు వహించి తాము చోళులుగానె పరిగణింపబడుచు వచ్చుట చేత వారినిగూర్చి యిందు వివరించుట అనావశ్యకము. చాళుక్యులు చంద్రవంశపు రాజులు. చోళులు సూర్యవంశపు రాజులు.

భారతము—ఆదిపర్వము

కం. విమలాదిత్యతనూజుడు । విమలవిచారుడు కుమారవిద్యాధరు డు
త్తమచాళుక్యుడు వివిధాగమ విహితక్రమముడు తుహినకరు డురుకాంతిన్

చ. హిమకరుదొట్టిపూరు భరతేశకురుప్రభు పాండుభూపతుల్
క్రమమున వంశకర్తలనగా మహినొప్పిన యస్మదీయవం
శమున బ్రసిద్ధులయి విమలసద్గుణ శోభితులైన పాండవో
త్తములచరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట మెంతయున్.

ఇట్లు భారతము గృతిగోరి నన్నయభట్టునుగూర్చి రాజరాజ నరేంద్రుడనగా పైవంశమందు జూపిన (నె27రు) రాజరాజు పలికినట్లు చెప్పియున్నది.

జైమినిభారతము కృతిగొన్న చంద్రవంశ క్షత్రియుడగు సాళువ గుండ నృశింహరాజుని వంశవివరము.

గుండరాజు:—ఇతడు జైమినిభారతయును గృతిగొన్న నృశింహరాజుయొక్క వంశమునకు మూలపురుషుడు. ఇతడు హూణ శకము 1390 సం॥ మొదలుకొని 1397 సం॥ వరకు రాజ్యపరిపాలనము చేసినట్లు బళ్ళారిమండల చరిత్రమందు వ్రాయబడినట్లు ఆంధ్ర॥ చ॥ ప్ర॥ 145 పేజీయందు కలదు.

వీరతోబళరాజు, మాదయ్య, గుండబమ్మడు, సాల్వమంగ రాజు, సావిత్రిమంగరాజు:— ఈ యేవురు గుండరాజు కుమాళ్లు. వీరిలో సాళ్వమంగరాజు దక్షిణసురతానుని జయించి తెలుగురాయుని తండ్రియగు సాంపరాయునికిచ్చి, సాంపరాయ స్థాపనాచార్య బిరుదు వహించి శ్రీరంగనాథుని ప్రతిష్టించి 6000 మాడ లాదేవునకు వుమ్మ డిగా నిచ్చె. పరపక్షసాళువ యను బిరుదు వహించె.

జైమినీభారతము

సీ॥ దురములోదక్షిణ సురతాను నెదిరించి కొనివచ్చి సాంపరాయునికిచ్చి
సామ్రాజ్యమునునిల్పి సాంపరాయస్థాపనాచార్యబిరుదువిఖ్యాతిగాంచె
శ్రీరంగవిభు బ్రతిష్టించి యర్వదివేలమాడలదేవు నుమ్మడికినొసగె
మధురాసురత్రాణు మడియించి పరపక్షసాళువబిరుదంబు జగతినెరపె

గర్భితసముః దేజిమొగంబుగట్టి తరిమినగరంపుగవనులు విరుగదోలి
తానువేసి గొరుఁ నుద్ధవిడిదెచ్చె। సాహసంబుననుప్పొంగుసాళ్వమంగు॥

సింగరాజు, గుండశౌరి, గౌతిరాజు, సానడిరాజు, హనుమ
రాజు, ఉల్లామల్లిరాజు:— వీరు ఆరుగురు సాళ్వమంగరాజు కుమాళ్లు.

గుండరాజు, బొప్పరాజు, సాల్వతిప్పరాజు, సాళ్వరాజు:—
ఈ నలువురు గౌతవరాజు కొడుకులు. వీరిలో గుండరాజు 1421 సం॥
మొదలుకొని 1428 సం॥ వరకు రాజ్యముచేసినట్టు అనగా బళ్ళారి
మండలములోని యానెగొంది సంస్థానము పాలించుచుండినట్లు బళ్ళారి
మండలచరిత్ర సంగ్రహమువలన తెలుపబడి యున్నదనియు, యితడు
జైమినిభారతము కృతియందిన నారసింహ్వారాజు తండ్రియనియును
గలదు[1] ఆం॥ ప్ర॥ 145 పేజీ.

మరిన్ని హరిహరరాజు కడపటి దినములలో యితను మంత్రి
గాను దండనాధుడుగానుండి కొంతరాజ్యము సంపాదించెను. వీరిలో
మూడవవాడగు సాళువతిప్పరాజు మీసరగండకటారి సాళ్వపంచ
ఘంటానినాదాది బిరుదులు గలవాఁడు.

తిమ్మరాజు, నృసింహరాజు:— వీరిరువురు గుండరాజుకొడుకులు.
వీరిలో నృసింహరాజు దేవరాయలు సంతానములేక మృతుడౌటవల
ననో యేలాగో కర్నాటరాజ్యము నాక్రమించుకొనియెను. మరిన్ని
భోనగిరి దారాపురి పెనుగొండ మొదలయిన దుర్గములు జయించి
యేలినవాడు. ఈయనతల్లి మళ్ళాంబ. ఈ నృసింహరాజు అన్నయగు
తిమ్మరాజు ఇతడు కృష్ణదేవరాయల తాతయగు యీశ్వరరాజుతండ్రి.
ఇతడు పరమయోగి విలాసమును రచించినవాఁడు. ఈ తిమ్మరాజు
కుమారుడగు యీశ్వరరాజు పినతండ్రియగు నరసింహ్వానృపాలునివద్ద
దండనాథుడుగా నుండెనని వరాహపురాణ పీఠికయందుగలదు. మరిన్ని
యీనృసింహ్వారాజు అనంతరము దాయాదిమైనట్టియు సేనానాయకు
డైనట్టియు ఈశ్వరరాజు యితని రాజ్యమును వహించె. ఇందులో
కొన్ని హంశములు ఆంధ్ర॥ చ॥ రెండవభాగం అనగా మధ్యకవుల
భాగములో 7 పేజీ చూచుకొనునది.

ఈజైమినిభారతము కృతియందిన క్షత్రియులు చంద్రవంశజులును పాండవాదుల సంతతివారైనందుకు.

జైమిని. భార. అశ్వ. ప్ర.

చ. ఉడుపతి వంశకర్త మహిమోన్నతి కెయ్యది మేర నాడు పా
ల్కడలి జనించినప్పు డు దళంబుగ నంటిన మేనిజిడ్డిబో
గడుగుకొనంగ నబ్బెనని కాశిపునొదల యేటపాదముల్
దడబడ నోలలాడుచు హళాహళి గావని నీదులాడెడిన్.

శా. ఆవంశంబున నుద్భవించె నమితక్ష్మాధీశ కోటీరకో
టీవిన్య స్తవినూత్నరత్నరుచి నాటీవిస్ఫురత్పాద రా
జీవద్వంద్వుడు గుండశౌరి జయలక్ష్మీ కంధరాబంధుర
గ్రైవేయాంతర పద్మరాగసఖ దోఃఖడ్గ ప్రతాపాఢ్యుడై.

ఉ. భారతవంశమండనుడు పాండవగాండివ ముక్తబాణ సం
భావరత ప్రభావనుతి పారగు డంచిత గోమహీతులా
భారతిదంగదాన పరిపాకసమగ్ర యశోవిలాసశో
భారతశాల గుండనరపాల నృసింహుడు గహ్వరస్థలిన్.

స్వారోచిషమనుచరిత్ర కృతియందిన కృష్ణదేవరాయుల వంశ వివరణము.

తిమ్మరాజు:— ఇతడు యయాతి మహారాజు కుమారుడగు దుర్వాసుని వంశమునందు జనించిన వాడనియు యితనిది తుళువాన్వయ మనియు మనుచరిత్ర ప్రథమాశ్వాసములో చెప్పియున్నది. ఇతను జైమినిభారతము కృతియందిన నృసింహరాజు అన్నయును, యీ నృసింహరాజువద్ద మంత్రిగాను దండనాథుడుగా నుండిన యీశ్వరరాజు తండ్రి యితడే. పరమయోగి విలాసమును రచించినవాడు.

ఈశ్వరరాజు:— ఇతడు తిమ్మరాజు కుమారుడు. ఇతని భార్య బుక్కమ్మ. ఇతడు నృసింహరాజునొద్ద దండనాథుడుగా నుండి కొన్ని దేశములు జయించినట్లు వరాహపురాణమందు—

సీ. ఉదయాద్రిభేదించె హుత్తరినిర్జించె గండికోటపురంబు గదలద్రవ్వె
పెనుగొండసాధించె బెంగులూరుహరించె గోవెల నెల్లూరుగుంటెపరచె.

కుందాణి విదళించె గొడుగుచింత బాగోరుపంచము పాడుచేసె
నరుగొండపెకలించె నామూరుమర్దించె శ్రీరంగపురమును బారిసమరె
రాయచౌహత్తమల్ల ధరావరాహ
మోహనమురారి బర్బరభావులసాళ
నారసింహ ప్రతాపసన్నహనుడగుచు
విశ్వహితకారి తిమ్మయ యీశ్వరుండు.

ఇట్లు వుదయగిరి మొదలయిన దుర్గములు సాధించినాడనియు, ఆం॥ రెండ॥ భా॥ 1–2–3 పేజీలు చూచేది.

నృసింహదేవరాయలు, తిమ్మరాజు:— వీరిద్దరు యీశ్వరరాజు కొడుకులు. వీరిలో నృసింహదేవరాయలు వరాహపురాణము కృతి యందెను. ఇతనిని సాళ్వనృసింహరాయలనికూడా చెప్పుదురు. ఇతని రాజధాని బళ్లారిమండలములోని ఆనెగొందికిసమీపమున తుంగభద్రా తీరమునందున్న విజయనగరము. విద్యానగరమనియును నామాంతరము కలదు. ఇతడు శాలివాహనశకము 1487 సం॥ మొదలు 1508 సం॥ వరకు రాజ్యమేలెను. ఇందులో కొన్ని హంశములను ఆం॥ రెం॥ భా। 5–6–7 పేజీలు చూచుకునేది.

వీరనృసింహదేవరాయలు, కృష్ణదేవరాయలు:— వీరిద్దరు నృసింహదేవరాయల కుమాళ్లు. వీరిలో వీరనృసింహదేవరాయలు 1487 సం॥ మొదలు 1509 సం॥ వరకు విజయనగర సంస్థానాధిపతియై రాజ్యమేలె. అనంతర మితనితమ్ముడగు కృష్ణదేవరాయలు 1509 సం॥ మొదలు 1530 సం॥ వరకు రాజ్యమేలె. ఈకృష్ణదేవరాయలు వుదయగిరి దుర్గము కొండపీటిదుర్గము కోనదేశము కొట్టాములను దేశము కనకగిరి దుర్గము, గోదావరిదేశము, పోట్నూరను పట్నము యీ మొదలయిన దుర్గములను జయించినట్టు చెప్పబడియున్నది.

మను. ప్ర.

సీ. తొలుదొల్త నుదయాద్రి శిలదాకితీండ్రించు నసిలోహమున వెచ్చనైజనించెమరికొండవీడెక్కిమూర్కొని నలియైనయలకసవాపాత్రునంటిరాజె
నటనాగి జమ్మిలోయబడి వేగదహించె గోనబిట్టేర్చె గొట్టానదగిలె
కనకగిరిస్ఫూర్తిగరచెగౌతమిగ్రాచెనవులనాపొట్నూరువులుకొనియె

మాడెములు వ్రేల్చె నొడ్డాది మసియొనర్చె
గటకపురి గాల్చె గజరాజు గలగి పరవ
దోశ చిచ్చన నార యుద్ధురత గృష్ణరాయ
బాహుప్రతాప జాగ్రన్మహాగ్ని.

పారిజాతాపహరణము

సీ. వుదయాద్రి వేగనత్యుద్ధతిసాధించె వినుకొండ మాటమాత్రనహరించె
కూటముల్ చెదరంగ కొండవీడగలించె బెల్లముకొండయచ్చెల్లజెగచె
దేవరకొండ యుద్వృత్తి భంగముసేసె జల్లిపల్లె సమగ్రశక్తి గూల్చె
గినుకమీఱుననంతగిరి క్రిందుబడజేసె గంబంబుమెట్టు గ్రక్కనగదల్చె
బలనిశానము కాలిమట్టుల నడంచు
గటకమును నింకననుచు నుత్కలమహీశు
డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయ విభుడు.

మనుచరిత్రను

చం. అభిరతి కృష్ణరాయుడు జయాంకములన్ లిఖియించి తాళస
న్నిభముగ బొట్టునూరికడ నిల్పిన కంబము సింహభూధర
ప్రభు తిరునాళ్లకున్ దిగుసురప్రకరంబు కళింగమేదినీ
విభు నపకీర్తి ఖజ్జలము లేమరుబెట్టు పఠింత్రు నిచ్చలున్.

ఇతడు పొట్నూరివద్ద విజయస్తంభము నిల్పినాడనియు, గోల్కొండ ఓరుగల్లు మొదలైన సంస్థానంబులను జయించి దక్షిణ హిందూస్థానమంతయు నేలెను. వడ్డెరాజులైన గజపతులను, తురుష్కరాజులైన యశ్వపతులను, తెలుగురాజులైన నరపతులను జయించుటచేత మూరురాయరగండడని బిరుదు గలిగినది. మహారాజాధిరాజ పరమేశ్వర ఆదిరాజ విజయ భాషాగీత ప్రవర రాయరగండ యవనరాజ్య సంస్థాపనాచార్య వరప్రతాపాది బిరుదాంకములు గలవాడు. ఇతడు పారిజాతాపహరణము, స్వారోచిష మనుచరిత్రము మొదలైన ప్రబంధములు కృతులందినవాడు. మదాలస చరిత్రము, సత్యవధూప్రీణనము, సకలకథా సారసంగ్రహము, జ్ఞానచింతామణి,

రసమంజరి మొదలైన సంస్కృత గ్రంథములును యీ కృష్ణదేవరాయలచే రచియింపబడెను. ఆంధ్రమునందు ఆముక్తమాల్యదయను (విష్ణుచిత్తీయమను నామాంతరముగల) గ్రంథంబొకటి రచింపబడెను.

ఇతనిది తుళువవంశము. ఇంటిపేరు సాళువవారు. పూర్వులది వరకు వచియించిన గ్రామనామములనుబట్టి సంపెటవారనియు, సెలగోల వారనియు గృహనామము గలదు. కళింగదేశాధిపతియైన ఓడ్రదేశమును పాలింపుచున్న ప్రతాపరుద్రదేవుడు తనకుమార్తెయైన తిరుమలదేవిని రాజునకిచ్చి సంధిచేసుకొనెను. కనుక రాజమహేంద్రవరము వరకు గల కళింగదేశమును మరల ప్రతాపరుద్రదేవున కిచ్చె. ఇతడు తుంగభద్రానదికి వంతెన గట్టించె. ఓరుగంటి ప్రతాపరుద్రుని సంతతిలో కడపటివాడైన వీరరుద్రగజపతిని వింధ్యపర్వత ప్రాంతములకు పారదోలి అతని కుమార్తెయైన చిన్నాదేవిని గాంధర్వవివాహమందె. కృష్ణదేవరాయల భార్యలు ఓబమ్మ, తిరుమలదేవి, చిన్నాదేవి.

అచ్చుతదేవరాయలు:— ఇతడు కృష్ణదేవరాయల అల్లుడు. కృష్ణదేవరాయల అనంతరము రాజ్యము పాలించెను.

ఈకృష్ణదేవరాయలు దాసీపుత్రుడని కొందరు వాడుచుందురు. ఈవాడుకకు కారణము ఇతను వైష్ణవమతమునందత్యంతాభిమానియై శైవ స్మార్తులను గౌరవింపక తాతాచార్యుల యిష్టముతో వర్తించి శైవ స్మార్తమతము లడుగంటునట్లుచేసిన కారణముచే మతద్వేషులు యీయనయందీయపవాద మల్లి నిందించినట్లు తోచుచున్నది. అప్పయదీక్షిత చారిత్రమె యిందుకు దృష్టాంతము.

హరిహరరాయలు (1336–1350), బుక్కరాయలు(1350–1379) హరిహరరాయలు (1379-1401), విజయబుక్కరాయలు (1401–1418), పల్లబుక్కరాయలు (1418–1434), గౌడదేవరాయలు (1434–1454), రాజశేఖరరాయలు (1454–1455), విజయభూపతి (1455–1456), ప్రౌఢదేవరాయలు (1456-1477), వీరప్రతాపదేవరాయలు (1477–1481), మల్లిఖార్జునరాయలు (1481–1487), రామచంద్ర రాయలు(1487-1488), విరూపాక్షరాయలు (1488-1490), నృసింహ

రాయలు (1490-1495), నరసరాయలు (1495-1504), వీరనృసింహ రాయలు (1504-1509), కృష్ణదేవరాయలు (1509-1530).

ఈపైన జెప్పబడు సంగతులనుగురించి ఆం॥ రెం॥ బా॥ 1 నుండి 29 పేజీవరకు చూచుకునేది. ఈ కృష్ణదేవరాయల వంశము చంద్ర వంశ క్షత్రియులైనందుకు దృష్టాంతం - మను॥ ప్రథమాశ్వాసం.

క. వానికి బురూరవుడు ప్రభ। జ్ఞానిధియుదయించె సింహసదృశుడు తద్భూ
జానికినాయువుతనయుం। డై నెగడెనతండుగ నె యయాతినరేంద్రుం.

క. అతనికియదుదుర్వసులను। సుతులుద్భవమొందిరహితసూదనులుకళా
న్వితమతులు వారిలోపి। శ్రుతకీర్తి వహించె దుర్వసుడు గుణనిధియై.

తే. గీ. వాని వంశంబు తుళువాన్వవాయమయ్యె
నందు బెక్కండ్రు నృపు లుదయంబునొంది
నిఖల భువన ప్రపూర్ణనిర్నిద్రకీర్తి
నధికులైరి తదీయాన్వయమున బుట్టి.

వసుచరిత్రము కృతిగొన్న చంద్రవంశ క్షత్రియుడగు తిరుమల దేవరాయని వంశమును గురించి వసుచరిత్ర ప్రకారము.

పిన్నరాజు, సోమదేవుడు, రాఘవరాజు, పిన్నశౌరి, బుక్క రాజు, రామరాజు:— పిన్నరాజు భరతవంశస్థుడు. ఇతడు మొదలు కొని యీయార్వురు పుత్రపరంపరగా నెరుంగునది. వీరిలో బుక్క రాజు క్రీస్తుశకము 1473 సం॥ మొదలు 1481 సం॥ వరకు రాజ్యమే లెను. వీరి యింటిపేరు ఆర్వేటివారు. వీరిలో రామరాజు కందనూలు గ్రామమందుండినవాడు.

తిమ్మరాజు, కొండలరాయుడు, శ్రీరంగరాజు:— ఈ మువ్వురు రామరాజు కొడుకులు. వీరిలో శ్రీరంగరాజు సంతతివారు మాత్రము రాజసింహాసనాంకురమై నిలచిరి.

కోనమరాజు, తిమ్మరాజు, రామరాజు, తిరుమలదేవరాయలు, వెంకటరాయలు, లక్కమాంబ, ఓబమాంబ, కోనమాంబ:— వీరు శ్రీరంగరాజు కుమాళ్ళు అయిదుగురు, కూతుళ్లు మువ్వురు. వీరిలో

రామరాజు కల్యాణపట్టణము, పెనుగొండపట్టణము సాధించి కర్నాట ప్రభుస్థానము వహించిన నగాకందనూలు మొదలుకొని గోదావరి పర్యంతము శత్రువులను జయించి రాజ్యమేలినవారు. ఇతను కృష్ణ దేవరాయల అల్లుడు. వీరిలో లక్కమాంబా కుమారుడు నర్సరాజు. ఇతను కావ్యాలంకార సంగ్రహమను నరసభూపాలీయమును కృతి నొందెను. ఓబమాంబా కుమారుడైన గొబ్బూరి నర్సరాజు రామా భ్యుదయమును కృతిగొనెను. కోనమాంబా కుమారుడైన తిమ్మరాజు పరమయోగి విలాసమును రచించెను. ఈతిమ్మరాజు కృష్ణదేవరాయల అల్లుడైన అళియరామరాజునకు తోడబుట్టినపడుచైన కోనమాంబకు కుమారుడైనందున వసుచరిత్రము కృతినందిన తిరుమలదేవరాయలకు మేనల్లుడు. ఇట్లు పరమయోగి విలాసములో చెప్పియున్నది. శ్రీరంగ రాజు కుమారుడును కృష్ణదేవరాయల అల్లుడును అయిన రామరాజు తదనంతరము తిరుమల దేవరాయడు 1567 సం॥ నంను తనరాజధానిని పెనుగొండకు మార్చెను. 1574 సం॥ వరకు రాజ్యమేలెను. ఇతని పేర వసుచరిత్రము కృతిచేయబడెను. ఇతను గోదావరీ దేశమేలు నిజాంఖానుని జయించెను. ఈ తిరుమలదేవరాయని భార్య వెంగళాంబ.

రఘునాధరాజు, శ్రీరంగరాజు, శ్రీరాంరాజు, వెంకటరాయుడు:— ఈ నలుగురిని తిరుమల దేవరాయలు వెంగళాంబయందు గనెను. వీరిలో శ్రీరంగరాజు తిరుమల దేవరాయల ప్రభుత్వమందు యువ రాజుగానుండి కుంతల, లాట, వత్సకాంచీ దేశములను సాధించినాడు. శ్రీరామరాజు సముద్రము, కావేరి మధ్యభూమియందలి శ్రీరంగపట్ట ణము సాధించి యేలినవాడు.

వెంకటరాయుడు:— చంద్రగిరి దుర్గమున కధిపతి.

రామరాజు:— ఇతను కృష్ణరాయల కుమార్తెయగు మోహ నాంగి పెనిమిటి. ఇతను గుత్తి, పెనుగొండ, గండికోట, ఆదవేని మొదలగు దేశములు గెలిచినట్లు చెప్పియున్నది.

కర్నాట రాజ్యము కృష్ణదేవరాయల కుమారుడు అచ్యుత దేవరాయల తదనంతరము కృష్ణదేవరాయల రెండవకుమారుడు సదా

శివరాయలు బాలుడగుటచేత ఆక్రమించుకున్న సలకము తిమ్మరాజును యీరామరాజు పాండోలి సదాశివరాయల రాజ్యము స్థాపించెను. అందునబట్టి క్రీస్తుశకము 1542 సం॥ మొదలు 1564 సం॥ వరకు ఇతడు రాజ్యముచేసి తల్లికోటయుద్ధములో మహమ్మదీయులచేత కాలధర్మము నొందెను. ఇతనికి అళియరామరాజను మరియొక పేరు గలదు.

నరపతి విజయం.

సీ. సకలవిభు తిమ్మరాజు సేనలనుద్రుంచి
గుత్తి పెనుగొండ మరి గండికోట కంద
నూలుపుర మాచవేన సలీల గెలచి
తొలుదొలుత రామనృపతి దోర్బలము మెరసి.

చెవ్వరాజు:— ఇతడు కృష్ణదేవరాయని రెండవ యల్లుడు. కృష్ణదేవరాయలు గాంధర్వవివాహమొందిన చిన్నాదేవి కుమార్తె పెనిమిటి.

కృష్ణరాజు, పెదతిమ్మరాజు:— వీరిరువురు యీరామరాజు కొడుకులు. నరపతివిజయమందిట్లు గలదు. రామరాజు తదనంతరము కుమారుడైన కృష్ణరాజునకు రావలసిన విజయనగరపు సంస్థానపు హక్కు రామరాజు తమ్ములైన తిరుమలరాయడు, వెంకటపతిరాజును ఆక్రమించిరి. యిందులో కొంశములు కొన్ని ఆంధ్రకవుల చరిత్ర రెండవ భాగము 89 మొదలు 104 పేజీవరకు చూచుకొనేది. యీ పైనజెప్పిన వారు చంద్రవంశ క్షత్రియులనుటకు దృష్టాంతము.

వసు. ప్రథ. ఆశ్వా.

శా. ద్వీపపోర్భవ సూక్తపంచమ మహావేదంబు దీపించె నే
భూపాలోత్తముపేర భారతియు నేపుణ్యాత్ము వంశస్థవం బా
పాదించి కృతార్థయయ్యె నతడా శాంతనూమాపాలన
వ్యాపారాభిరతుండు వొల్చు భరతుం డాత్రేయగోత్రేయుడై॥

ఉ. ఆభరతాన్వయంబున రణాధ్వరయూపభుజుల్ మహాధరి
త్రీభుజు లుద్భవించిరి యుధిష్ఠిరముఖ్యులు విశ్రుతాఖ్యు లు
ర్వీభరణప్రవీణులు వివేకధురీణులు దానదీక్షితా
గ్రాహితులున్నధీయుతులు దారదయాహృదయుల్ శుభోదయుల్॥

కం. ఆ సంతతి వైభవజిత । వాసవుడగు తాతపిన్న వసుధాధిపుడు
ద్భాసిల్లె గీర్తిమయము । క్రాసాధ సువర్ణ కలసితవిభావసుడై.

పంచతంత్రము రచియించిన చంద్రవంశక్షత్రియుడగు వెంకట రాజు వంశవిషయము.

నాళుపరాజు, బైచరాజు:— వీరిరువురు వెంకటరాజు మూల పురుషులు. చంద్రవంశక్షత్రియులు.

తిరుమలరాజు:— ఇతడు బైచరాజు కుమారుడు.

వీరభద్రరాజు:— ఇతడు తిమ్మరాజు కుమార్తెయగు తిప్పమ్మ వలన తిరుమలరాజుకు జన్మించినవాడు. ఈ వీరభద్రరాజు తుంకల్ల శ్రీపతిరాజు పుత్రికయగు లింగమక్కను పెండ్లియాడె.

లింగరాజు, పర్వతరాజు:— వీరిరువురు వీరభద్రరాజు కొడుకులు. వీరిలో పర్వతరాజు పోలేపల్లి తిమ్మరాజు పుత్రికయగు అన్న మ్మను పరిణయమయ్యెను.

వేంకటనాధరాజు:— ఇతడు పర్వతరాజు కుమారుడు. ఆంధ్ర భారతమువలెనె హరిహరనాధునిపేర పంచతంత్రమను గ్రంథమును కృతియిచ్చినకవి. ఇతనిది చంద్రవంశమైనందుకు దృష్టాంతము.

పంచతంత్రము. ప్రథ. ఆశ్వా.

ఉ. ధీరత రాజవంశ జలధిన్ ప్రభవించె మహావిరోధి సం
హారవిహారి సాళ్వబిరుదాంకుడు బయిచనృపాలు డద్ధరి
శ్రీ రమణీమనోహరుని తీవ్రయశశ్రుతికిన్ హరాద్రి నీ
హారవసుంధరాధరములయ్యె సమగ్రవిహార శైలముల్.

కలియుగమునందు యదువంశక్షత్రియుల వివరము

ఏలరాజు:— ఇతను వజ్రునికొడుకు అని చెప్పెదరుగాని ప్రమాణ విహీనము. అయితే ఆసంతతివాడైనది నిశ్చయము.

కవులావుల గంగరాజు:— ఇతని భార్య గంగమ్మ. ఇతను యలమంచిపట్టణ ప్రభువు. వీరిరువురకును పుత్రసంతతిలేక శివుని పూజించి, ఆయన కరుణచే నలుగురుకుమారులను బడసిరి.

వలరాజు, హరిగోపాలుడు, నందగోపాలుడు, గోవర్ధనుడు:— వీరు నలుగురు గంగరాజుకొడుకులు. ఈ గంగరాజు పెద్దకుమారుడగు వలరాజునకు యలమంచిపట్టణము పట్టాభిషేకము జేసి, యితని యదు వంశజుడగు తిరుమందుల ముత్తంరాజును మంత్రిగా నియమించెను.

యలమంచికి ఉత్తరముగానున్న ఖండమొండెముల పట్టణము నకు ప్రభువునైన యాదువంశజుడగు కలభూత గంగరాజనువాని తండ్రి మరణించినప్పుడు గంగరాజు మైనరై యుండగా అయ్యలరాజు, శివ రామరాజు, భాస్కరరాజు, దత్తరాజు, కన్నమరాజు, భీమరాజు అను ఆర్గురు నియోగిప్రధానులచే మైనరులెరిప్పున మంత్రులుగా నియమించి యీమంత్రులచే రాజ్యతంత్రమును గడుపుచుండగా భీమరాజుతప్ప తక్కిన అయిదుగురుమంత్రులు సర్కారుపైకము నాలుగులక్షలు కుంపు చేసి హరించినసంగతి ఆరవమంత్రియైన భీమరాజుచే తెలుసుకొనబడి మైనరువెళ్ళినతరువాత తనిఖీచేసి శిక్షించగా పైకము ఆరుమాసము లలో వప్పగించెదమని చెప్పిపోయి యలమంచిప్రభువగు వలరాజు చెంతజేరి యతనిచే నాదరింపబడి గంగురాజునకు వలరాజునకు కల హము గలిగించినందున వలరాజుచే ఖండమొండెములకోట జయింప జేసి గంగురాజును గంగరాజు తమ్ములగు రంగధామరాజు, రఘురామ రాజు, చినగంగరాజు, అనుమురంగధామరాజు, సేనాధిపతి రామ లింగన్న యనువాడు యితనున్ను వలరాజుసేనాధిపతి పులిమద్దుల రామన్నయు కొంతయుద్ధము జరిపి పిమ్మట ముష్టియుద్ధములో యిద్దరు మరణించిరి. పిమ్మట వలరాజు సేనాధిపతి కొంతయుద్ధముచేసి రంగ ధామరాజు బావమరిదియగు రాజగోపాలరాజుని గవిసి బాకులను పుచ్చుకొని కొంతయుద్ధముచేసి మరణించిరి. తర్వాత హరిపాలుని ఆజ్ఞపుచ్చుకొని ఖండారుమల్లుడనువాడు యుద్ధమునకుతరలి పాపన్న యను సర్దారుతోపోరి తుదకిద్దరు మరణించిరి. రంగధామరాజును హరిపాలుడు యిరువురుపోరి తుదకు మరణించిరి. రఘురామరాజును నందగోపాలరాజును గవిసి తుదకు యిరువురు మరణించిరి. గోవర్ధన రాజును చినగంగరాజు దలపడి వారునుమరణించిరి. పిమ్మట కలభూత గంగరాజున్ను వలరాజున్ను కొంతయుద్ధముచేసి గంగురాజునుజంపి

రాజ్యముచేకొని తిరిగి గంగరాజు భార్య శరణుజొచ్చుటచే యతని కుమారునకు రాజ్యమిచ్చి పూర్వపుకరణములను యథాప్రదేశముల నుండునట్లాడంబరచి పిమ్మట యుద్ధమందు తగిలిన ఘనగాయములతో వైకుంఠముచేరెను. ఈ వలరాజునకు మంత్రియు బంధుగుడును నగు తిరుమందుల ముత్తంరాజు యీవలరాజు - ఒకానొక సమయమున యరణ్యమున వేటాడునప్పుడు ఒకచిన్నవాడు దొరికినందున తన కుమార్తెయగు నాగమాంబకు సంతతిలేమిచే నామెకిచ్చిన పెంచిపెద్ద వానిచేసిన పిమ్మట యతనిబుద్ధి వైశాల్యమునకు అద్భుతశక్తికిమెచ్చి మంత్రిగా నియమించెను.

ఈ పల్లికొండ యనువాడు శ్రీవిష్ణునియాజ్ఞచే యాదవులను వైకుంఠము జేర్చుటకయి పాలసముద్రమునగల కమలమందు జనించి చాలకాలము తపముజేసి వలరాజునకై యరణ్యములో వేచియుండు టచే నిలవరాజునకు దొరికినట్టు చెప్పుదురు. అయితే యీ యాదవు లతనిని శ్రీవిష్ణ్వవతారముగా చూచుచు యితని యనుమతిమీద సర్వదా నటింతురు.

గంగురాజు:— యితను వలరాజుకొడుకు.

అవులవలరాజు:— ఇతను గంగురాజు కొమారుడు. యలమంచి పట్టణపు ప్రభువని చెప్పుదురు. ఇతనిభార్య అవులమల్లాంబ. ఇంటిపేరు అవులవారై యుండి పేరువలరాజు అవుటనుబట్టియె భార్య మల్లాంబకు అవులవారని చెప్పబడినట్టున్నది.

సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజు, కొమరక్క:— వీరు అయిదుగురు అవులవలరాజు కొడు కులు. వీరిలో సింహాద్రిరాజు శ్రీకూర్మపట్న మేలినవాడనియు సింధు దేశపురాజగు భళ్ళానిరాజుతో చంద్రగిరిదుర్గములో జరిగిన యుద్ధ మందు ఇతను మరణించెను. రెండవవాఁడు పెద్దిరాజు. ఇతనిభార్య పెద్ద మాంబ. ఇతనికి సంతతిలేనందున బస్వపూజచేసి పంపాద్రియను పట్ట ణమువిడిచి తమ్ముడగు పోలురాజును సభిషిక్తునిజేసి మేనల్లుడగు పల్లి కొండరాజును మంత్రిగానియమించి కళ్యాణ పట్టణమార్గములోవున్న వీరగంటిపట్టణము విజయపట్టణమునకు ప్రభువగు వాలకేతరాజువలనను

నవరత్నపట్నరాజగు హయవాహనుడను రాజుచేతను వోరుగంటి పట్నమందుగల ఆంజనేయరాజుచేతను రేపల్లి భద్రాచలమందుగల నిమ్మరాజుచేతను సన్మానింపబడి అంతట ఘూహేశ్వరనగరము మొదలైన పట్నములుదాటి కల్యాణపట్టణముచేరి ఇతను అర్లపెంటవద్ద జరిగిన యుద్ధములో వాలకేతులిరాజుచే పెద్దిరాజు మరణించినాడు. ఇతనికి పుష్యనక్షత్రమందుపుట్టిన పాపనూకయను కన్యకు దొనకొండ నామాంతరముగల ధనముకొండ అడివిలో మేడకట్టించినాడు. ఇతనికి కాటంరాజను కొడుకుగలడు. వీరిలో యరనూకరాజు, కనిగిరి, యేనుగనాధునికొండ అను నామాంతరములుగల కాళహస్తి ప్రభువనియు, ఇతనికి బట్టావుల రాజను నొక కొడుకుగలడు. ఇతనిభార్య సీతాంబ.

నలనూకరాజు:— ఇతనిభార్య శీతాంబ. చట్టావారి యర్రంరాజు నొకపుత్రుడుగలడు. ఇతడు బెజవాడపట్టణమేలువాడు.

పోలురాజు:— ఇతడు శ్రీరంగపట్టణమువద్దవున్న చెరుకూరు పట్టణమేలువాడు. ఇతనికి మంత్రి పందుముల పాపయ్య. ఇతనికి నలువురు కొడుకులు. ఇతనిభార్య సిరిదేవి. ఇతడు చిలకమర్రిక్రింద డేరాలుతోనుండగా చోడదేశమురాజు ఆదేశమందుగల శైవమతస్తులగు జంగములను మతవైషమ్యముననో యెందుకో వెట్టిచేయించుచుండగా ఇతను శైవమతమునందు అభిమానము గలవాడవుటచే బాధపడలేక 500 కుటుంబముల జంగాలు ఈయనకు శరణుజొచ్చుటచేత వారిని రక్షించుటకై దేవగోవగు వంటికొమ్ము బొల్లిఆవును యేడునందులు అనగా యెద్దులను కొంతసైన్యమును యిచ్చి ఆజంగాలను శ్రీశైలము పంపినందున చోడునితరపున మురిహరు డనువాడు వచ్చి జంగాలను చేపట్టితివను కారణమున చోడునకు పోలురాజునకు కలహముపెంచి చిత్రభానునామ సంవత్సరమందు యుద్ధము ప్రారంభించి చోళరాజు బంధువులగు కాలయ్య, విట్టయ్యలు పెంచుకున్న బ్రాహ్మణచిన్నది పార్వతమ్మయను నామెకొమారుడగు ముక్కంటుడను బ్రాహ్మణునిచే చెరుకూరివద్ద చిలకలమర్రిక్రింద ఘోరయుద్ధము జరిగి యితనిచే పోలురాజు మరణించెను.

కరియావులరాజు, చిటినూక:—ఇతను నలనూకరాజుకొడుకు. కూతురు చిటినూక. ఈపిల్లను కన్నందుల పోల్నీడు అను పోలురాజు మంత్రికియిచ్చిరి. పోలురాజుకొడుకు అయితెవరాజును ఇతడును యలమంచి పట్టణమేలుచుండి యొకప్పుడు (గారికొండ) లేక గమిడికొండ యందుగల శంభుని పూజించుటకు పల్లెకొండరాజు మొదలైనవారితో వచ్చేవరకు ఓరుగంటి పట్టణ ప్రభువగు ప్రతాపరుద్రుడు ఈఅయితెవరాజు కలియావులరాజు మొదలైనవారియందు కలుషించి వీరివృత్తాంతమును తెలిసికొని వచ్చుటకై బట్టునొకని పంచుటయు నతడు వారి ప్రభావమును కొనియాడి ప్రతాపరుద్రునితో చెప్పుటచేత విషాన్న ప్రయోగమొనర్చుటకు కపటమర్యాద లొనర్చుట యెరింగి దైవభక్త్యోపవాస కారణముచే నాయుపద్రవము తొలగించుకొని శివుని పూజించుటకు భేతాళుడనువాని తోటయందు పూజకోయించి తెప్పించిన, ఆ కారణముగా ప్రతాపరుద్రుని సేనాధిపతియగు భేతాళునకును కరియావులరాజునకును యుద్ధము జరిగి భేతాళాదులను జయించిరి. అయితే వీరికి పెదమొగలిపట్టణము, చిన్నమొగలిపట్టణము, ద్వారవతి, యెలమంచిపట్టణము, అర్లకొండ, పంపాద్రిపట్టణము కాణాచిగా యుండినట్లు తెలుపబడియున్నది.

కాటంరాజు, పాపనూక (స్త్రీ):—వీరిరువురు పెద్దిరాజు కుమారుడు,కుమార్తె. ఈకాటంరాజు వుండునది తొలుత కల్యాణపట్టణము. అందుండి ఏకారణముననో ఇతనికి ఆవులకాయించడమె పనిగానున్నది. పశులదోలించుకొని శ్రీశైల పర్వతమునకువచ్చి అచ్చటి పర్వతప్రాంతములయందు పశ్వుల మేపుచు 12 సంవత్సరములుండి ఆ దేశమునకు క్షామము కలుగుటచే అచ్చటనిలుచుటకు వలనుపడక పల్నాటి ప్రభువైన వెలమవర్ణుడగు పద్మనాయనితో స్నేహముచేసి పశువులమేతకు పుల్లరిబీడులకై నెల్లూరిప్రభువైన సూర్యవంశ క్షత్రియుడగు మనుమసిద్ధిరాజు దేశమునకువెళ్ళి బీడులవిషయములో కలహముజరిగి కాటంరాజు తాలూకు దొనకొండ, యెలమంచి, కల్యాణము మొదలైన పట్టణములలోనున్న అన్నదమ్ముల సహాయము పుచ్చుకొని పద్మనాయుడితో గలసి యెర్రగడ్డపాటిలో గొప్ప యుద్ధము జరగబడి

యందు నందరు మరణించిరి. తొలుత ఈ కాటమురాజు స్త్రీ దేవతల కొలువవని యొక పట్టుకలదట. ఈ కొమములో గంగాదేవి తనను కొలువమని చెప్పిన కొలువనందున నీరులేకుండా చేయుటచే పశు ఘోషను సహించలేక గంగనుగూర్చి యిప్పుడు పశువులకు కోరినన్ని వుదకము ప్రవహింపజేసితివేని కొలిచెదనని ప్రార్థించిన పాలేరుప్పొంగి ప్రవహించెనట! అందువలన అప్పటినుండి యాదవులు గంగను యిల వేల్పుగా కొలుచుచునుండిరి.

మనుమసిద్ధిరాజు, యర్రసిద్ధిరాజు, పాపసిద్ధిరాజు, నలసిద్ధిరాజు, కుమారసిద్ధిరాజు ఈసూర్యవంశ క్షత్రియులు ఐదుగురు అన్నదమ్ములు. వీరికి సేనానాయకుడు నవితిక్కన తమ్ముడు ఖడ్గతిక్కనయనియు 1300 క్రీస్తుశకమందు యుద్ధము జరుగబడినట్లు చెప్పబడియున్నది.

బట్టావులరాజు:— ఇతను యరనూకరాజు కొడుకు.

చిట్టావారి యర్రయ్య:— ఇతను నలనూకరాజు కొడుకు.

బత్తినిరాజు, అయితరాజు, ముమ్మరాజు, అగుమంచిరాజు:— ఈ నలుగురు పోలురాజు కుమాళ్లు. వీరిలో బత్తినిరాజు అనువాడు శ్రీశైలమఠములోనున్నాడు. తక్కినవారందరు యర్రగడ్డపాటి యుద్ధములో చనిపోయినారు. పిమ్మట వీరివంశమువారు కొందరు కటకాది ప్రాంతములయందు జనిరి.

పోలురాజు కుమారుడగు బత్తినిరాజు శివభక్తుడును ఎఱ్ఱగడ్డపాటిలో జరుగుయుద్ధకాలములో బత్తినిరాజు వారణాశియందు విశ్వేశ్వరు సేవగోయుండి అవధూతాశ్రమము గైకొని చాలాదినములకు తన శిష్యులగు కొందరి జంగమశిష్యుల గూడుకొని శ్రీశైలము వచ్చి అచ్చటనుంచి నందికనమ మార్గమున దొనకొండకువచ్చి బాల్యమందు విడచిన యీయన తల్లియగు శిరిదేవియనునామెను వీక్షించిన ఆమె పెట్టిన బిక్షమంటక కాటంరాజు చెల్లెలగు పాపనూక సమాచారమడుగగా నామెజనించిన నక్షత్రము పుట్టింటివారి వంశక్షయమగు దోష నక్షత్రమని చెప్పుటచే పెండ్లిచేయక అడవిలో గృహమేర్పరచి యుంచబడియెనని చెప్పినందున అంతట తనతల్లి తెచ్చినఅన్నము యుర

గడ్డపాటి యుద్ధములో చచ్చిన దాయలకు పిండప్రదానము చేసెద
ననియు తమ గోగణమందుగల దేవపశ్వు అగు బస్వదేవునిచే యుద్ధపు
వర్తమానము చేసెదననియు యుద్ధములో తనతమ్ములు మొదలయిన
వారు మరణించినవార్త తెలిసిన యెడల యీ దొనకొండలో గల
యాదవస్త్రీలందరు చిచ్చురుకవలసినదిగా ఆజ్ఞయిచ్చి తాను యుద్ధ
ప్రదేశమగు పాలేరను నదీతటమునకు బోవుచుండగా మధ్య మసియను
వాగువద్ద పైనచెప్పిన బస్వదేవుడు యుద్ధమందు తగిలిన బాణాది
యాయుధముల నాటులచేతను యెదురై యావర్తమానము సూచిం
చిన యాబసవని దొనకొండకు పంపించి, నల్గూరివద్దవున్న పాలేరుకడ
యట్టిగడ్డపాటిలో జరిగినయుద్ధమందు పడినవీరులయిన్న, నలసిద్ధిరాజును
నరికిన కాటమరాజును, పట్టిసిద్ధిరాజును దునిమిన కరియావుల
రాజును, గండగోపాలుని యుత్తరించిన అయితవరాజును, మనుమసిద్ధి
రాజు బరిమార్చిన బట్టావులరాజును, పాపసిద్ధిరాజును పెద్దనిదుర
బుచ్చిన పెయ్యాల యర్రన్నయును, పుంఁడ్రవెల్లి వీరగోపాలుని ఖండిం
చిన ముమ్మరాజును, శ్రీకంఠమురాజును జయించిన బత్తినరాజుమరిది
యగు యుత్తమరాజును, తిరుమాళతిప్పరాజును దృంచిన వెలమకర్ణు
డును, పల్నాటిప్రభువగు చానకూళనాయుడును, గుత్తిభీమరాజును
బరిమార్చిన చట్టావారి యట్టియ్యను పశ్చిమల తిమ్మరాజును గీటణం
గించిన పచ్చందుల పోచరాజును మరికొందరి వీరాగ్రేసరులును
గోగణమును గుఱ్ఱములు ఏనుగులు మొదలయిన సైన్యము రణమందు
పడియుండుట జూచి చింతించి పెద్దిరాజు మంత్రియగు పందుములపల్లి
కొండరాజుకడకువచ్చి యీసంగతియావత్తు విశదపర్చుకొని అందుకు
సమీపముననున్న మంగవెల్లిపాటికివచ్చి గోసంగుల సేనాధిపతులగు
భీమన్నయనువానిని చెన్నప్పయనువానినిజూచి వారలుచేసిన యద్భుత
రణమునకు మెచ్చి ప్రాణావశిష్టముగానున్న బీరన్నయనెడు వీరాగ్రే
సరునకు పల్లికొండ యొక్క యొడంబడికె యివ్వబడెను. ఈలోకమందు
వీరస్వర్గమందిన పురుషుల పేరులను యొకవీరకత్తులుచేయించి జాతర
యొకటిచేయుట మర్యాద కలదు గావున అట్టియుత్సవమందు యీ
గోసంగవీరుల తమతో వీరస్వర్గమందినందున బీరన్న చెన్నప్పలకును

వీరస్వర్గమందిన దేవగోవులగు బస్వదేవుని వంటికొమ్ము బొల్లియావులకును పైవీరులతోపాటు వీరికత్తులువుంచి కొల్పులు చేయించెదమని ఒప్పుకొనిరి. పిమ్మట బత్తినరాజు చేరేవరకు రణభూమిలో భేతాళాది భూతములును యితర మృగములును కంక (గ్రద్ధా)ది పక్షులు ముట్టకుండా కాపాడిన కులదేవతయగు గంగకు బలులుబోనాలతో కొలచెదమని చెప్పి దాయాదులకు తల్లియిచ్చిన భిక్షచే పిండములు వేసిన పిమ్మట దొనకొండనుండు యీ వీరాగ్రేసరుల భార్యలు మొదలుగాగల స్త్రీలందరు చిచ్చురికి స్వర్గముచేరిరి. ఇప్పటికి ♦దొనకొండలో గంగ జాతరయును కాటమరాజు యుద్ధధర్మములును వీరులపూజా మొదలయినవి జరుగుచునే యున్నవి.



## చంద్రవంశక్షత్రియులు నిత్యనైమిత్తికాది వేదోక్తకర్మల భ్రష్టత్వము పొందుటకు కారణములు.

ప్రశ్న:—ఇప్పుడు మీరుజెప్పిన గొల్లలనువారు చంద్రవంశక్షత్రియులని విస్పష్టముగా తెలిసినదికాని వీరలీ కలియుగమం దాచరింపవలసిన నిత్యనైమిత్తికాది వేదోక్త కర్మలు అనగా గర్భాధానమాదిగాగల షోడశకర్మలును స్నానాదినిత్యకర్మలును ఆచరింపకుండుటకు కారణమేమి?

ఉ:—ఈచంద్రవంశక్షత్రియులకు నిత్యనైమిత్తికాది వేదోక్తకర్మ భ్రష్టత్వము యీ దిగువను కనుపరచిన 7 కారణములచే కలిగినది. యీకారణము లెవ్వియనిన (1) పశుపాలనము (2) పురోహితవిహీనము (3) విద్యావిహీనము (4) దుష్టరాజన్యపరిపాలనము (5) దరిద్రము (6) దేశాచారము (7) యుగాచారము. యీ యేడు కారణములచే యీ చంద్రవంశక్షత్రియుల కిట్టి లోపము సంభవించినది.

---

♦ వెంకటగిరిరాజాగారి ప్రభుత్వములోనున్న కశ్చేడుకద్ద దొనకొండ.

(1) పశుపాలన.

దుష్టరాజన్యభీతిచే భూపాలనతత్త్వాదులు వదలి పశుపాలనో ద్యోగము జీవితవృత్తిగా నంగీకరించి గిరిగహనవసతులయందు వసించుచు అనావృష్టిదోషములయందును పశువులకు సంభవించెడు రోగ మృగభయాదులందును, అభివృద్ధియందును, పశుక్షేమమునకై నానా దూర దేశాటనముజేయుచు నానాదేశాచార సాంకర్యత్వముగలిగి స్థిరనివాసత్వము సిద్ధింపక నహోరాత్రులు పశువులమందలు గూర్చుకొని తమపుత్రమిత్ర కళత్రబాంధవానీక మొక్కొక్కచో పల్లెల నేర్పరచుకొని స్నానసంధ్యానుష్ఠానాది నిత్యకర్మలకును గర్భాధానాది నైమిత్తికకర్మలకును లేశమాత్ర మవకాశము దొరుకక నాపశువుల వలన సంభవించిన పాలు, వెన్న మొదలయిన పదార్థములచే జీవింపుచు గురుపురోహిత విహీనులై గోపరిపాలనమే ధర్మార్థకామ మోక్ష చతుర్విధ ఫల పురుషార్థదాయకమని యెంచి వర్తించుటయు.

(2) పురోహితవిహీనము.

పైనజెప్పిన పశుపాలన వృత్తిగలవారికి పురవాసత్వములేక నిరంతరారణ్యాచలవాసులగుటచే పురోహితా సంభవులై యందున ధర్మాధర్మ నిర్ణయబోధవిహీనతగలిగి వేదోక్తకర్మాచరణ పరోక్షమగుటయును.

(3) విద్యావిహీనము

పై 1 2 కారణములచే విద్యాభ్యాసులుగాక ధర్మశాస్త్ర శోధన చేయనేరక తమకుగల విధుల నెరుంగకుండుటయును.

(4) దుష్టరాజన్య పరిపాలనము.

మ్లేచ్ఛాది యన్యమతస్థులు భూపతులై యుండుటచే కులాచార ధర్మపరిపాలనము లేకపోవుటయును ధర్మశాసనులగు బ్రాహ్మణ సహాయ రహితులై దుష్టభూపతుల యసహిష్ణుత్వమువలన నాచారాది గౌరవములచే తలజూపరాక నారాజాశ్రితులయిన పరమత కుల గౌర వాస్తూయాధికారుల వంచనలకు లోబడి నానాటికి స్వధర్మములు మట్టుపడుటయు.

(5) దరిద్రము

క్షత్రియులకుగల షోడశకర్మలు అనగా (1) గర్భాధానము. (2) పుంసవనము (3) సీమంతము (4) జాతకర్మము (5) నామకర్ణము (6) నిష్క్రమణము (7) అన్నప్రాశనము (8) చూడాకరణము (9) కర్ణవేధ (10) ఉపనయనము (11) వేదారంభ క్రియావిధి (12) కేశాంతము (13) స్నాతకము (14) ఉద్వాహము (15) వివాహాగ్ని పరిగ్రహణము (16) త్రేతాగ్ని సంగ్రహము ఇవియన్నియు ద్రవ్యవిహీనముగ జరుగునవికానందున దరిద్రస్థితిలో కొన్ని సంక్షేపించు కొనుటయును.

(6) దేశాచారము — బోధాయనః.

పంచధావిప్రతిపత్తిః దక్షిణత అనుపనీతేన భార్యయాసహ భోజనం పర్యుషితభోజనం మాతుల దుహితృపితృష్వసృదు హితృ పరిణయమితి॥ తథో త్తర ఊర్ణవిక్రయ శీధుపాన ముభయతో దద్భిర్వ్య వహార ఆయుధీయకం సముద్రయానమితి॥ తాత్పర్యము॥ దక్షిణదేశీయు లలో ఉపనయముకానివాని పొత్తునభుజించుటయు భార్యపొత్తున భుజించుటయు చలిది గు...చుటయు మేనమామ కూతురిని పెండ్లి యా...టయు మేనత్తకూతురిని పెండ్లియాడుటయు వుత్తర దేశీయు లలో బొచ్చు నమ్ముటయు కల్లు ద్రావుటయు కంచరగాడిదల మలగ లెత్తుటయు ఆయుధములు ధరించుటయు ఓడ లెక్కిపోవుటయు ఇవి ధర్మములుగా బోధాయనుల వారిచే చెప్పబడియున్నది. ప్రత్యక్షాను భవమును కలదు. ఇది కర్మలోపమున కెట్లు సూచించుచున్నదనిన ఇట్టి శాస్త్రవ్యతిరేకాచారము లాయాదేశములయందు చెల్లుచున్నం దున ఆచారము కర్మప్రాపకత్వమగుటచే ఆచారలోపముకలిగినప్పుడు కర్మలోపముకూడా కలదనియును నానాదేశవాసత్వముచే వీరలకు కొన్ని కర్మలోపము లాగంతుకముగా సంభవించిన వనుట.

(7) యుగాచారము

మత్స్యపురాణము 160 అధ్యాయము కలియుగే

శ్లో॥ అహంకార గృహీతాశ్చ ప్రక్షీణ స్నేహబంధనాః ।
విప్రాశ్శూద్ర సమాచారాః స్వంతి సర్వే కలౌ యుగే॥

తా॥ అహంకారము గలవారు స్నేహబంధము లేనివారు శూద్రాచారపరులగు బ్రాహ్మణులు కలియుగమందు కలుగుదురు.

శ్లో॥ ఆశ్రమాణాం విపర్యాసః కలౌ సంపరివర్తతే ।
వర్ణానాం చైవ సందేహో యుగాంతే రవినందన॥

తా॥ ఓయి సూర్యపుత్రుడా! కలియుగమందు వర్ణాశ్రమములు తారుమారగును.

విష్ణుపురాణము యుగధర్మము.

శ్లో॥ వర్ణాశ్రమాచార వతీప్రవృత్తిర్న కలౌ ।
నృణాంనసామయజు ఋగ్వర్గ వినిష్పాదనహేతుకాః॥

తా॥ కలియుగమునం దాయావర్ణములవారికి నాయాయాశ్రమముల నియమములగు యాచారములతో కూడిన నడవడులు కలిగి యుండవు.

విష్ణుపురాణము.

శ్లో॥ నిస్సారా పృథివీ నిరౌషధిలతా నీచామహత్వం గతా।
రాజానోర్థ పరాయణాశ్చ సతతం విప్రావికర్మస్థితాః॥
భార్యాభర్తరివైరబుద్ధి నిరతా పుత్రా పితృద్వేషిణః
ఇద్ధంభూతమిదం జగత్కలియుగే ధర్మో వనాంతంగతః॥

తా. కలియుగమందు భూమి నిస్సారమును ఓషధుల కౌషధ శక్తి విహీనమును నీచులు మహిమగలవారును రాజులు అప్రయోజకులును బ్రాహ్మణులు కర్మభ్రష్టులును భార్య మగనికి శత్రువును కొడుకులు తండ్రికి శత్రువులును ధర్మము లడవులబట్టుటయు గలుగును.

పరాశరస్మృతి

శ్లో॥ సర్వేధర్మాః కృతేజాతాః సర్వేనష్టాః కలౌయుగే॥

తా. సర్వధర్మములు కలియుగమందు నష్టమగుననియును.

భారతం. అరణ్యపర్వము.

శ్లో॥ బ్రాహ్మణా క్షత్రియా వైశ్యా సంగిరంతః పరస్పరం।
శూద్రతుల్యా భవిష్యంతి తపస్సత్య వివర్జితాః॥

తా. కలియుగాంతమందు బ్రాహ్మణాది చాతుర్వర్ణములు నొకదానితోనొకటి కలిసి శూద్రులతో సమానులుగ నుందురనియును.

బృహత్పారాశరీయము. ౧ అధ్యాయము.

శ్లో॥ జితోధర్మశ్చ పాపేన అనృతేనతథా ఋతం।
శూద్రాశ్చ బ్రాహ్మణాచారాః శూద్రాచారా స్తథాద్విజాః॥

తా. కలియుగమందు బ్రహ్మ క్షత్రియ వైశ్యులు శూద్రాచార పరులగుదురనియు

పరాశరస్మృతి ఆచారకాండ ౩౦-౩౧

శ్లో॥ జితో ధర్మోహ్య ధర్మేణ సత్యం చైవా నృతేనచ
జితాశ్చో రైస్తు రాజాన స్త్రీభిశ్చ పురుషాః కలౌ॥
సీదంతిచాగ్ని హోత్రాణి గురుపూజా ప్రణస్యతి
కుమార్యశ్చ ప్రసూయంతే తస్మిన్ కలియుగే సతే॥

తా. కలియుగమందు రాజులు దొంగలచేతను ధర్మము లధర్మములచేతను జనులు స్త్రీలచేతను సత్యము నసత్యముచేతను చెడును. అగ్నిహోత్రము క్షీణించును. తీర్థయాత్రలు పూజలు నశించును. కన్యలు కాన్పులును గనుదురు.

పై ప్రమాణములనుబట్టి కలియుగమునందు ధర్మములన్నియు నష్టమై యుగాంతమున చాతుర్వర్ణములు నొకదానిలో నొకటి కలసి ద్విజులు (బ్రహ్మ క్షత్రియ వైశ్యులు) శూద్రప్రాయులై యుందురని సకల ధర్మశాస్త్రము ఘోషించుచుండుటనుబట్టి యుగప్రయుక్త వేదోక్త కర్మలోపము బ్రాహ్మణాదిద్విజుల నాపాదించియుండుటయును.

ఇప్పుడు నేను మీకు జెప్పిన యేడుకారణములలో యుగాచారముతప్ప తక్కిన ఆరుకారణములు పశుపాలనోద్యోగమువలన సంభవించినవని యెఱుంగవలయును. ప్రత్యేకము పశువుల పాలించు వృత్తి గలవార లీవిధముగ గిరిగహ్వర వాసులై యుండక వీలులేదు. అందునబట్టి యీకారణములన్నియు సంభవింపక తప్పవు. ఈ యేడు కారణముల వలననే నిత్యనైమిత్తిక కర్మవిహీనము గలిగినది. యుగప్రయుక్తాది కొన్ని కారణములు సర్వవర్ణముల యందును కలిగియున్నప్పటికి

బ్రాహ్మణులు వైశ్యులు పశుపాలనవృత్తి మానియుండుటచే పై కారణ ములన్నియు వారలను ప్రతిపాదించనందున నిత్యనైమిత్తికాది కర్మ లలో కొన్నియైనను కొద్దిగా నాచరించుటకు సంభవించినది,

ప్రశ్న:— పశుపాలనాది యేడు కారణములచే క్షత్రియకులోచిత వేదోక్తకర్మ భ్రష్టత్వము కలిగినదని జెప్పితిరిగదా.

శ్లో॥ జన్మనాజాయతే శూద్రః కర్మణాజాయతే ద్విజః॥

అను ప్రమాణమునుబట్టి యీ కర్మహీనులగు క్షత్రియులను శూద్రులనియు,

విజ్ఞానేశ్వరీయము మనుః.

శ్లో॥ అషోడశా బ్రాహ్మణస్య సావిత్రీనాతివర్తతే
ఆద్వావింశత్క్షత్రబంధో వా చతుర్వింశతేర్విశః॥

బ్రాహ్మణులకు 16 సంవత్సరములవరకును క్షత్రియులకు 22 సంవ త్సరముల వరకును, వైశ్యులకు 24 సంవత్సరముల వరకును ఉప నయనము చేయకున్న వ్రాత్యులనియు నేలజెప్పకూడదు ?

ఉ:— అట్లు చెప్పరాదు. యేలయన –

శ్లో॥ జన్మనాజాయతే శూద్రః కర్మణాజాయతే ద్విజః
వేదపాఠంతు విప్రాణాం బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణాః॥

'జన్మనాజాయతే ద్విజః' అనుటచే కర్మచే ద్విజత్వము గలిగెననిన 'జన్మనాజాయతే శూద్రః' అనుటనుబట్టి పుట్టినది మొదలుకొని 16 సంవత్సరములవరకు బ్రాహ్మణకులమందు జనంచినవారైనను శూద్రులనియే చెప్పవలయును. అట్లొప్పుకొనిన –

విజ్ఞానేశ్వరీయము – వ్యవహారకాండము.

శ్లో॥ అథాస్య వేదముపశ్రుత్యేత త్రపుపూరితం । శ్రోత్రుభ్యాం ప్రతిపూర్ణం ఉదాహారణేపి జిహ్వాచ్ఛేదః । ధారణే శరీరచ్ఛేదః॥

శూద్రుడు వేదమువినిన చెవులలో సీసముకాచి విడువవలసినదనియు నోటితో నుచ్చరించితే జిహ్వ కొయ్యవలయుననియు స్మృశించితే శరీరము ఖండించవలయుననియు చెప్పియున్నది. అట్లు జన్మతః

శూద్రత్వమే కలిగినయెడల వేదోక్తంబగు ఉపనయనార్హతయును "వేదపాఠంతు విప్రాణాం" అను విధిని వేదమును పఠించుటయును, 'బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః' అను చొప్పున బ్రహ్మజ్ఞానార్హతయును లేకపోవును. కాబట్టి నట్లనరాదు. మరియెట్లనిన, బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రత్వములు పుట్టుకతో కలిగి ఆయాజాతములకు అర్హతగల విధులు వేదములందు నియమించినందున బ్రహ్మక్షత్రియ వైశ్యులకు వేదోక్తోపనయనము కలదనియు శూద్రుల కర్హతలేదనియు చెప్పబడియున్నది. మరియు,

భగవద్గీత.

శ్లో॥ స్నానం సంధ్యా జపో హోమం స్వాధ్యాయం దేవపూజనం
ఆతిథ్యం వైశ్వదేవంచ సత్కర్మాణి దినే దినే॥

తా॥ స్నానము, సంధ్య, జపము, హోమము, వేదపాఠము, దేవపూజ, అతిథిపూజ, వైశ్వదేవము యివి ప్రతిదినము చేయవలసిన సత్కర్మలని భగవంతుడగు శ్రీకృష్ణుడు అర్జునునకు బోధించినట్లును.

భగ. కర్మయోగము.

శ్లో॥ నియతం కురుకర్మత్వం కర్మజ్యాయో హ్యకర్మణః।
శరీర యాత్రాపి చ తే న ప్రసిద్ధ్యే దకర్మణః॥

తా॥ ఓయి అర్జనా! నీవు నిత్యమును చేయవలసిన సంధ్యావందనాది కర్మములాచరింపనియెడల సర్వకర్మరహితుడవైనటువంటి (అనగా) లక్ష్యార్థస్వరూపుడవైన నీకు ప్రసిద్ధి కలుగదని శ్రీకృష్ణభగవానులు అర్జునునిగురించి పలికినట్లును.

మహాభారత — శాంతి॥ ౧౯౫ అ॥

శ్లో॥ తతః సత్యంచ ధర్మంచ తపోబ్రహ్మ చ శాశ్వతం।
ఆచారంచైవ శౌచంచ స్వర్గాయవిదధే ప్రభుః॥

తా॥ సత్యశౌచ ఆచారములను బ్రహ్మ స్వర్గభోగమునకై సృజించెననియు చెప్పియున్నది గాని కులోత్పత్తి కారణముకాదు. అట్లాచరింపకున్న—

విజ్ఞానేశ్వరీయము. ఆచారకాండ.

శ్లో॥ అతఊర్ధ్వం త్రయోప్యేతే యథాకాల మసంస్కృతాః ।
సావిత్రి పతితా వ్రాత్య ననంతాధ్య నిగర్హితాః॥

తా॥ ఈయర్హతగల వేదోక్త కర్మాచరణముచే లోకప్రసిద్ధియును, పుణ్యవంతుడనియును; నాచరింపకున్న పుణ్యవంతుడుగాక పతితుడనియు, పతితునకు స్వర్గభోగవిహీనమై నరకప్రాప్తియని చెప్పియున్నది. జన్నిదము వేసుకున్నంతమాత్రమున జాత్యాధిక్యత కలుగుననిన నీలోకమందు నాలీలు విప్రవినోదులు కులాలాధిక అన్యజాతులు కూడా యజ్ఞోపవీతమును ధరించుచున్నారు. అట్టివారలు బ్రహ్మ, క్షత్రియ్య వైశ్యజాతులలో నేలచేర లేదు? వారికాధిక్యత కలిగినకదా ధరించనివారికి నింద్యముగు తక్కువ ఘటించుట! లోకములో యజనాది షట్కర్మములు బ్రాహ్మణులు ఆచరించవలసినదే కదా. ఇప్పుడు క్రమముగా నాచరించువారలు కోటికొక రుందురు. వారియందును త్రికరణశుద్ధిగా జేయువా రొకానొకరుందురు. తక్కినవారిలో సంధ్యావందనమే చక్కగా నాచరింపక —

భాగవతము. సప్త.

క॥ దమమును శౌచము దపమును
శమమును మార్దవము గృపయు సత్యజ్ఞాన
క్షమమును హరిభక్తియు హ
ర్షము నిజలక్షణము లగ్రజాతికి నధిపా.

అనునట్లు శౌచాదికలక్షణము లేమియు లేనివారలై వర్తించుచున్నను వారలను బ్రాహ్మణులని చెప్పకుండిరా ? అంతమాత్రమున బ్రాహ్మణ జాతమునకు నింద్యము వాటిల్లెనా ? వారి కులాచార ధర్మములు చక్కగానె నడుచుకొనుచున్నారనిన —

భాగ-హరి॥ గీ॥ ఆయుధయుతులై బ్రాహ్మణు లాత్మవిధుల
విడిచి శూద్రుల గొల్తురు వినుము శూద్రు
లంచిత బ్రాహ్మణాచారులై చరింతు
రిరుదెరగువారు భజియింతు రేకపంక్తి.

తా॥ కలియుగమందు బ్రాహ్మణులు స్వకులాచారములు విడిచి యాయుధంబులతో శూద్రసేవ జేయుదురనియు, శూద్రులు బ్రాహ్మణాచారంబు గలవారై వర్తింతురనియు, శూద్రులు బ్రాహ్మణులు నేకపంక్తిగా భుజింతురనియును.

ఉ॥ వినియ మయాజ్యయాజనము విప్రులొనర్తురు యజ్ఞముం దపం
బు ననఘు జట్టియిత్తురు విమూఢత బాయుదు రగ్నిహోత్రము
ల్గొనకొని బ్రహ్మవాదులయి కొందరు మద్యముగ్రోలి మాంసమున్
దిని ధనవాంఛమై జనుల ద్రిప్పుదురగ్రపు వంచనంబులన్.

తా॥ నియమ విహీనమైన యజ్ఞములు చేయడము చేయించడము కలుగుననియు, అజ్ఞానులై అగ్నిహోత్రముల విడచెదరనియు, బ్రహ్మవేత్తలమని మాంసము, కల్లు, భక్షణపానంబులు చేయుదురనియు, ద్రవ్యాభిలాషచే తీక్షణమైన యవమానములు జనులకు కలుగజేయుచు ధనము సంపాదింతురనియును.

జైమినీ భారతము అష్ట॥

సీ॥ ఆమ్నాయపథవిహీనాచారములచేత ప్రబలునన్యోన్యవైరములచేత
నన్యాయవర్తనులైన రాజులచేత సమకొన్న దుర్వ్యసనములచేత
ధర్మపత్ని నిరాదరకృత్యములచేత ప్రభవించు వేశ్యాభిరతులచేత
పరధన పరదార హరణబుద్ధులచేత నలమిన ఘోరమోహములచేత

జాలికాదులచేత దూషకులచేత । ప్రల్లదులచేత వంశనాశకులచేత
డాంబికులచేతపచ్చిబండగలచేతగల్లరులచేతదర్పించుకలియుగంబు.

(ఆమ్నాయ పదవిహీనాచారములచేత) అగినప్పుడు వేద మార్గ విహీనాచారములు కలియుగమందు గలుగునని చెప్పియున్నది. ఇందునబట్టి బ్రాహ్మణాది వర్ణములు తమతమ వర్ణాచారములు తప్పకుండా నటించుచున్నారనరాదు. అట్లొప్పుకున్న కలియుగధర్మంబు దప్పు. తప్పితే ఏమియనిన, సీలోకమందు ప్రత్యక్షానుభవమైయుండగా నట్లెట్లొప్పుకొనవచ్చును? కావున వర్ణధర్మలోపము కలిగినను కుల హాని సంభవింపదు.

మరియొకపక్షము విచారింతము.

శ్లో॥ జన్మనాజాయతే శూద్రః కర్మణాజాయతే ద్విజః॥

అనుటలెట్లన్న యీద్విజులు జన్మమునం దజ్ఞానముచే నుండిరి గనుక శూద్రప్రాయులనియు నుపనయనము కావడముతో కర్మకులైరి గనుక ద్విజత్వము సార్థకమాయెను. ద్విజత్వము జన్మతో నట్లు కలిగినదన్నగా శూద్రులవలె వేదోక్తకర్మాధికారులుగాక తత్కర్మాధికారార్హత కలుగుటచే ద్విజులనబడిరి. అట్లుగాక వుపనయన కర్మచేతనే ద్విజత్వము కలిగినదనిన సర్వత్రా కలుగవలెను. అట్లు కలుగలేదు. గాక ఉపనయనాత్పూర్వము ప్రథమ మూడుజాతులు శూద్రులే కావలయును. అట్లయిన ద్విజులు యిప్పు శూద్రులను దేవార్చన పాకాదికర్మలయందు దర్శన స్పర్శనాదికములయం దెట్లు నిషేధింపబడిరో అట్లే నిషేధింపబడవలయును. ద్విజస్త్రీలనుసర్వదాపరిగ్రహింప కూడదుగదా. అట్లెచ్చటను చెప్పియుండలేదు. జరుగునదిలేదు.

కాబట్టి (సూర్యచంద్రవంశ క్షత్రియులకు) బ్రహ్మ క్షత్రియ వైశ్యులను మూడువర్ణములవారికి ద్విజత్వము జన్మతః కలిగినది.

విజ్ఞానేశ్వరీయము

శ్లో॥ బ్రహ్మ క్షత్రియ విట్ఛూద్రాః వర్ణాస్త్వాద్యాస్త్రయో ద్విజాః।
నిషేకాద్యాః శ్మశానాంతాం స్తేషాంవై మంత్రతః క్రియాః॥

తా. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగువర్ణములలో మొదటి మూడువర్ణములవారు ద్విజులు. వారికి గర్భాధానము మొదలు శ్మశానపర్యంతము సమంత్రకముగా కర్మ లాచరింపవలయును.

ఆపస్తంభ సూత్రము. ౧౧౧

అశూద్రాణా మదుష్టకర్మణా ముపాయనం
వేదాధ్యయన మగ్న్యాధేయం ఫలవంతిచ కర్మాణి॥

తా. శూద్రులకును, దుష్టకర్మ చేసినవారికిని దప్ప మిగిలినవారికి వేదాధ్యయనము, అగ్నిహోత్రము విధింపబడినది.

మనుస్మృతి. ౧౦ అధ్యాయము.

శ్లో॥ బ్రాహ్మణ క్షత్రియో వైశ్యా స్త్రయోవర్ణా ద్విజాతయః।
చతుర్థ యేకజాతిస్తు శూద్రా నాస్తితు పంచమః॥

తా. బ్రహ్మ క్షత్రియ వైశ్యులు ద్విజాతులనియు, శూద్రు డేక జాతియనియును.

**వాసిష్ఠధర్మశాస్త్రము ద్వితీయాధ్యాయం.**

చత్వారో వర్ణాః బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాః।
త్రయోవర్ణా ద్విజాతయోః బ్రాహ్మణ క్షత్రియ వైశ్యాః॥

తా. బ్రహ్మక్షత్త్ర వైశ్యశూద్రులయందు ద్విజులనగా బ్రహ్మ క్షత్రియ వైశ్యులు.

**ఇట్లు జన్మతః ద్విజులనుట కనేక ప్రమాణములు కలవు.**

అయితే క్షత్రియునకు 22 సంవత్సరములలోగా వుపనయనము కానియెడల వ్రాత్యదోషము చెప్పియున్నది. ఈకలియుగమందు 30-40 సంవత్సరములవరకు ఉపనయనము కానివారును, అయినవారిలో సంధ్యావందనమే చక్కగా చేయనివారును, వేదము చదువనివారును, సక్రమముగా వేదోక్త షోడశకర్మ లాచరింపనివారును, కొందరు స్వధర్మము లెట్టివో యెరుంగక లౌకిక కర్మలయందే అనురాగులై వర్తించు బ్రాహ్మణులు వైశ్యులు అనేకులు కలరనుట అందరికి అనుభవ సిద్దమే కదా. అట్టివారికి వ్రాత్యాదోషములు ఘటిల్లియుంపకుండెనా? వారికి వర్ణభ్రష్టత్వము సిద్ధించి బ్రాహ్మణులనియు వైశ్యులనియు చెప్ప కుండిరా? ఇంతియేగాక వ్రాత్యదోషము ఉపపాతక మనబడును. సురాపానము, బ్రాహ్మణసువర్ణాపహారణం, గురుదారగమనం, సగోత్ర వధ - వీరి నల్వురి సాంగత్యము మహాపాతకము. అవిజ్ఞాత గర్భ ఘాతనం మొదలయినవి బ్రహ్మహత్యా సమములు. కూటసాక్ష్యము సురాపాన సమపాతకము. బ్రాహ్మణభూమిహారణం - ఇది సువర్ణస్తేయ పాతకసమానము. ఈ మొదలయిన దోషములు లోకమందు ద్విజు లందరియందును జరుగుటలేదని చెప్పగలమా? ఒకవేళ చెప్పినను లోకానుభవజ్ఞు లెట్లునమ్ముదురు? వ్రాత్యము, అనృతము, గురునిర్బం ధము, వేదనింద, అతిధి త్యాగము, అగ్ని త్యాగము, పితృత్యాగము, సుతత్యాగము, దారత్యాగము, పరద్రవ్యాపహారణము, పరదార గమనము, ద్రుమ, గుల్మలతౌషధీ హింసాజీవనము, ఆత్మార్థ క్రియా

రంభము, అనాహితాగ్నిత్వము, అసచ్ఛాస్త్రాధిగమనము, దేవఋషి పిత్రూణానపక్రియ, నాస్తికత్వము, కుశీలత్వము - ఇవి ఉపపాతకములు. ఇందులో చేరినదేకదా వ్రాత్యము. వీనికిమాత్రము జాతిభ్రష్టత్వము కలిగిన తక్కినపాతకము లాచరించు ద్విజులజాతి యేమగును? ఉపపాతకములకే నింతసిద్ధించిన మహాపాతక అతిపాతక అనుపాతకముల కెంతసిద్ధించును? పై జెప్పబడిన పాతకములు ద్విజులాచరించుట లేదని యెవరు జెప్పజాలుదురు? లోకానుభవసిద్ధమైన సంగతులు లేవని వాదించిన నెవ్వరొప్పుకొనియెదరు? ద్విజులలో సర్వధర్మములాచరించువా రొకానొకరుందురని నొక్కిచెప్పవచ్చు.

వైశ్యులు చాలాకాలమునుంచి పురాణోక్తముగా కర్మలాచరింపుచు ఇప్పుడిప్పుడు కొందరిమహానుభావుల ప్రకటనతో వేదోక్త కర్మాధ్యక్షులయిరి. ఇప్పటికి కొందరు పూర్వాచారములను వదలజాలకయె నున్నారుగదా.

పైనజెప్పిన పాతకములకు ప్రమాణము.

విజ్ఞానేశ్వరీయము ప్రాయశ్చిత్తకాండం:- బ్రహ్మహత్యా సురాపానం బ్రాహ్మణ సువర్ణాపహరణం గురుదారగమనం తత్సంయోగశ్చ మహాపాతకాని పంచ॥

మాతృగమనం, దుహితృగమనం స్నుషాగమన మిత్యతిపాతకాని॥

యాగస్థ క్షత్రియ వధః । వైశ్యచ రజస్వలాయాశ్చాంతర్వత్న్యాశ్చసగోత్రయాశ్చ అవిజ్ఞాతస్య గర్భస్య శరణాగతస్య ఘాతనం॥ బ్రహ్మహత్యా సమాని॥

కౌటసాక్ష్యం సుహృద్వధా । ఇత్యేతౌ సురాపానసమౌ॥

బ్రాహ్మణభూమిహరణం సువర్ణస్తేయసమం । పితృవ్యమాతులమాతామహ స్వపపత్న్యభిగమనం । గురుదార గమనసమం॥

పితృష్వ సుర్మాతృష్వ సుర్గమనం । శ్రోత్రియ ఋత్విగుపాధ్యాయ మిత్రపత్న్యభిగమనంచ స్వసుస్సఖ్యా సగోత్రాయా ఉత్తమవర్ణాయ రజస్వలాయా । శరణాగతాయాశ్చ గమనమిత్యేతాన్యనుపాతకాని॥

అనృతంచ సముత్కర్షే - రాజగామిచ పైశునం । గురోశ్చా లీక నిర్బంధో వేదనిందా ఽధీతస్యత్యా గోగ్నిసుత మాతృదారాణాం చ । అజోజ్యాన్నభక్షణ పరస్వాపహరణ పరధనాపహరణ ఆయా జ్యానాంచ యాజనం । వ్రాత్యతా భృతకాధ్యాపనం । భృతాదధ్య యనాదానం సర్వాక రేష్వధికారః । మహాయంత్ర ప్రవర్తనం ద్రుగుల్మ లతౌషధీనాం హింసాజీవన మభిచార మూలకర్మ సుచప్రవృత్తిః । ఆత్మార్థం క్రియారంభః । అనాహితాగ్నితా । దేవర్షి పితౄణామృణ స్యానపక్రియా । అసచ్ఛాస్త్రాధిగమనం నాస్తికతాకుశీలతా మద్యప స్త్రీ నిషేవణ మిత్యనుపాతకాని॥

అయితే ఉపనయనము మాత్రము చేసుకొని సంధ్యావందనము నిత్య మాచరించుటచే పాతకములన్ని నశించుననిన ఉపనయనకర్మ మొక్కటియె ద్విజులకు చాలునని చెప్పి, విధ్యుక్తముగా జరిగించనివారి కిని, ఉపనయనము చేసుకొననివానికిని వ్రాత్యాది పాతకములకే ప్రాయశ్చిత్తము చెప్పక తక్కిన పాతకములకు వేరువేర ప్రాయశ్చిత్తాదు లేల చెప్పవలయును ?

బ్రాహ్మణులలోను వైశ్యులలోను నిత్యము సంధ్యావందన మాచరించువారున్నారుగదా వారలు సర్వదోషపరిహారులనవచ్చునా? అనవచ్చుననిన శ్లో॥ నిస్సారా పృథివీ నిరౌషధీలతా నీచా మహాత్యం గతాః । రాజనోర్థపరాయణాశ్చ సతతం । విప్రోవికర్మస్థితాః । భార్యా భర్తరి వైరబుద్ధినిరతా । పుత్రా పితృద్వేషిణః । ఇద్ధం భూతమిదం జగత్కలియుగే ధర్మోవనాంతం గతః॥

తా॥ కలియుగమందు బ్రాహ్మణులు కర్మభ్రష్టులగుదురు.

బృహన్నారదీయము. 3వ అధ్యాయము.

బ్రాహ్మణా క్షత్రియా వైశ్యా శూద్రధర్మ పరానరాః
ఘోరే కలియుగ ప్రాప్తే ద్విజా వేద పరాఙ్ముఖాః॥

తా॥ భయంకరమైన కలియుగమురాగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు వేదపరాఙ్ముఖులు శూద్రధర్మావలంబు లగుదురు. బ్రాహ్మణ

వైశ్యులు నిర్దోషులయినయెడల నీప్రమాణము లెవరియందు స్వీక రింపవలయును ?

మరియొకవిధము విచారింతము.

ధర్మార్థకామములు మూడును పురుషార్థములుకదా. ధర్మము వర్ణమునవలంబించుక వచ్చినదా ? వర్ణము ధర్మమునవలంబించుక వచ్చినదా ? యని విచారింతము. ధర్మమునవలంబించుకయే వర్ణము వచ్చినయెడల సర్వజాతులకు భోజనాది హెచ్చుధర్మము లెవరాచరిం తురో వారికెల్ల ద్విజత్వము రావలెను. అట్లువచ్చిన అర్వాతానార్వాత విచారమునకు లోపమువాటిల్లును. కనుక వర్ణమునవలంబించుకయే ధర్మమువచ్చినదని చెప్పవలయును. ఎట్లనగా ప్రథమమున జాతినిర్ణయ మును, పిమ్మట ఏయేజాతుల కాయా తారతమ్యములప్రకారము నిత్య నైమిత్తిక జీవితకర్మ విధులు యేర్పడినవి. అవియే ధర్మ మనబడును. ఏయే వర్ణములకు నేయేధర్మములు కలవో అట్లు తప్పకుండా అర్థము గూర్చుట అర్థమనబడును. ఏయే వర్ణమున కేయే నియమభోగము లనుభవించవలయునో నాయా భోగము లనుభవింపగోరుట కామము. ధర్మము పరలోక సుఖదాయిని. కామము ఇహలోకసుఖదము. ఈ రెంటిలొక్క సాధన మర్థమగుటచే స్వర్గాదిభోగదములైన ఉపనయ నాది ధర్మమందు యుగప్రయుక్త భ్రమ ప్రమాదులవలన జరుగ కున్నను స్వర్గభోగము కొరతపడును. కాని ఇహలోకమందు వర్ణహాని కలుగదు. అట్లయిన స్వర్గభోగవిహీనము రావలయునుగాని ఉపనయ నము గానిచో వ్రాత్యదోష మెందుకు విధింపవలెను ? ప్రథమమున నేయేవర్ణముల కాయానియమములు వేదమందు బ్రహ్మచే నిర్ణయింప బడెనుగాన ఆయా కులధర్మములు తప్పిన పాతకములని విధింపబడిరి.

ఈ చంద్రవంశక్షత్రియుల ఉపనయనాదు లొకవేళ ప్రమాద వశమున జరుగకున్నను వ్రాత్యదోష మాపాదింపదు. ఎట్లనిన ?

బృహత్పారాశరీయము. ౧ అధ్యాయం.

శ్లో॥ జితో ధర్మశ్చ పాపేన అనృతేన తథా ఋతం ।
శూద్రాశ్చ బ్రాహ్మణాచారా శూద్రాచార స్తథా ద్విజాః॥

కలియుగమందు శూద్రులు బ్రాహ్మణాచారులుగను ద్విజులగు బ్రహ్మ క్షత్రియ వైశ్యులు శూద్రాచారు లగుదురు.

బృహన్నారదీయము. 3 అధ్యాయము.

శ్లో॥ బ్రాహ్మణా క్షత్రియో వైశ్యా సర్వేధర్మా పరాఙ్ముఖాః।
శూద్రతుల్యా భవిష్యంతి తప సత్య వివర్జితాః॥

మహోశ్చాగ ధనాగాఢ్య సచరాచర భవిష్యంతి ।
కింకరాశ్చ భవిష్యతి శూద్రాణాంచ సదా ద్విజాః॥

బ్రాహ్మణా క్షత్రియో వైశ్యా శూద్రధర్మా పరానరాః ।
ఘోరే కలియుగే ప్రాప్తే ద్విజా వేదపరాఙ్ముఖాః॥

తా॥ భయంకరమైన కలియుగము వచ్చిన తరువాత బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు తపస్సత్యములు మానుదురు. శూద్రతుల్యులుగ నుందురు. ఎవ్వనికి యేనుగలు గుఱ్ఱము లుండునో వాడె రాజగును. బ్రహ్మ క్షత్రియ వైశ్యులు శూద్రులకు సేవకులగుదురు.

దేవీభాగవతే నవమస్కంధే అష్టమోధ్యాయః.

శ్లో॥ బ్రహ్మ క్షత్ర విశశ్శూద్రా జాత్యాచార వివర్జితాః।
సంధ్యా చ యజ్ఞసూత్రం చ భవేల్లుప్తం నసంశయః॥ ౨౩

మ్లేచ్ఛాచార భవిష్యంతి వర్ణాచత్వార యేవచ।
మ్లేచ్ఛశాస్త్ర పఠిష్యంతి స్వశాస్త్రాణి విహాయచ॥ ౨౪

బ్రహ్మ క్షత్ర విశాంవంశా శూద్రాణాం సేవకా కలా।
సూపకా రాధావకాశ్చ వృషవాహాశ్చ సర్వసః॥ ౨౫

తా॥ బ్రహ్మ క్షత్రియ వైశ్యులు జాతిధర్మవిహీనులై సంధ్య యజ్ఞ సూత్రములు వదలి శూద్రతుల్యు లగుదురు. చాతుర్వర్ణులు మ్లేచ్ఛాచారులై తమ శాస్త్రములు వదలి మ్లేచ్ఛశాస్త్రములు చదువుదురు. కలియుగమున బ్రహ్మ క్షత్రియ వైశ్యులు శూద్రసేవారతులయి వంటాచార్యులుగాను, పరిచారకులుగాను పుణ్యాదికర్మలను కూలికి చేయువార లగుదురు.

దేవీభాగవతము నవమస్కంధే అష్టమోధ్యాయః.

బ్రహ్మక్షత్ర విశాంవంశాః భవిష్యంతి న పాపినః॥ ౭౮

అన్నానాం నియమో నాస్తి యోనీనాం చ విశేషతః।

ఆశ్రమాణాం జనానాం చ సర్వమ్లేచ్ఛాః కలౌ యుగే॥

తా॥ బ్రహ్మక్షత్రియ వైశ్య వంశములు పాపములు గలవిగ నగుచున్నవి. ఇంక సర్వజనులు కలియుగమందు విశేషముగ అన్న నియమము, యోని నియమము, ఆశ్రమ నియమము లేక మ్లేచ్ఛులగుచున్నారు.

ద్విజులగు బ్రహ్మక్షత్రియ వైశ్యులందరికి యిట్లు చెప్పియుండగా యీ చంద్రవంశక్షత్రియులనే వ్రాత్యాదిదోషములు కించిన్మాత్రుల జేయుటెట్లు? (ఇది యుగధర్మము) యుగప్రయుక్తమున వేద విహిత కర్మలయందును, స్వకులవృత్తులయందును నియమములు తప్పి భ్రష్టులయ్యేదరని చెప్పియున్నారు. ఇదియునుగాక వర్ణాశ్రమాచారాదిక ధర్మములు తప్పకుండా పరిపాలనముచేయు యుత్తమ క్షత్రియుల పాలనకు దొలగి దేశమంతయు మ్లేచ్ఛాదిక యితరవర్ణాధీన మగుటచే వేదోక్తమైన సకలధర్మములు నానాటి కడుగంటి ప్రమాదవశమున ద్విజులు కర్మభ్రష్టులైరి. ఇదియునుగాక యీ చంద్రవంశక్షత్రియులకు పశుపాలనము సంభవించిన విద్యావిహీనముచే స్వకులోచిత ధర్మమును దెలియక భ్రమ నొందిరి.

పరాశరస్మృతి. ఆచారకాండ.

యుగేయుగేచ యేధర్మా స్తత్ర తత్రచ యేద్విజాః

తేషాం నిందా నకర్తవ్యా యుగరూపాహి తే ద్విజాః॥

తా॥ యుగప్రయుక్తమయిన ధర్మమును సవరింప నలవికాదు. కావున ధర్మలోపమును గురించి ద్విజులను నిందింపరాదు.

ఇట్టి యుగప్రయుక్తమగునట్టియు యుగప్రయుక్తాంతర్వ్యాప్తమైన భ్రమప్రమాదాదులవలన సంభవించినట్టి యీ క్షత్రియులకు గల కర్మలోపమునుగురించి నిందార్హులుకారు. ఇదియునుగాక గోపరిపాలనముచే సంభవించిన ఉపనయన విహీనవ్రాత్యదోషము వీరియందెంత

మాత్రే మనుపయోగ మెట్లన్న, యదువంశసంభవులగు క్షత్రియులకు గోపాలనవృత్తి పరమధర్మమనియును తన్మహిమావిశేషమును ప్రశ్నరూపముగా మీకెరిగించియేయున్నాను. అయితే ఉపనయన సంధ్యావందనములు సకలపాపములను హరించి స్వర్గభోగము లనుభవింపజేయుటకే గదా.

విజ్ఞానేశ్వరీయం - ప్రాయశ్చిత్తకాండ.

క. దేవసమూహంబెల్లను । గోవుశరీరంబునందు గొనకొనియుంచున్
గావున గోమహాత్మ్యము । భావింపగరాదు నిజము బ్రహ్మకునైనన్.

సర్వదోషహరమై స్వర్గాదిభోగములు గోపరిపాలనవలన నిరభ్యంతరముగా కలుగునని చెప్పియున్నది. వేదస్వరూపమైన గోవును పాలించడము వేదధర్మ పరిపాలనగాదా? ఉపనయనాది వేదోక్త కర్మము లాచరింపనివారినిగా నీచంద్రవంశ క్షత్రియుల నెట్లెంచవచ్చును? ఒడియునుంగాక —

మనుస్మృతి - ౪ అధ్యాయము.

శ్లో॥ యేనాస్య పితరోయాతాః యేనయాతాః పితామహాః ।
తేనయాయా త్సతాంమార్గం తేనగచ్ఛన్ నరిష్యతే॥

తా॥ పెద్దలే ధర్మమున నడిచిరో యా ధర్మమార్గము నడువదగినది.

విష్ణుస్మృతి.

శ్లో॥ శాఖాం పుండ్రంచ సూత్రంచ సమయాచార మేవచ ।
పూర్వైరా చరితం కుర్యా దన్యథా పతితో భవేత్॥

తా॥ శాఖాపుండ్రము సూత్రము సమయాచారము పూర్వులచే నాచరింపబడినదే యాచరింపదగును.

ఎల్లాజీయము

పారంపర్యా గతం ధర్మం । యోనర స్త్యక్తు మర్హతి॥
పరంపరా ధర్మము నంగీకరింపదగినది.

యీ యదువంశ క్షత్రియులయందు కొందరు చాలాకాలము నుండి పరంపరా ఉపనయన విహీనులై యుండుటనుబట్టి యిప్పటి

వారికి పూర్వాచారమై యున్నందునను పై ప్రమాణములచే పూర్వాచారము విహితమైనందు న—

మత్స్యపురాణము - ౧౪౩ అధ్యాయం.

శ్లో॥ తథా కలియుగస్యాంతే శూద్రభూతా ప్రజా స్తథా ।
బ్రహ్మ క్షత్ర విశశ్శూద్రా బీజార్థేయే ఇహాస్మృతాః ॥

తా॥ కలియుగాంతమందు ప్రజలు శూద్రతుల్యు లగుదురు. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు కలియుగమునందు బీజభూతులుగ నుండి మరల కృతయుగమున వార లసమానులగుదురు.

ధర్మలోపమునసే వర్ణలోపము కలిగినయడల కలియుగాంతమందు సర్వకర్మభ్రష్టులైన శూద్రతుల్యులగు ద్విజులు మరల కృతయుగమునం దెట్లు ద్విజులగుదురు. కావున వ్రాత్యదోషమున కారకులు కారు. శూద్రులనరాదు.

ప్రశ్న:— అట్లైన యీ యదువంశక్షత్రియులకు గతించిన వేదోక్త ఉపనయనాదులు పునరోద్ధారణ చేయవచ్చునా ?

ఉ:— చేయవచ్చును. ప్రమాదవశంబునలోపించిన కర్మలను పునరోద్ధారణ చేయుటకై గదా ధర్మశాస్త్రములయందు ప్రాయశ్చిత్త కాండ నిర్ణయింపబడెను. ఈకలియుగమందు బహుదినములనాటి నుండియు వైశ్యులు వేదోక్తకర్మలను కొన్ని కారణములచే పురాణోక్తముగా నాచరించుచున్న మధ్యకాలములో కొందరుత్తమ పురుషుల సిద్ధాంత ప్రకటనచే తిరిగి సంస్థాపింపబడి యిప్పుడు వైశ్యులు వేదోక్తముగా నడువ నారంభించుచున్నారు. ఇప్పటికి కొందరు పూర్వాచారమైన పురాణోక్తమును విడువజాలకయే యున్నారు. ఇందుకు వైశ్యప్రకాశికయును, వైశ్యకులదీపికయును చూచుకొనునది.

చంద్రవంశ క్షత్రియులలో కూడా యదువంశ క్షత్రియుడగు శివాజియను మహారాష్ట్ర దేశీయుడు తురుష్క ప్రభువులచే యస్తగంటి పోయిన హిందూమత ధర్మము పునరుద్ధారణ చేయుటకై దక్షిణ మహారాష్ట్రము మొదలయిన దేశములు జయించి వీరాపూరు రాజ్య

ములోని రాయగడదుర్గము రాజధానిగా నియమించి హిందూధర్మ శాస్త్ర ప్రకారము పట్టాభిషేక మొందదలంచిన ఉపనయనాదులులేని హేతువుచే అచ్చటిపెద్దలు క్షత్రియుడో కాడో యని సంశయించిన నతడు క్షత్రియుడైనసంగతి స్వగ్రామమైన వుదయపురముననున్న వంశవృక్షము దెప్పించి క్షత్రియవంశమును సిద్ధాంతీకరించిరి. శాస్త్రోక్తముగా ఉపనయన విహీనమునకు వ్రాత్యస్తోమయజ్ఞమును చేయించి పిమ్మట ఉపనయనముచేసి క్రీస్తుశకము 1674 సం॥ జూన్ ది 6 తారీఖునకు సరియగు నందననామసం॥ జ్యేష్ట శు ౧౩ గురువారము శివాజీకి పట్టాభిషేక మొనర్చిరి. ఇదియంతయు శివాజిచరిత్ర చూచిన తెలియ గలదు. కావున ధర్మలోపమున కెన్నినాళ్లకైనను సవరణ కలదు.

ప్రశ్న:— ఇప్పుడు కొందరు గొల్లలను వృత్తినామముగల క్షత్రియులు మేకలను పాలించుటయే వృత్తిగాగలిగియున్నారు. అది కులాచార ధర్మవిరుద్ధమైన నీచవృత్తిగా నేల భావింపకూడదు?

ఉ:— మేషములను పాలించువృత్తి నీచమనిచెప్పుటకు మేషములు నీచజంతువులు అయినగదా తత్పాలితవృత్తి నీచము గావలెను. ఈలోకమందు సర్వజన భక్షణీయమును సర్వజనోపయుక్తమును స్వర్గాపవర్గఫలంబు లిచ్చునవియునై యజ్ఞపశువు లనబరగిన యీ పశువులను నీచజంతువులుగా నూహింపరాదు. యజ్ఞార్హతకలిగిన చతుష్పాద జంతువులలో ముఖ్యత్వ ప్రమాణములు కలవు.

యజుర్వేదం:— జ్యోతిష్టోమాదిక్రతూనాం దేవతాహవిరర్థం పశ్వాలంబనం ముఖ్యం। కుతః। ఇమం పశుం పశుపతేతే అధ్యబధ్నామి యత్పర్మాయుమకతః। నానాప్రాణో యజమానస్యపశునేతి। ఇత్యాది బహుశ్రుతి పర్యాలోచన యాపశోః। వపావింపి దేవానామత్యంత ప్రియతమాని కించ పశుశబ్దస్య సర్వేషాం చతుష్పాద్జంతూనాం ఛాగస్య ముఖ్యత్వం కథం।ఛాగస్య వపాయా మేధసామా బ్రూహి। ఛాగోసి మమభోగాయ భవమేషోసి మమభాగాయభవ॥ అజేనాగ్నిష్టో మియ్యోనేతి॥ ఇత్యాదిస్మృతిశ్రుతిరీత్యా పశూనాం ఛాగస్య ముఖ్యత్వాత్ జ్యోతిష్టోమాదిషు సామాన్యేన ఛాగ పశురేవ॥ ఇతి సంక్షేపణం లిఖ్యం॥

ఇట్లు జ్యోతిష్టోమాది యజ్ఞములకు మేషపశువుయే ముఖ్య మనియు, దేవప్రీతికరమగునని యనేక ప్రమాణములు వేదమునందు ప్రసిద్ధమై యున్నవి.

సీతారామాంజనేయం

మ. ఉరుతాగాది గుణాజసంఘమున నాద్యోంకార మంత్రంబుచే
తరయంబార వధించి యాత్మవిషయేధ్మ ప్రేణిం గూడి చె
చ్చెర నానావిధ వాసనాజ్యములతో చిద్వహ్ని మధ్యంబునన్
వరుసం బ్రేలిచి సౌఖ్య సోమరసపానంబింత గావింపుమా.

తా. రాగాదులను మేకలను ఓంకారమంత్రముచేత విశసించి విషయ సమిధలచే వాసనలనేయితో చిదగ్నియందు వ్రేల్చి బ్రహ్మా నంద సోమపాన మానవలసినదిగా బాహ్యయజ్ఞవిధిని ఆత్మయజ్ఞ ముగా నిరూపించి చెప్పియున్నది.

వేమనశతకం

గీ॥ పేరుసోమయాజి పెనుసింహబలుడయా
మేకపోతుబట్టి మెడలువిరచు
గాక క్రతువువంక గలుగునా మోతుంబు
విశ్వదాభిరామ వినురవేమ.

ఇట్లు మేక పశువులు గోవులవలెనె యజ్ఞార్హతగలవిగా యనేక ప్రమాణంబులు వేదాదులయందు జెప్పియుండుటయును యీ కలి యుగమున చేయు యజ్ఞంబులన్నియు మేకపశువులనుబట్టి చేయుట లును జగత్ప్రసిద్ధమైయుండగా నైచ్యజంతువు లెట్లగును? ఇందునబట్టి తత్పాలితవృత్తి నైచ్యముగాదు. కాన మేకలపాలించుట అన్నివర్ణ ములకు పరమధర్మమని చెప్పియున్నది.

పరాశరస్మృతి ౧౨ అధ్యాయం. ౪౧ శ్లో॥

అరణిం కృష్ణమార్జాలం చందనం సుమణిం ఘృతం।
తిలాం కృష్ణాజినం ఛాగం గృహేచేతా నిరక్షయేత్॥

తా. అగ్ని నల్లపిల్లి శ్రీగంధం మణి నేయి నూవులు జింక చర్మము మేక ప్రతిగృహమున రక్షింపబడవలయునని చెప్పియున్నది.

మత్స్యపురాణం. ౧౫ అ ౩౮ పుట.

శ్లో॥ అగ్నిష్వాంతు యమాభ్యాంతు కార్య మాప్యాయనం బుధైః।
అగ్న్యభావేపి విప్రస్య పాణావథ జలేపివా॥ ౩౨

అజాకర్ణేశ్వకర్ణేవా గోష్ఠేవాథ శివాంతికే।
పిత్రూణాముత్తమం స్థానం దక్షిణాదిక్ప్రశస్యతే॥ ౩౩

తా. హోమము చేయుటకు అగ్నిలేమిని బ్రాహ్మణహస్తమునం దేని జలమునందేని అజాకర్ణమునందేని (మేకచెవియందు) అశ్వకర్ణమునందేని ఆవులదొడ్డియందు నేని శివసన్నిధినేని హోమము చేయదగును.

మత్స్య. ౧౬ అ

శ్లో॥ యాదేషు సంక్షయే తద్వ దన్యత్రాపి నిగద్యతే
పిండాస్తుగోజ విప్రేభ్యో దద్యాదగ్నౌ జలేపివా॥

తా. శ్రాద్ధములయందుంచబడిన పిండములను బ్రాహ్మణులకుగాని, గోవులకుగాని, అజములకు (మేకలకు) గాని యివ్వవలయును. లేక అగ్నియందుగాని, ఉదకమునందుగాని ఉంచవలయును. ఇట్లు మేషములయందు విశేషత్వము కలుగుటవలనను.

ఇదియునుగాక యీలోకమందు అష్టాదశ వర్ణాదులును మేకలను పాలించుట వృత్తిచే జీవించుట మనకెల్లర కనుభవనీయమై యుండెనుగదా? నీచవృత్తి అయినయెడల బ్రాహ్మణాదులకు నీచము కావలెను. కావున అజాపాలనవృత్తి కులాచారధర్మ విరుద్ధమై నీచవృత్తియని చెప్పరాదు.

ప్రశ్న :— ఇప్పుడు గొల్లలను వృత్తినామముగల క్షత్రియులకు మాంసభక్షణము దూషిత మేలకాదు?

ఉ:— మాంసభక్షణము క్షత్రియులకు విహితమైనట్లు అనేకప్రమాణములు కలవు.

మనువచనము.

శ్లో॥ తిలైర్వ్రీహియవైర్మాషైరద్భిర్మూల ఫలేనవా। దత్తేనమాసంప్రీయంతే విధివత్ పిత్రాతరోనృణాం। ద్వౌమాసౌమత్స్య మాంసేన।

త్రీణ్మాసాన్ హారిణేనతు। ఔరభ్రేణాథ చతరశ్చాకునేనేహ పంచవై। షణ్మాసాన్ ఛాగమాంసేన పార్షతేనాథ సప్తవై అష్టావేణేయ మాంసేన రౌరవేణ నవైవతు। దశమాసాస్తు తృప్యంతి వరాహ మహిషామిషైః। శశకూర్మయోస్తు మాంసేన మాసానేకా దశైవతు। సంవత్సరంతు గవ్యేన పయసా పాయసేనవా। వార్ధ్రాణసస్యమాంసేన తృప్తిర్ద్వాదశవార్షికి। కాలశాకం మహాశల్కం లోహామిషంమధు। అనంత్యాయైవ కల్ప్యంతే। మున్యంన్నానిశసర్వశ వార్ధ్రాణసోరక్తవర్ణచ్ఛాగః॥ తదుక్తంవిష్ణు ధర్మోత్తరే ప్రీతీనత్విందిద్రియాక్షీణం। యూధస్యాగ్రసరతథా। రక్తవర్ణంతు రాజేంద్రచ్ఛాగం వార్ధ్రాణ సంవిదుః॥ పక్షివిశేషోవా॥ కృష్ణగ్రీవో రక్తశిరస్శ్వేతపక్షో విహంగమః। సవైవా ర్ధ్రాణసఃప్రోక్తా ఇత్యేషా వైదికీశ్రుతి రీతి నిగమవచనాత్। కాలశాక ముత్తరదేశే ప్రసిద్ధం॥ మహాశల్కో-మత్స్యవిశేషః॥ ఖడ్గః। ఖడ్గమృగః। లోహిత-లోహిత వర్ణచ్ఛాగః। మున్యన్నానీ వారాద్యన్నాని॥

ఇట్లు శ్రాద్ధాదులయందు మాంసాదు లుపయోగించవచ్చునని యేయున్నది.

మనుః.

శ్లో॥ రాజీసింహతుండాశ్చ సశల్కాశ్చైవ సర్వశః॥

తా॥ పద్మవర్ణము గలిగినట్టియు సింహ్వాముఖము గలిగినట్టియు ముత్తెపుదిప్పవంటియు ఇట్టి మత్స్యములను శ్రాద్ధకాలములయందును ఇతరకాలములయందును భుజింపవచ్చుననియు.

ఇట్లు శ్రాద్ధాదులయందును ఇతరకాలములయందును విహితమనియే చెప్పియున్నారు. ఒకవేళ మరియొకచోట నిషేధమని చెప్పినను అది ద్విజులనెడిచో బ్రాహ్మణులకును వైశ్యులకును చెప్పియుండునుగాని క్షత్రియులకు చెప్పబడదు. ఎందువల్లననగా క్షత్రియులు క్షాత్రవంతము గలవారు గనుక హింసాకర మాంసభక్షణ దోషము విధింపబడదు.

భారతం, అరణ్యపర్వం. వచనములో కొంత.

బుభుక్షాపీడ సహింపనోపక హిరణ్యాపక్షంబులతోడను ముందర దిరుగుచున్న పక్షులం గని యవి భక్ష్యంబులగునని పక్షులం బట్టుకొన

సమకట్టి క్షత్రియుడగు నలచక్రవర్తి పక్షిమాంసముదిన ప్రయత్నించి నటులను॥

మనుచరిత్ర చతుర్థాశ్వాసం వచనములోకొంత

నిలింపాంగనాసుతుండు దున్నహాసమాగత చతురుల వలన కృతపలల ఫల మూలాది శుచమధుర మృగయోచ తాహారంబుల తృప్తివహించు॥

అని స్వారోచియను మనువు మాంసము భుజించినట్లును.

భాస్కరరామాయణము అరణ్యకాండ

చ. బహుమృగ మాంసఖండములు పండులు దేనియలుఁ రఘూ
ద్వహుసతిగోరు భూరుహాలతా కుసుమాదులు దెచ్చియిచ్చుచుఁ
మిహిర సమాన తేజుఁడు సుమిత్రతనూజుడు గొల్వగా ముదా
వహములు యయ్యె దత్సమయవాసరముల్ రఘువంశ భర్తకుఁ.

క్షత్రియుడగు రాముడు తమ్మునిచే మాంసఖండములు దెప్పించుకొని భుజించెననియును.

భాస్కర రామాయణము అరణ్యమాంధకర్ణి కథాభాగములో వచనములో కొంత.

క్రొవ్వుగల మృగమాంసంబు నిత్యంబు నాహారకృత్యంబులు దీర్చుచు అనిరాముడు నిత్యము మాంసము భుజించుచున్నటులను.

జైమనిభారతము తృతీయాశ్వాసం.

గీ. మరియు భూచర ఖేచర జలచరములు
వేరుగల మాంసములునంజి ప్రియముతోడ
రుక్మిణీసత్యభామ లిరుపురును గదిసి
తాళవృంతంబు విసరి తత్తరులుసేయు.

తా. క్షత్రియుడగు శ్రీకృష్ణుడు భూచరములగు మృగములను ఖేచరములగు పక్షులను జలచరములగు మత్స్యములను భక్షించి నటులను.

ఇందువలన క్షత్రియులు నిస్సంశయముగా మాంసము భుజించి నటుల దృఢపడుచున్నది.

మఱియును భార- అను- చతు అ।

కం. పితృకార్య యజ్ఞముఖముల
శ్రుతచోదితహింసకీడు సారసేరదు వి
విశ్రుతగుణ మాంసముచవిగో
రి తిన ప్రాణి దెగటార్పుక్రియ పాపమగున్.

తా. పితృకార్యముల యందును యజ్ఞములయందును వేద
హితమగుహింస కీడు కలుగజేయదనియును మాంసము రుచిగోరి తినని
ప్రాణము తీయునెడ నెంత పాపమో యంత పాపము సంభవించుచున్న
దని చెప్పియున్నది.

భార అను పం.

క. శ్రుతివిహింస హింసాగతి దలపగరాదు మునినికాయంబిది దు
ష్కృతతతిబాపెడు పరమసుకృతమని గొనియాడగాన గీర్వాణనుతా.

తా. వేదములయందు జెప్పబడిన హింస హింసకాదనియును
సర్వఋషులును వేదోక్తమైన జీవహింస సమస్తదోషములను బాప
గల ముఖ్యకార్యమని కొనియాడినట్లు పార్వతికి శివుడు చెప్పినటులను

భార అర ౫ అ.

సీ. అనఘ దయాసీనరుండగు శిబి నిజగాత్ర హింస నింద్రాగ్నుల
కిడడె మాంస। మతనికి లేదయ్యె నయ్యుయుత్తమగతి రంతిదేవుండను
రాజు తొల్లి। యనుదినంబును గోసహస్ర ద్వయంబును వధియింపజే
వేయువత్సరములు। దురిత మమ్మహితాత్ము దొడరెనే వేదార్థ నిర
తులై యత్యంత నియతులైన। బ్రాహ్మణోత్తమ ముఖ్యు లధ్వరమునందు
పశువు వధియింపరే తగ పరమపుణ్య। గతులు గలుగవె వారికి గడగి
యగ్ను లధికమాంసార్థులని శ్రుతులందు వినమే॥

తా॥ శిబిచక్రవర్తి ఇంద్రాగ్నులకు తన శరీరం కోసి మాంసము
పెట్టినందున నతనికి యుత్తమగతి గలుగకుండెనాయనియు, రంతీదేవుం
డను రాజు ప్రతిదినము రెండువేలగోవుల వంతున వేయిసంవత్సరము
లనేకగోవుల వధియించి యజ్ఞములుచేసి తచ్ఛేషము భుజించిన నారాజు
నకు దోషము సంభవించెనా యనియు వేదవిదులగు బ్రాహ్మణులు

మొదలగు ఘనులు యజ్ఞములందు పశువుల వధించిన పుణ్యగతులు వారికి గలుగలేదా యనియు మృగవ్యాధుఁడు కౌశికునకు వేదవిహిత మగు హింస దోషాస్పదముకాదని చెప్పినట్లు చెప్పియున్నది.

కం. పితృదైవతకార్యములం। దతిభక్తిని మాంసమిడుట యర్హమనియు త
త్పితృదైవత శేషము స।న్మతిభోజ్యమ్మనియు మునులమతములుగావే.

తా॥ పితృకార్యములను దైవకార్యమున విశేషభక్తిచేత మాంసము పెట్టుటయును, తత్పితృదైవత శేషములను భుజించుటయును మునులమతమనియు తత్పరమైన హింసకాదా యనిన,

మ. హాలికుండెంతయు నోజ దున్ను నెడ శీరాగ్రంబునంబొంది ప్రా
ణు లనేకంబులు జచ్చు హింసయది యానో కాదొ వేయేల మ
ర్త్యులు నేలం జరించుచో పదములం ద్రొక్కంబడు న్బక్కజం
తులదా హింసయు గాదనంగ నశమే దోషజ్ఞ యూహింపుమా॥

చ. సలిలము లుర్వి యాకసము సర్వము జంతుమయంబు గావునన్
గలుగ నవశ్యమున్ సకలకర్మములందును హింస హింసకున్
దొలగిన దేహయాత్రకును దుర్ఘటమైనటులుండు నంతయున్
దలపరు హింసజేయమని తారుచరింతురు కొంద రిమ్మహిన్.

గీ. హింసజేయనివాడు లేఁడిజ్జగమున
నొక్కడైనను దమతమ రూపినట్లు
హింస తెరవున కెడగల్గ యేగవలయు
నదియె జూవె యహింసనా యతిశయిల్లు.

ఇచ్చట మూడుపద్యములకు ఒకటే తాత్పర్యం.

భూమి దున్ను నెడ హాలాగ్రమునను ప్రజలు నడచు నెడ పాదములక్రింద బడియును సకలకర్మముల యందంతటను వ్యాపించియున్న జంతువులకు హింస కలుగుననియును యీ జగంబున హింస జేయని వాడు లేడనియును వీలైనంతమట్టుకు తొలగి నటించుట యహింస యనియును ధర్మవ్యాధుడు చెప్పబడియున్నాడు.

క. ఫలములునోషధీశాకంబులుపశుమృగశతులుభక్ష్యములుగాభూతం
　బులకజుడుజేసెననియ। స్ఖలితంబుగ బ్రాయుశ్రుతులు గాదనవశమే.

తా. ఫలములును, ఓషధులును, పశువులును, మృగములును భూతములకు దినుపదార్థములుగా బ్రహ్మనిర్మించినట్లు వేదములు జెప్పుచున్నవని మృగవ్యాధుడు కౌశికునకు జెప్పుటనుబట్టియును క్షత్రియులకు యవి భక్ష్యనీయంబులగుటచే నింద్యంబులుగావు. పరభంజనులగుటచే హింసయును లేదు. ఇదిగాక పరంపరా ఈయదువంశ్యులగు కృష్ణాదులు యంగీకరించిన ధర్మమంగీకరింపవలసినదేగదా. ఇందుకు ప్రమాణం.

యల్లాజీయము.

శ్లో॥ పారంపర్యాగతం ధర్మం యోనర స్త్యక్తుమ ర్హతి॥

తా. పరంపరావచ్చు ధర్మము నంగీకరింపతగినది.

యదువంశ మండనుండగు శ్రీకృష్ణుడాచరించిన ధర్మమవలబించుట శిష్టాచారము కాదా.

స్మృతిరత్నాకర ౧- ౪ పేజి.

శ్లో॥ శ్రుతిస్మృతివిహితో ధర్మః తదలాభే శిష్టాచార
　ప్రమాణమితి వసిష్టస్మరణాత్॥

తా. ధర్మము శ్రుతివిహితమైనది. అట్టిధర్మములభించని సమయమందు శిష్టాచారము ప్రమాణము అని వశిష్టులవారు చెప్పిరి.

ఆపస్తంభసూత్రమందు.

యదాప్తై షాం కులం ధర్మస్యాత్॥

తా. కులధర్మమును విడువరాదు.

ఇదిగాక యీలోకమందు క్షత్రియులందరు మాంసము సాధారణముగ భుజించుటయును కల్గియుండుటచే లోకాచారము కూడా ఒప్పుకొనతగినదే. ఎట్లనగా—

విజ్ఞానేశ్వరీయము. ఆచారకాండ.

క. కులదేశాచారంబులు। తనకొని జేయంగవలయు తమకులదేశం
　బులు నెందుజెల్లుగావున।నలయుక యదివిహితకర్మమని రాచార్యుల్.

భారతం. అర. ౫ అశ్వా.

క. ఒప్పెడునదిదైనను గడు।నొప్పనియదిదైన నిజకులోచితపథముల్
దప్పదగదంద్రు ధార్మికు।లప్పని నిజభాగ్యవిహితమని యెంచదగున్.

తా. ఒప్పెడునదియైనను ఒప్పనిదైనను స్వకులాచారమార్గము అనగా పరంపరావచ్చు విధిని దప్పింపరాదనియు అప్పని స్వభావాను కూలమని చెప్పియుండుటచే తత్ప్రకారమే పూర్వము శ్రీకృష్ణాదులు మాంసభక్షణము నిషేధింపకుండుటచేతను లోకమందు సాధారణ ముగా క్షత్రియులు భుజించుచుండుటచేతను యిప్పుడును భుజించిన దూష్యముకాదు.

భారతం. ఆది. 3 అశ్వా.

ప్ర:— గీ॥ మొదలి పెక్కుజన్మముల బుణ్యకర్మముల్
పరగఁ బెక్కుసేసి పడయఁ బడిన
యట్టి యెఱుక జనుల కా క్షణమాత్రన
చెఱుచు మద్యసేవ సేయనగునె.

క. భూసురులాదిగాగల జనులీ సురసేవించిరేని యిది మొదలుగ శా
పాసక్తి పతితులగుదురు చేసితి మర్యాద దీని జేకొనుడు జనుల్.

వృద్ధహారీతసంహిత — ౭. అధ్యాయం.

శ్లో॥ సురావై మలమన్నానాం। పాప్మా వై మలముచ్యతే
తస్మాద్బ్రాహ్మణ రాజన్యౌ। వైశ్యస్య నసురాం పిబేత్॥

ఇట్లు క్షత్రియాదులకు సురాపాన నిషేధము చెప్పియుండగా యీలోకమందు కొందరు యదువంశ క్షత్రియులలో మధుపాన మంగీక రింతురే, వారేల దూషితులుకారు ?

ఉ. హరివంశము — పూర్వ. 5 అశ్వాసము.

సీ. నామేనుతో తుల్యమై మేను నవమేఘకాంతి నొప్పార సంకర్షణునకు
నెనయైన వదనపూర్ణేందుడు శోభిల్ల నెనిమిదిబాహువు లెసగ శార్ఙ్గ
చక్రగదాఖడ్గజలరుహమధుపాత్ర ముసలశూలముల నుల్లసితములుగ
నుజ్జ్వల హార కేయూరాది దివ్యభూషణ గంధమాల్య విస్ఫారలీల

నీలకౌశేయ వసనవై ౯ఖిల సిద్ధ
గణము పూజింప దివికేగగలవు నిన్ను
నెదురువచ్చి ద్రోడ్కొనిపోయి యింద్రుఁడెలమి
నాదిశక్తిగ నభిషేక మాచరించు.

తా. నాశరీరముతో సమానమైన నల్లనిశరీరమును చంద్రాననమును యెనిమిదిహస్తములును శార్ఙ్గము, చక్రము, గదా, ఖడ్గము, కమలము, మధుపాత్ర, ముసలము, శూలము యీ యెన్మిది చేతుల ధరించి దివ్యభూషణ గంధమాల్యాదులతో నీలివస్త్రమును దాల్చి దివికేగిన, యింద్రుడు ద్రోడ్కొనిపోయి యాదిశక్తివని పూజించు వనియు, నారాయణుండగు తాను యదువంశంబున నుద్భవించెదవని చెప్పినట్లును, యశోదగర్భమందు నాయమజన్మించి పూర్వప్రకారంబున దివి కేగినట్లును, అప్పుడు తనయంశంబులచే తన తోబుట్టువగు యాదిశక్తిని గొల్చునట్లు జేయుమనని చెప్పినట్లు భాగవతాదిగ్రంథముల యందు జెప్పియున్నది గనుక మధుపాత్రతో వచ్చినదవుటచే తత్శక్తిని గొల్చువారందరు తత్ప్రీతికరంబగు మధువునర్పించి పానంబుజేయుట నింద్యంబుగాదు. మరియు మధుపాత్ర అనునప్పుడు అమృతకలశ మన గూడదాయన యీలోకమున శక్తిగొలుచువారందరు కల్లు సారాయి యుపయోగించుట ప్రశస్తమైయుండగా నట్లర్థముచేయు టెట్లు ?

భాగ. ఏకా. వచనము.

అనిన రాజునకు శుకుండిట్లనియె. అట్లు వాసుదేవు డన్యాయ ప్రవర్తనులగు దుష్టులసంహరించి న్యాయప్రవర్తనులగు శిష్టజనపాలనం బొనర్చి బలరామ సమేతంబుగా ద్వారకానగరంబు వెడలినం గని యాదవులు తమలోదాము మదిరాపానమత్తులయి మత్సరంబుల నుత్సాహకలహంబులకుం గమకించి కరి తురగ రథాది బలములతో ననర్గళాయుధసన్నద్ధులై — అనియును.

భాగ. తృతీ.

ఉ. మునివర లేగుదేర యదుముఖ్యులు మూకలుగూడి ముట్టబ
ల్కిన గనలొంది వారు తమకించి శపించిన కొన్ని మాసముల్

జను నెడ దైవయోగమున జాతర బో సమకట్టి వేంకర్క
మునమును దొంగిలింప గరిమన్ నిజయానము లెక్కి యాదవుల్.

అని చెప్పియుండుట చేత యదువంశక్షత్రియు లందఱు శక్తిని గొలుచుటకు నదీతీరమునకు నేగి కల్లుద్రావి మత్సరంబులు గలిగించుకొని తమలో దామ యుద్ధము జేసినట్లు చెప్పియున్నది.

భాగ. దశ. పూర్వ.

క. నానావిధ సంపదలకు । దానకమై సర్వకామదాయినివగు నిన్
మానవులు భక్తిగొలుతురు । కానుకలును బలులు నిచ్చి కల్యాణమయీ!

వ. మరియు నిన్ను మానవులు దుర్గా, భద్రకాళి, విజయా, వైష్ణవీ, కుముదా, చండికా, కృష్ణా, మాధవీ, కన్యకా, మాయా, నారాయణీ, యీశానా, అంబికా, శారదా అను పదునాలుగు నామంబుల నాయా స్థానంబులయందు గొల్తురని యెరిగించి, సర్వేశ్వరుండగు హరి సొమ్మని యానతిచ్చిన మహాప్రసాదంబని యయ్యోగనిద్ర యియ్యకొని ప్రమొక్కి చయ్యన నియ్యలకాసి వచ్చిన —

క. మహనీయ గుణాస్పదవై । మహిలో నా దేవి జనుల మన్నింపంగా
బహునామ నివాసంబుల । బహునామంబుల జరించె భద్రాత్మికయై.

ఈ యదువంశజులగు రాజులు యా శక్తి తమ వంశంబున జనియించుటచేతను శ్రీకృష్ణుని తోబుట్టువనియు శ్రీకృష్ణాజ్ఞోల్లంఘనం బాపాదింపకుండునటుల తప్పక యిప్పటివఱకు తద్దేవతా ప్రీతికరంబగు మధు మాంసంబుల నర్పించుచు, తాము నంగీకరించుచుండిరి.

మరియునూ —

భార. విరాట.

క. ఒదవెడు తృష వెల్లిదమున । వదనము వరువట్టువట్టె వాసితరాజన్
మదిరారసమానగ నా । హృదయంబున వేడ్క యొసగ మెసగెడు తరుణీ.

అధిక దాహ వ్యధచే వదనము వాడుబారినదనియు మదిరారసము అనగా కల్లును దెమ్మనుమని తన దాసిగానుండు సైరంధ్రియను ద్రౌపదినిగూర్చి విరాట్రాజ మహిషియగు సుధేష్ణ బల్కినట్లును.

ఆంధ్రనామసంగ్రహము.

గీ. నల్లవలువదాల్పు తెల్లని మైదంట
వెన్నదొంగయన్న వెట్టినీళ్ళ
మేలువాడు దుక్కివాలుదాలుపు తాటి
పడగవాడనంగ బలుఁడు - రుద్రా.

వెట్టినీళ్ళమేలువాడని బలరామునకు నామము గలదు. గనుక చంద్రవంశజులైన విరాట్రాజు, బలరాముడు మొదలైన క్షత్రియులు మధుపానము నింద్యముగా దలంపక నంగీకరించిరని తెలియవలెను.

శుక్రశాపమును గురించి మీరు కనుపర్చిన పద్యముల తాత్పర్యము. అనేక యజ్ఞములాచరించి పొందబడిన సుకృతమెటువంటివారికైన క్షణములో చెరచదగిన యీ కల్లుద్రావు టుచితము కాదనియు యికనుంచి బ్రాహ్మణులాదిగాగల జనులు మదిరాపానముచేసిన పతితులయ్యెదరనియు నే చేసిన నియమము సకలజనులు చేకొనుడనియు శుక్రాచార్యుడిట్లు దోషనిరూపణచేసినట్లు చెప్పియున్నది. ఇందునబట్టి విచారింపగా మద్యపాననిషేధము వేదములయందు చెప్పియున్నదా లేదాయని విచారింతము. వేదములయందు నిషేధింపబడిన యెడల భూసురశ్రేష్ఠుడైన శుక్రాచార్యు డెట్లుదానినంగీకరించె? అప్పటికాయన ధర్మముతప్పినాడనిన, వేదబాహ్యుఁడు కావలెను. వేదబాహ్యుడనిన అట్టివారివలన నీయబడిన శాపము వేదోక్తాచరు లెట్లు విశ్వసింపవచ్చును! అనేక జన్మములయందు నార్జించిన పుణ్యమును నశింపజేయగల యీమద్యపానసేవ జేయనగునేయని తనకుతా నిందించుకొనినట్లు తెలియవచ్చును. అందునబట్టి బహుయజ్ఞఫలము ఒక బ్రాహ్మణహింసచే నశించును గనుక యీ మద్యపానమునను గదా కచుడను బ్రాహ్మణహింస నావల్ల వాటిల్లెనని శపించుకొనియెను. కావున వేదములయందు సురాపానము నిషేధింపబడనట్లు తోచుచున్నది. అయితే శుక్రశాపమునాటినుండియు మద్యము దోషాకారమైనదనిన శాపానంతర ముద్భవించినట్టిదియు వేదోక్తప్రవర్తకులైన బలరామాది యదువులు విరాట్రాజు మొదలైన చంద్రవంశ క్షత్రియు లెట్లంగీకరించిరి?

గాక యీ లోకమందు

తదో త్తర ఊర్ణవిక్రయ సింధుపాన ముభయతో।
తద్విర్వ్యవహార ఆయుధీయ కంసముద్రయానమితి॥

ఉత్తర దేశీయులలో మద్యపానము సర్వత్రా కలుగుచున్నట్లు బోధాయనులవారు చెప్పుచున్నారు. ఇప్పుడు సర్వదేశములలోను సర్వులు బ్రాందీ గంజాయి నల్లమందు మధువు మొదలైన మత్తువస్తువు లంగీకరించుచునే యున్నారు. శాక్తేయ వైష్ణవాది మతములుగలవా రందరు నిరభ్యంతరముగా నంగీకరించుచున్నారు. సురాపానము బ్రహ్మ హత్యాది మహాపాతకములలో చేరినదిగాదాయనిన మాంసముగురించి చెప్పిన క్రిందటిప్రశ్న జవాబులో వ్రాసినప్రకారము లోకాచారము దేశాచారము కులాచారముకు పూర్వాచార శిష్టాచారముల యిప్పటి క్షత్రియులు కొందరట్లాచరించినను నిర్దోషులనబడుచున్నారు.

వృద్ధపారాశరస్మృతి. ౨౧ శ్లో॥

బ్రాహ్మణాదిషు శూద్రస్య పచనాద పరిక్రియా।
భృగ్వగ్నిమరణశ్చైవ ప్రాయశ్చిత్త విధానకం॥

ప్రశ్న:— గొల్లలను వృత్తినామముగల చంద్రవంశక్షత్రియులు శూద్ర పాకము భుజియించుటనుబట్టి వీరిని శూద్రులని యేల చెప్పకూడదు?

ఉ:—శూద్రపాకము చంద్రవంశక్షత్రియులు పూర్వముభుజించియున్నారు.

విరాట్పర్వము. ప్రథమ ఆ.

శా. దేవా నాలవజాతివాడ నిను నర్థి న్గొల్వఁగావచ్చితి
న్నేవాదక్షత యొందుమై యెరుగ నీచిత్తంబునక్ మెచ్చు న
ట్లే వండన్గడునేర్తు భానసమునం దిచ్చోటనేకాదు న
న్నేపీటక్ మిగులంగ నెవ్వడును లేడేభంగులక్ జూచినక్.

తా. దేవా నాలవజాతివాడ అనగా శూద్రుడను. నిన్ను గొలుచు టకై యేతెంచినాడ. నితరసేవలు యేమియు నెరుగను. నీమనస్సు కను కూలమగునట్లు వంటకములు చేయగలను. ఇక్కడనేగాక నెక్కడనేని నాకంటెమెచ్చుపగా వంటకముచేయువారులేరని భీముడు విరాట్రాజుతో ఆడినట్లును ఇందునబట్టి విరాట్రాజు చంద్రవంశ క్షత్రియుడయ్యును

శూద్రాన్నంబు భుజియించుటవలన నింద్యముకాదు. భీముఁడు రాజే కదా యనిన; అసంగతి విరాట్రాజునకు తెలియదుకదా. నాలవజాతివాని పాకము భుజించుట కర్తవ్యమగుటచేత ఒప్పుకొనియెను.

భార. అర. ద్వి. వ.

మరియు బాహుకుండను నామంబుతో సూతవృత్తి నుండుమని కర్కోటకుం డదృశ్యుండై న.

కర్మవశముచే ఋతుపర్ణుడను రాజగృహమున నలచక్రవర్తి ప్రచ్ఛన్నశూద్రత్వము వహించి సుబాహునామంబున వంటలవాడాయెననియును,

భార. అర. ద్వి.

సీ. వినవమ్మ తృణముష్టిగొని వాడు వైచిన నందగ్ని యుద యించి యందు వంట । లమరునంతకు నింధనములపేక్షింపక యుడుగక మండుచు నుండు మరియు । గడకతో నంజుళ్ళు గడుగంగ సమకట్టి జలముపేక్షించుడు సంభవిల్లి । కుంభముల్ నిండి దివ్యాంభప్రవాహ మక్షయమగుచుండ నాక్షణము చూడ । నతని కరతలద్వయావర్తితములై । కందియును మహాసుగంధ కుసుమ । తతుల తొంటియట్ల తమకంబు విడువక । యుండు నీతని తేజ మున్నతంబు.

అనిన పని దమయంతి వేండియు కేశినిబిలచి బాహుకుడువండిన నంజుళ్ళు దెప్పించి యాస్వాదించి బాహుకునందు నలుని లక్షణంబు లుండుటెరింగి,

ఇట్లు భారతమందు చెప్పియుండుటచే క్షత్రియుడగు నల చక్రవర్తి భీమునివలె ప్రచ్ఛన్న వేషముతో వంటకములుచేయుటయు ఋతుపర్ణుడు మొదలయిన రాజులు భుజించుటయు కలిగియున్నది.

నిర్ణయసింధౌ. 3 అధ్యా. శ్రాద్ధనిర్ణయ పేజీ. పరాశరః.

శ్లో॥ తావద్భవతి శూద్రాణాం। యావన్న స్పృశతి ద్విజః,
ద్విజాతికర సంస్పృష్టం సర్వంతం న్నవిరుధ్యతే.

విష్ణుపురాణే.

శ్లో॥ సంప్రోక్ష ఇత్వా గృహీన్నయా శ్చూద్రాన్నం గృహమాగతం॥

అంగిరాః.

శ్లో॥ పాత్రాంతరగతం గ్రాహ్యం । దుగ్ధం స్వగృహ మాగతం॥

తా॥ శూద్రాన్న మెంతవరకో అంతవరకు శూద్రాన్న మగుచున్నది. ద్విజునిహస్తముచేత స్పృశింపబడిన దంతయు గ్రాహ్యము. తనగృహమునకు వచ్చిన శూద్రాన్నము ద్విజుడు ప్రోక్షించిన భుజింప వచ్చును. తనయింటికి దెచ్చిన శూద్రసంబంధమైన దేదియైనను మరి యొక పాత్రయందుంచుటచే గ్రాహ్యనీయంబు అనగా శూద్రపాత్రతో గ్రహింపగూడదనుట.

ఇట్లు శూద్రాన్నము స్పృశించినమాత్రమున, ప్రోక్షణమాత్రమున పాత్రాంతరమున భుజింపవచ్చునని చెప్పియున్నారుగాన యేతత్ క్రియావిహీనము భుజించుటయే వలనుపడదు. కావున శూద్రాన్నభుక్తి వలన ద్విజులగు చంద్రవంశక్షత్రియుల కేయాక్షేపణయు లేదు. అట్లయిన శూద్రాన్ననిషేధ మేల చెప్పిరనిన ఛండాలపర్యంతము శూద్రత్వము కలదుగనుక సంకరజాతుల పాకము భుజింపగూడదనుట.

ప్రశ్న:— ఈ లోకమందుగల జాతులలో శూద్రు లెవరు? మిశ్ర జాతి యేది?

ఉ:— సచ్ఛూద్రులు.

దాసుడు:— కాపుస్త్రీయందు బ్రాహ్మణునకు బుట్టినవాడు.

నాపితుడు:— సంస్కారణము కానివాడు.

గొల్ల:— క్షత్రియునకు కాపుస్త్రీయందు జనించినవాడు.

అర్ధికుడు లేక సిరి:— వైశ్యస్త్రీకిని బ్రాహ్మణునకు జనించినవాడు. కుంభకారకుడు.

పరాశరస్మృతి ౧౧ అధ్యాయము.

శ్లో॥ శూద్రకన్యా సముత్పన్నో బ్రాహ్మణేనతు సంస్కృతః ।
సంస్కారా ద్భవేద్దాస అసంస్కారాత్తు నాపితః॥ ౨౨

క్షత్రియాత్ఛూద్ర కన్యాయాం సుతోజాయేతనామతః ।
సగోపాల ఇతిజ్ఞేయో భోజ్యో విప్రయి ర్నసంశయః॥ ౨౩

వైశ్యకన్యా సముద్భూతో బ్రాహ్మణేన సుసంస్కృతః ।
సంహార్ధిక ఇతిజ్ఞేయో భోజ్యో విప్రయి ర్నసంశయః॥ ౨౮

యాజ్ఞవల్క్యస్మృతి.

శ్లో॥ శూద్రేషు దాస గోపాలా కులమిత్రార్ధ శీలినః ।
భోజ్యాన్నా నాపితశ్చైవ యశ్చాత్మానం నివేదయేత్॥

చతుర్వింశతిమతేపి.

శ్లో॥ అర్ధికః కులమిత్రశ్చ గోపాలో దాసనాపితా ।
యేతే శూద్రేషు భోజ్యాన్నా యశ్చాత్మానం నివేదయేత్॥

దేవలస్మృతి.

శ్లో॥ సదాసోనాపితో గోపః కుంభకారః కృషీవలః ।
బ్రాహ్మణైరపి భోక్తవ్యా పంచైతే శూద్రయోనయః॥

స్మృత్యంతరేపి.

గోపాలనాపితకుంభకారకులమిత్రార్ధ సీరిక నివేదితాత్మానో భోజ్యాన్నాని.

పైన చెప్పబడిన యేయుజాతులు సత్శూద్రులనబడుదురు గావున బ్రాహ్మణాదిద్విజులు వారల అన్నము తినవచ్చును.

క్షత్త:— క్షత్రియస్త్రీకిని శూద్రునకు బుట్టినవాడు.

క్షత్తార్యా శూద్రయోస్సుతః॥ అమరము.

విజ్ఞానేశ్వరీయము.

క౦. కోమటికిని శూద్రునకును । భూమీశ్వరపుత్రియందు బుట్టెదరోలిం
దామాగధుండుగ నాతని । గ్రామాధ్యక్షుండునైన క్షత్తయు ననగన్.

సూతుడు:— క్షత్రియునివలన బ్రాహ్మణస్త్రీకి బుట్టినవాడు.

బ్రాహ్మణ్యాం క్షత్రియా త్సూత॥ అమరం.

విజ్ఞానేశ్వరీయము.

క. రాజిత విప్రాంగనకును । రాజునకుం బుట్టునతడు రథసూతు వి
భ్రాజిత విప్రాంగనకును । వైజాతికి బుట్టునతడు వ్యవహారియగున్.

వ్యావహారి:— బ్రాహ్మణస్త్రీకిని వైశ్యునకు బుట్టినవాడు.

అమరము

వైదేహుడు:— బ్రాహ్మణ్యా క్షత్రియ త్సూత స్తశ్యాం వైదేహకోవిశః॥
వైశ్యస్త్రీకి శూద్రునకు బుట్టినవాడు.

కరణుడు:— శూద్రస్త్రీకిని వైశ్యునకు బుట్టినవాడు.
శూద్రా విశోస్తు కరణం అమరం.

విజ్ఞానేశ్వరీయము.

క. కోమటికి శూద్రభామిని। కామినియై కన్నసుతుడు కరణుండను నీ
నామమున బరగున।ని మును ధీమంతులు తేటపడగ దెల్పిరి జగతిన్.

అంబష్ఠుడు:— వైశ్యస్త్రీకిని బ్రాహ్మణునకు బుట్టినవాడు.
అంబష్ఠో వైశ్యా ద్విజన్మనో॥ అమరం.

విజ్ఞానేశ్వరీయము.

క. మునువిప్రునకును క్షత్రియ।వనితకుజన్మించువాడు వైశ్యుడు వైశ్యాం
గనకును విప్రోత్తమునకు। ననుకూలత బుట్టువాడు నంబష్ఠుడగున్.

ఉగ్రుడు:— శూద్రస్త్రీకిని క్షత్రియునకు బుట్టినవాడు.
శూద్ర క్షత్రియయోరుగ్రో॥ అమరం.

విజ్ఞానేశ్వరీయము.

క. రాజన్యువలన వైశ్య। స్త్రీజుడు మాహిష్యుడనగ జెల్లును శూద్ర
స్త్రీజాతు డుగ్రు డనజను। ధీజననుత కీర్తిపూర ధీరవిచారా.

మాగధుడు:— క్షత్రియస్త్రీకిని వైశ్యునకును బుట్టినవాడు.
మాగధ క్షత్రియా విశః॥ అమరం.

క. కోమటికిని శూద్రునకును। భూమీశ్వరపుత్రియందు బుట్టెద రోలిం
దామాగధుండుగ నాతని। గ్రామాధ్యక్షుండునైన క్షత్తయునవగన్.

మాహిష్యుడు:— వైశ్యస్త్రీకిని క్షత్రియునకును బుట్టినవాడు.
మాహిష్యోర్యా క్షత్రియయోః అమరం.

విజ్ఞానేశ్వరీయము.

క. రాజన్యువలన వైశ్య। స్త్రీజుడు మాహిష్యుడనగ జెల్లును శూద్ర
స్త్రీజాతు డుగ్రు డనజను। ధీజననుత కీర్తిపూర ధీరవిచారా.

వైశ్యుడు:— బ్రాహ్మణునకు క్షత్రియస్త్రీయందు బుట్టినవాడు.

విజ్ఞానేశ్వరీయము

క. మునువిప్రునకును క్షత్రియ। వనితకు జన్మించునతడు వైశ్యుడు వైశ్యాం
గనకును విప్రోత్తమునకు। ననుకూల బుట్టువాడు నంబష్ఠుడగున్.

నిషాదుడు:— బ్రాహ్మణునకు శూద్రస్త్రీయందు బుట్టినవాడు

విజ్ఞానేశ్వరీయము.

క. భూదేవుడు శూద్రస్త్రీ। నాదరమున బెండ్లియాడి యా సతియందు
త్పాదించినవిప్రుండు ని। షాదు డనబరగుచుండు సమ్మదలీలన్.

రథకారుడు:— కరణస్త్రీకిని మాహిష్యునకు బుట్టినవాడు.

రథకారస్తు మాహిష్యాత్కరణ్యాం యస్యసంభవః అమరం.

చండాలుడు:— శూద్రునిచే బ్రాహ్మణస్త్రీయందు జనించినవాడు.

చండాలస్తు జనితో బ్రాహ్మణ్యా వృషలేనయః॥ అమరం.

విజ్ఞానేశ్వరీయం.

క. గోరకై బ్రాహ్మణకన్యక। దొరసినశూద్రుండు ప్రీతితో నొక్కటియై
వెరవకబుట్టించినయా। జరభికిబుట్టినయతండు చండాలుడగున్.

ఇట్లు శూద్రజాతి మొదలుకొని చండాలపర్యంతము గల జాతులు మిశ్రజాతులుగా నెరుంగవలయును.

ప్రశ్న:— ఇప్పుడు మీరుజెప్పిన సచ్ఛూద్రులును మిశ్రజాతులుగానే కనుపించుచున్నారు. నాలవజాతి శూద్రులెవరు?

ఉ:— నాలవజాతి శూద్రులు ఫలానావారని నిర్ణయించుటకు తగినంత శాస్త్రప్రమాణము ప్రస్తుతమందు కనిపించలేదుగాని శ్రీనాథునిచే రచియింపబడిన భీమేశ్వరపురాణమందు వేమభూపాలుని వంశవర్ణనయందు, పంటరెడ్లు, వెలమలు, కమ్మలు, వంటరులు, సరిసర్లు అనువారు నారాయణుని పాదకమలయం దుద్భవించినవారినిగా వ్రాసినాడు.

భీమేశ్వరపురాణము.

ఉ. కైటభదైత్యవైరి పదకంజమునం దుదయంబునొంది మి
న్నేటికి భూతధాత్రికిని నెంతయునచ్చిన తోడబుట్టువై

హాటకగర్భముఖ్య నిఖిలాసురమౌళి మణిప్రభా
పాటలవర్ణమైన నొకపావనవర్ణము దీర్ణసంపదన్.

వ. అప్పుణ్యవంశంబు కంసాసురధ్వంసి చరణపల్లవంబు తనకు బుట్టి నిల్లుగావున గారణ గుణసంక్రమంబున్న బోలె జామర తోమర ఛత్రధనుఃఖడ్గాదచిహ్న పశోభితంబై చదలేటి సీటివలనిసోదరీ స్నేహాలబ్ధంబులుబోని పావనత్వ శుచిత్వ గాంభీర్య మాధుర్యం బులు చరితమను స్వభావవచనంబుల ధరియించి సైదోడుంబోదివి విశ్వవిశ్వంభరా క్రీడనంబున దనకువిదిర్చిన పరమశాంతి యంత రంగంబున సంతరించి నిఖిలప్రపంచంబున కాధారంబై ప్రవర్తిల్లె. అందు పద్మనాయకులను వెలమలనగ, కమ్మలనగ, సరిసర్లన, వంటర్లన బహుప్రకారశాఖోపశాఖా భిన్నంబులై గంగాప్రవాహం బునుంబోలె గోత్రంబులెన్ని యేనియు జగత్పవిత్రంబై ప్రవహింపు చుండ కల్పంబు లతిక్రమించి మన్వంతరంబులు జరిగి యుగంబులు నరికడచి వత్సరంబులుచని కాలచక్రంబు లతిక్రమించు చుండ చతుర్ధకులమౌళి మండనంబై కీర్తివిహార ఘంటాపదంబైన పంట మహాన్వయంబు పాకనాటి దేశంబున భద్రపీఠంబున నివసించె. (ఇంకను వచనము కలదు. కాని వలయునంతకు ముగించితి.)

ఇట్లు చెప్పియుండుటచే పైనకనుపర్చిన జాతములు శూద్రులని తోచుచున్నది.

ప్రశ్న:— గోపాలకాది వృత్తినామములచే నున్నవారు చంద్రవంశ క్షత్రియులని విస్పష్టముగా లక్ష్యలక్షణములచే దృఢపరచితిరిగాని

పరాశరస్మృతియందు,

శ్లో॥ క్షత్రియ చ్ఛూద్రకన్యాయాం సుతోజాయేత నామతః।
సగోపాల ఇతిజ్ఞేయో భోజ్యో విప్రైర్నసంశయః॥

అని చెప్పియున్న ప్రకారం యీగోపాలకజాతిగా యీలోకమందు గల గొల్లలనువారిని యేల భావింపగూడదు ?

ఉ:— మీరిప్పుడు చెప్పబడిన సచ్ఛూద్రులగు గోపాలకులనువారం యిదివరకు దెల్పిన గొల్లలను వృత్తినామముగల యదువంశ క్షత్రి

యులు కావు. వృత్తినామము లాగంతకములుగాని స్వాభావిక ములు గావు ఈ యదువంశక్షత్రియులను గోపాలకవృత్తిచే గొల్ల లనినంతమాత్రమున మిశ్రజాతిగా యెంచేయెడల –

గురుబాలప్రబోధిని. ౪౭౭ శ్లోకం.

స్త్రియాం కృషిః పాశుపాల్యం వాణిజ్యం చేతివృత్తయః। కర్ష ణం–కృషిః – కృషివిలేఖనే–దున్నుటకృషి – ఇ–సి – పశూనాం–గోమహిష్యా దీన్ పాలయతీతి–పశుపాలః॥ తస్యకర్మ పాశుపాల్యం॥ గోమహిష్యాది పశువుల పాలించువాడు పశుపాలుడు. వైశ్యునకిట్లు గోపాలకవృత్తి చెప్పియున్నందున వైశ్యునను సంకరజాతి గోపాలుడనే చెప్పవలసి వచ్చును. అదియునుంగాక –

శ్లో॥ వైదేహక స్సార్థవాహో। నైగమో వాణిజో వణిక్॥ ఇత్యమరః॥

తా. వైదేహకుడనగా వైశ్యునకు వృత్తినామమై వున్నది.

నామ్నమాల.

శ్లో॥ వైదేహకంతు శూద్రాజ్జాతం। వైశ్యాసుతం బ్రువతే॥

తా॥ వైశ్యస్త్రీకిని శూద్రునకు బుట్టినవాడు వైదేహుడు.

వైశ్యునకు వైదేహకుడని వృత్తినామము చెల్లినంతమాత్ర మున వైశ్యులనుకూడా సంకరజాతులని చెప్పవచ్చునా ?

విజ్ఞానేశ్వరీయము.

క. మును విప్రునకును క్షత్రియవనితకు జన్మించినతడు వైశ్యుడు
వైశ్యాంగనకును విప్రోత్తమునకు ననుకూలతబుట్టునాత డంబష్ఠుడగుక

తా॥ బ్రాహ్మణునకు క్షత్రియస్త్రీకిని జన్మించినవాడు వైశ్యు డని చెప్పియున్నదిగదా, ఇప్పుడు లోకమందు వైశ్యులనువారిని మిశ్ర జాతులనిన నొప్పుకొనెదరా ? మరిన్ని –

శ్లో॥ శూద్రా విశో స్తు కరణం॥ అమరం.

తా॥ శూద్రస్త్రీకిని వైశ్యునకు బుట్టినవాడు కరణుడు.

"కరోతి లేఖనకర్మేతి కరణః డుకృఞ్ కరణే" లేఖనకర్మ చేయువాడు.

ఇప్పుడు లోకమునందు లేఖనకర్మగలిగి కరణాలను పేరు వహిం చిన బ్రాహ్మణులను మిశ్రజాతియగు కరణజాతి యనవచ్చునా?

విజ్ఞానేశ్వరీయము.

క. రాజితవిప్రాంగనకును। రాజునకున్ బుట్టినతడు రథసూతుడు వి
బ్రాజిత విప్రాంగనకును వై జాతికి బుట్టునతడు వ్యవహారియగున్.

తా. బ్రాహ్మణస్త్రీయందు వైశ్యునకుబుట్టినవాడు వ్యవహారి.

వ్యవహారనామాంతరము వ్యాపారమగుటచే తదావలంబనముగా రాబడినవ్యాపారులను, లోకమందుగల బ్రాహ్మణులను మిశ్రజాతిగా యెంచవచ్చునా? వృత్తినామము లాగంతుకములుగాన యేజాతివారేవృత్తి యాచరించెదరో నావృత్తి నామంబులచే పిలువబడుదురు. అంతమాత్రమున స్వతస్సిద్ధమైన స్వాభావిక కులనామంబులంతరింపవు గావున యిట్టి వ్యతిరేకార్థంబు లంగీకరింపరాదు. కావున గోపాలకాది వృత్తినామములుగల చంద్రవంశక్షత్రియుల మిశ్రజాతి గోపాలులనుటకు వలనుపడదు. శబ్దమాత్రంబున నట్లారోపించిన మూఢుల భావంబెట్టిదనిన, బ్రాహ్మణులనుగూర్చి ద్విజులనెడిచో సర్పములని భ్రమపడినట్లును, శ్రీకృష్ణునిగూర్చి హరియనినచో కోతియని నగినట్లును, అశ్వమునుగోరి సైంధవమును దెమ్మనినచో లవణమునుదెచ్చు భంగి ఒక శబ్దమున కనేకార్థములు కలిగినప్పు డెప్పుడెచ్చటేయర్థ ముపయోగించునది తెలియక భ్రమనొందెడి మూర్ఖుల వాక్యంబు లార్యాంగీకారంబులుకావు. కొందరు సంకరజాతులు తమసాంకర్యనింద్యమున కోర్వజాలక నుత్తమజాతులకొక వక్రత్వముండుట లెస్సయని కొన్ని కూహకోక్తులుబన్ని ఇట్లుబలికినను నవి పండితులయెడపాటింపక పలుకువారల సిగ్గుజెరచునవియైయుండును.

ఇదిన్నిగాక వీరు యదువంశ క్షత్రియులనుటకు శ్రీకృష్ణుని తోడబుట్టువగు ఆదిశక్తి బహునామంబులచే ప్రపంచమందు వెలయుటవలన ఇప్పటికి దద్వంశజాతులగు వీరలు నానారూపంబులచే వెలయు ఆదిశక్తిని కులదేవతగా కొలచువారలుగాను, తద్దేవతలకు పూజార్హులుగానుండి తరతరములనుంచి తమ్మటకాహాళములు మొదలయిన వాద్య

ములతో జాతరచేయుటయు (యాచకులు యీక్షత్రియుల నడుగు కొనువారలు) అను జనులవలన తమకుగల బిరుదములును పూర్వరాజ చరిత్రములు మొదలైనవి కథలుగా జెప్పించుచుండుటయు లోకమందు సర్వజనులు వినినసంగతియైయుండగా నెట్లు కాదనజాలుదురు ?

ప్రశ్న:- గొల్లయను వృత్తినామముగల చంద్రవంశ క్షత్రియులు, పూరిగొల్లలనియు, పూజగొల్లలనియు, ఎర్ర గొల్లలనియు, పూనాటిగొల్లలనియు, వృష్టిగొల్లలనియు, కర్ణగొల్లలనియు, మందగొల్లలనియు, కరుపగొల్లలనియు యీమొదలయిన భేదములచే వాడుటకు కారణమేమి?

ఉ:- ఈ కలియుగమునందు బ్రాహ్మణాది సకలవర్ణముల యందనేక భేదములుకలవు. శాఖాంతర, మతాంతర, దేశాంతర, కర్మాంతర, జీవితాంతరాదిక భేదములచే యనేక నామాంతరములు కలిగి అనేక తెగలుగా నుందురు.

బ్రాహ్మణులలో వెలినాడు, తెలుగునాడు, మురికినాడు, కోసలనాడు, వేగినాడు ఇట్లయిదు భేదములు. వీరిలో ఋగ్వేదశాఖ, యజుర్వేదశాఖ, సామవేదశాఖ యని మూడు శాఖలు. వీరిలో ద్రావిడులనియు, సత్యాషాఢులనియు, ఆర్వేలనియు, నందవరీకులనియు దమిళవారనియు, పాకనాటీయులనియు ఇట్లు స్మార్తులలో కలరు. ఇందులో వైష్ణవులనియు, వ్యాపారులనియు, మధ్వులనియు, ఆరాధ్యులనియు అనేకభేదములు కలవు.

వైశ్యులలో

వేగినవారనియు, వేగనివారనియు లేక బేరులనియు.

శూద్రులలో

రెడ్లు అనియు, వెలమలనియు, సరిసర్లనియు, వంటర్లనియు, కమ్మలనియు, బలిజలనియు ఇట్లనేక భేదములుండుటయేగాక ప్రతియొకజాతికి అనేకభేదములు కలవు.

ఈ చంద్రవంశక్షత్రియులకు నట్లనే యనేక శాఖోపశాఖలుగా భేదములును, నామాంతరములును కలిగినవి.

ఇంగుక ప్రమాణము. రాగ. దశ. ఉ.

క. హారికిద్వారార్థమై నిర్జరులాను యాదుకులమునందు జనియింపంగా
ధర నూటొక్కకులంబై బరగిరి వారిని గణింప బ్రహ్మకువశమే.

ఇట్లు యదువంశను ద్వాపరాంతమందే నూటొక్కకులము లుగా నేర్పడనదని చెప్పియున్నది. ఇట్లు యేయే వర్ణమున కెన్నెన్ని భేదములు కలిగినను నామాంతరము లెన్నివిధములుగా వాడుకున్నను ప్రధానవర్ణమునకు భంగము రానేరదు.

సుమతి శతకము.

ప్ర:- అల్లుని మంచితనంబును । గొల్లని సాహిత్యవిద్య కోమలినిజముల్
బొల్లునదంచినబియ్యము। తెల్లని కాకులును లేవు తెలియగ సుమతీ.

వేణుగోపాల శతకము.

సీ. దూదేకులహుసేను దొమ్మరిగోపాళు పట్రమంగడు గాండ్లబావిగాడు
బైసేనినాగడు పటుసాలెనారాయ డగముడిలచ్చిగా డామకుందు
చాకలిమల్లడు సాతాని తిరుమల గొల్లకాటడు బెస్త గురివిగాడు
కోమటిశంభుడు కుమ్మరి చెంగడు మంగతెల్లడు బోయ సింగడొకడు
కన్నె నాలంజకొడుకులు కవులుగాగ। వేదశాస్త్రంబు లేడను విప్రులేడ
మదరిభువిపాల మునిజనహృదయలోల। వేణుగోపాల భక్తసంత్రాణశీల.

చంద్రశేఖర శతకము.

చ. ఇరిదిగచూస్తి తీరము లెన్నినా యిందొనకొండ గంగజాతర
సరికావు పంబలును తప్పెటలుల్ గొముకాండ్ల సిళ్ళసం
బరమది నిప్పు మింకొక ప్రభావము రంకులరాటమెక్కి నే
తిరిగిన సాటిరాదని నుతించును మూర్ఖుడు చంద్రశేఖరా.

ఉ. అద్దమరేయి గొర్లరసినట్ల యెసంగ ముపస్త యేదమే
మిద్దొ పురండమోయనగ యీరులసుద్దులో పంబనాదమో
పొద్దున బాపనాండ్ల నెలిపొమ్మని వూరెలగొట్టకుంటె నా
పద్దుకు దొడ్డమోసమని పల్కును మూర్ఖుడు చంద్రశేఖరా.

ఇట్లు సుమతిశతకము, వేణుగోపాలశతకము, చంద్రశేఖర శతకాదులలో గొల్లవర్ణమును నిందార్హములుగా చెప్పియుండుటకు కారణము యేమి?

ఉ:— ఇప్పుడు మీరు కనుపరచిన శతకములు ప్రమాణార్హ గ్రంథములు కావు. 'గొల్లని సాహిత్యవిద్య' లేదనుట లీవనుక జెప్పబడిన గొల్ల యను వృత్తినామముగల చంద్రవంశ క్షత్రియులయం దారోపింప రాదు. ఏలననగా ధర్మాది చతుర్విధ ఫలప్రదాయినియగు గీతాశాస్త్రము కల్పించిన మహాపండితుండైన శ్రీకృష్ణుడును, స్త్రీశూద్ర దాసీజన సంస్కారంబై స్మరణమాత్రంబున ముక్తి సంభవించునట్టి సాత్వత తంత్రంబను వైష్ణవస్మృతి కల్పించిన శ్రీకృష్ణుని కుమారుడగు ఉపశ్లోకుడును సర్వధర్మశాస్త్ర పరిజ్ఞానుండగు భీష్మాచార్యులును ధర్మరాజును మొదలైన మహామహులు పండితులై యుండగాను మరిన్ని కలియుగమందు పంచమ వేదంబునాబరగు భారతం బాంధ్రంబున కృతియందిన పండితుండును రసికుండగు రాజనరేంద్రుండును అనేక పండితరక్షణజేసి మనుచరిత్రమాదిగాగల యనేక గ్రంథంబులు గృతినందియును మదాలస చరిత్రము, సత్యావధూ ప్రీణనము, సకలకథా సారసంగ్రహము, జ్ఞానచింతామణియు, రసమంజరియు, మొదలయిన సంస్కృత గ్రంథములును, విష్ణుచిత్తీయ మను నామాంతరముగల ఆముక్తమాల్యద మాంధ్రమునను రచియించిన మహాపండితుండైన కృష్ణదేవరాయలు, పరమయోగి విలాసము రచియించిన వసుచరిత్ర కృతియందిన తిరుమలదేవరాయల మేనల్లుడగు తిమ్మరాజును, హరిహరనాథునిపేర పంచ తంత్రములను గ్రంథ మాంధ్రమునరచియించిన మహాపండితుడగు వెంకటనాధరాజును, చంద్రవంశక్షత్రియులలో ననేకులు పండితులుగాను రసజ్ఞులుగాను పండితపోషణ సేయువారలుగా నుండగా 'గొల్లనిసాహిత్యవిద్య' లేదనుట లెట్లీజాతమునందంగీకరింపబడును? గొల్లయను నామము గోపాల అను సంస్కృతశబ్దమున కాంధ్రమై నందున పసువుల గాయువానియందు వర్తించెడి వృత్తినామముగా నిదివరకే సిద్ధాంతము చేయబడియున్నదిగావున, 'గొల్లని సాహిత్య విద్య' లేదనుట కర్థము. పశువులగాయువానికి లేదని చేయువలసి యుండును. ఆసుమతిశతకమందే.

క. గొల్లనిసతి గొల్లనిపతి। గొల్లని చెలికానివిడువ గొల్లనివాడే
గొల్లండుగాక ధరలో। గొల్లండును గొల్లడౌనె గుణమునసుమతీ.

క. వినదగు నెవ్వరు సెప్పిన। వినినంతనె వేగపడక వివరింపదగున్
కనికల్ల నిజముదెలియుసి। మనుజాధిపుడతడు గొల్ల మహిలో సుమతీ.

రెండుపద్యములకు తాత్పర్యము.

ఒల్లని స్త్రీని. ప్రభువును, మిత్రుని విడుచుట కొప్పుకొననివాడు గొల్లడు; అనగా పశువుల గాయువాడనియును, నిజముగా పశువుల గాయువాడు గొల్లడు కాడనియును, అనగా పశువులగాయువానికైనను యీవివేకము కలదనియు, సితని కంతమాత్రము వివేకము లేదనియు; మరిన్ని యెవ్వరుచెప్పినను విని, వినినంత కని సత్యాసత్యములను తెలియని ప్రభువు గొల్ల . అనగా పశువులకాయుమాత్రపువాడని తాత్పర్యమైయుండగా కొందరు శబ్దజ్ఞానవిహీనులు గొల్లయను వృత్తినామముగల చంద్రవంశక్షత్రియులయందారోపించి నిందార్థముగా వాడుదురిట్టి పద్యములు నీతియుక్తములయినను పెరుగువడ్లును కలిపిన పదార్థదధ్యాన్నంబు మాడ్కి సామాన్యులుకూడ భుజియింప వీలుగానట్లు నల్పులకైన నంగీకరంబులు కావు.

చంద్రశేఖర శతకము.

ఈ శతకము యానపదములుగాను దూషోక్తులుగాను చెప్పబడియును గొల్లయను వృత్తినామముగల క్షత్రియులనుగురించి చెప్పినదికాదు. అది మూర్ఖులనిమిత్తము చెప్పబడినదని యీగ్రంథకారుడే చెప్పియున్నాడు.

చ. కలుషమనోవికారులకు కష్టులకున్ కుజనాళికిన్ కుతర్కులకును ధర్మసూన్యులకు కూళకు మానవకోటికిన్ మదాంధులకును సిగ్గుపుట్ట మదినూల్కొన నేరచియింతు నిన్ను నిశ్చలమతిజేర్చి యీ శతకశాసన మిమ్ముగ చంద్రశేఖరా!

తా. కలుషమానసులకును, కష్టులకును, దుర్మార్గులకును, కుతర్కులకును, ధర్మవిహీనులకును, మాయామనుజులకును సిగ్గు పుట్టులాగున జెప్పెదనని యున్నది. ప్రపంచమందిట్టి జనులు బ్రాహ్మణాది

చండాలురపర్యంతము గలరు గావున నా గ్రంథభావమంతయును దుర్జనులందు జెందుచున్నది.

ఉ. రెడ్డి డభోల్ డభోల్ హరిహరీ ఘౌనే నీ తమాసచూపుమా
దొడ్డగ ఆనెకూకుడరు దొర్లదె యీన యటంటనాడె మా
మెడ్డుగ దొమ్మరెక్కగని మించినయిద్దె మరేడలేదు నా
తెడ్డుక బాపనిద్దెలని తిట్టును మూర్ఖుడు చంద్రశేఖరా! ౩౯

తా. దొమ్మరి ఆటలాడునెడ డోలు కొట్టుచూ, తనను కొని యాడుచు దొమ్మరిది గడయెక్కుటచూచి ఒక రెడ్డియను మూర్ఖుడు యీ యిద్దెకు మించిన యిద్దెలేదనియు, బాపనిద్దెలు నా తెడ్డుకా యనియు తిట్టును.

ఉ. తిమ్మడి వల్లుసూస్తె సలితాపములంట యిదేటి రోగమో
తమ్ముడు వూరలేడు తను దాసరికూడు కులానలే ఛీ
కమ్మకులానికిట్లు కడగాండ్లు మరేందొ వుదేశ్నవస్తె నే నమ్మను
యప్పలీయమని యందురు మూర్ఖులు చంద్రశేఖరా! ౯౧

తా॥ తిమ్మడనువాని వల్లు సలితాపము లనియు, తమ్ముడు గ్రామమందు లేడనియు, అతనిని చూస్తే దాసరికూడనియును, కుల మందే లేడనియును ఛీ కమ్మకులానికి యిటువంటి కడగండ్లు యేమి యనియును, వుదయమునవస్తే అప్పలీయ నమ్మననియు పలికినట్లు చెప్పియున్నది. ఇట్లన్నికులములనుగురించి చెప్పియుండినను ఆ గ్రంథ మందు కొన్ని యుత్తమమీద పరావమానమును బోధించినంత పట్టుదల దుర్జన లజ్జాకరమైన నీతియందు కనుపింపదు.

వేణుగోపాల శతకము

సీ॥ ఏదంబులకు మంగలెంకడే బగునేటు ప్రశ్న జెప్పను మాలపాపిగాడు
కయికముల్ జెప్ప బోగము చినెంకడేసరి సంగీతయిద్దెకు చాకలెల్లి
శాత్రపురండాలు సాతానసంతమ్మ చిందులుద్రొక్క దాసరిపెదక్కి
యీనెగొట్టను కోమటిరేశమేసరి తీరతాలకు మారుమనుములచ్చి
యనుచు మూర్ఖాళి యీరీతి నాడుచుంద్రు
భూతలమునంత యిసుమంత నీతిలేక

మదరిపువిశాల మునిజన హృదయలోల
వేణుగోపాల భక్తసంత్రాణశీల. ౨౬

సీ. కోమటి యత్యంతకామము గోరును ధారుణీక్షితిపతి తప్పుగోరు
దండికరణము గ్రామదండగోరును జంబుకంబేవేళ శవముగోరు
కుజనుడొవ్వెద్యుండు ప్రజకురోగముగోరు సామాన్యవిప్రుడుచావుగోరు
నతిజారులగువారు నమవశగోరుదు రాంబోతు పేదల యశముగోరు
కాపువానికి గ్రామాధికారమైన
దేవభూసుర వృత్తులు దీయగోరు ॥మద॥ ౩౭

సీ. తండ్రిమధ్వాచారితనయుడారాధ్యుండుతల్లి రామానుజమతస్థురాలు
తానుకూచిమతంబు తిమ్మడుబౌద్ధుం॥ సర్వేశ్వర మతంబు మడ్డకునిది
ఆలుకోమటిజాతి యక్కజంగముగాలు బావమరిదిది లింగబలిజకులము
ఆడబిడ్డ సుకారి అల్లుడు పింజారి మరదలు కోడలు మాలవాడి
కలియుగంబున వర్ణసంకరులు ప్రబలి
రుత్తమకులంబు లోకమూల నొత్తిగిల్లె ॥మద॥ ౩౮

సీ. నంబికవిత్వంబు తంబళజ్యోశ్యంబు వలనొప్పకోమటి వైష్ణవంబు
వరుసనే యుప్పరివానిసన్యాసంబు తరువాత శూద్రసంతర్పణంబు
రజకునిగానంబు రండాప్రభుత్వంబు వెలయగా నరవలవితరణంబు
సాతానివిద్వాంసశాస్త్రవాదము వేశ్యతనయుడబ్బకుబెట్టుతద్దినంబు
నుభయభ్రష్టత్వములు జూడ నుర్విలోన
రాజసభలందు నెన్నగారాదు గదుర ॥మద॥ ౪౪

సీ. వెల్లుల్లివనములో వెలయంగజోరీగ పికముపాడూరను బెస్తరాజు
సాలెకేంద్రులలోన సాతానిపండితుం డంధులలోన నేకాక్షిశ్రేష్ఠు
డతిలోభిరాజున కర్థంబు నడుగనివాడెపో పండితవర్యు డరయ
గాపుమంత్రములలోనగాటేరిదైవంబు కొక్కెరాయలలోనకొంగఘనము
గుడిసెవేటుల నిల్లాలు గుత్తలంజ
గనుక నీరీతి బెక్కులుగలవు తలప ॥మద॥ ౪౯

సుమతీ శతకం.

క. నరపతులు మేరదప్పిన। తిరమొప్పగ విధవ యింటితీర్పరియైనన్
గరణము వైదికుడైనను। మరణాంతకమౌనుగాని మానదుసుమతీ.

క. కరణముసాదైయున్నను।గరిమదముడిగినను పాముకరవకయున్నన్
ధర తేలుమీటకున్నను గరమరుదుగ లెక్కగొనరు గదరాసుమతీ.

క. వెలయాలు సేయు బాసలు
వెలయగ నగసాలపొందు వెలమల చెలిమిన్
గలలోనగన్న కలిమియు
విలసితముగ నమ్మరాదు వినురా సుమతీ.

ఇట్లనేకుల ననేకరీతులనిందించి కొందరు కవులు లజ్జావిహీనులై తమకుగల కవిత్వరచననంతయు పరదూషణార్థముగా వినియోగపరతు రిట్టి స్వస్తుతి, పక్షపాతము, సంప్రదాయ భంగము, శాస్త్రబాధ, మత్సరము, నీతిలోపము, నిందాది దుష్ప్రయోగ గ్రంథంబులు పండితామోదంబులు గాకపోవుటయే గాక సత్కవుల కనాదరణీయంబులుగా నెరుంగవలయును. మరియు నిట్టి గ్రంథము లన్యధనాపహరణోద్యోగ పరవంచకాది మాయోపాయోక్తులచే చరించు దుర్వ్యాచక సముదయంబునకు సహకారియును మానరక్షణ వ్యాపారులకు విషతుల్యంబునునగు నివి పూజ్యంబులుగావు. పూర్వము పల్లెకూటములలో బాలురకు విద్యనేర్పు పంతుళ్లు శాస్త్రజ్ఞానవిహీనలగుటచేతనో లేక దుష్టభావంబుననో హిందూదేశమం దీ నీతివిరహితగ్రంథంబులనే ముఖ్యపాఠములుగా నేర్పరచి బాలురకు ప్రబోధించుటనుబట్టి బాలురకును పంతుళ్ళవలెనె జ్ఞానహీనత గలిగి యింత దుర్వ్యాపకలోకి రావడము కలిగినది. ఈ గ్రంథంబులు రచియించి వారి కులనామ గోత్రంబులెచటను కనుపరచకుండుటయే కుజనాగ్రేసరు లనుటకు ముఖ్యకారణము. వేణుగోపాలశతకంబు రచించినవాడు బ్రాహ్మణాది చాతుర్వర్ణంబులలోనివాడు కాడు. సంకరజాతులనుకూడా నిందించుటనుబట్టి వారలలోనివాడు కానట్టు తోచుచున్నది. (ఇంకను) "కన్న నాలంజ కొడుకులు కవులుగాగ। వేదశాస్త్రంబులేడను విప్రులేడ" ననుచో

బ్రాహ్మణుండే మోయని దలంచుటకు సర్వధర్మజ్ఞులును భగవత్స్వరూపులు నగు బ్రాహ్మణుల కిట్టు యసూయాద్యవగుణంబులు గలుగునన రాదు.

భారతం - ఆది - ప్రథ.

క. పరనిందయు నాత్మగుణో। త్కర పరికీర్తనము జేయగా నుచితమె స
త్పురుషులకైనను నీక। చ్చెరువుగ నాకలతెరంగు జెప్పెద బ్రీతిన్.

క. పురుషుండు రెండుదెరగుల। ధరనుత్తముడనగ బరగు దానెయ్యెడలన్
బరుసములువలుకకునికిని। దురితంబులువోరయుపనులదొరగుటవలనన్.

భారతసార రత్నావళి.

క. అనహంకారమున ప్రా। ర్థనమును విషయముల బెద్దగులమియునుమే
లనఘా పరునిందించుటదనువర్తించుకొనుటనుచితము లెయ్యెడలన్.

ఈ మూడు పద్యములకు ముఖ్యతాత్పర్యము.

1. స్వస్థవము పరనిందయు సత్పురుషులకైన నుచితము కాదనియు. 2. పరుషవాక్యములు పలుకకుండుటయు దుష్కార్యముల నొదలుటయును ఇవి గలుగువాడే నుత్తముడనియును. 3. పరులను నిందించుటయు, తనను తా వర్ణించుకొనుటయు ఉచిచితము కాదని యును నిట్లు పరనింద నుత్తమునకు నిషేధంబై యుండగా సర్వోత్తముం డగు బ్రాహ్మణుండు యిట్లు రచించెనని చెప్పుటకు వలనుపడదు. ఇక గుణగ్రహణంబున కులనిరూపణంబు చేయవలయు నెట్లనిన—

భారతం. అర. ౪ ఆశ్వా.

వ. ప్రమాదవశంబున వర్ణసంకరంబైనప్పుడు వర్ణపరీక్షార్థం బుగా బ్రాహ్మణులకు వృత్తంబు వేరువేర స్వాయంభువుండైన మనువు సెప్పె. సత్యాదిగుణంబులు శూద్రునందు గలిగెనేని వాడు సచ్ఛూ ద్రుండగుగాని బ్రాహ్మణుండు గానేర్చనేయనియు, బ్రాహ్మణునందు లేనివాడు శూద్రుండనంబడు గావున వృత్తంబులు యుత్తమంబులు.

గీ. వృత్తవంతుడు వెండియు వివిధగతుల
వృత్తవంతుడు గానేర్చు వృత్తహీను
డైనవాడు విహీనుండ యంద్రుగాన
విత్తరక్షకు గడుమేలు వృత్తరక్ష.

ఇట్లు వర్ణనిరూపణ దెలియని సమయంబున గుణగ్రహణం బంగీకరించి తెలిసుకొనవలయునని చెప్పియున్నది.

వేమన శతకము.

గీ. ఎంత చదువుచదివి యెన్ని విన్ననుగాని
హీను డవగుణంబు మానలేడు
బొగ్గుపాలగడుగ బోవునా మలినంబు
విశ్వదాభిరామ వినుర వేమా.

గీ. హీను డెన్ని విద్యల నభ్యసించిన
ఘనుడు కాడు హీనజనుడె కాని
పరిమళములు గార్దభము మ్రోయ ఘనమౌనె
విశ్వదాభిరామ వినుర వేమా.

భర్తృహరియందు.

గీ. విద్యచే భూషితుండైన వెలయుచున్న
దోడరి వర్జింపనగుసుమీ దుర్జనుండు
చారుమాణిక్య భూషిత శస్తమస్తకంబైన
పన్నగము భయంకరముగాదే.

ఇట్లు గుణహీనుడు హీనుడనియు, ఎంతచదివినను విన్నను హీనుడు తన అవగుణంబులు మానలేడనియు, హీను డెన్నివిద్యల నభ్యసించినను ఘనుడు కాడనియును, విద్యచే భూషితుండైనను దుర్జనుని వర్జింపవలెననియు జెప్పియుండుటనుబట్టి ఇతడు హీనజాతివాడని గుణనిర్ణయంబున సిద్ధాంతము జేయుటయందే సంశయము లేదు. మీరు కోరిన ప్రశ్న ప్రమాణార్హము కాదు.

ప్రశ్న:— తాడిమళ్ళ రాజగోపాల శతకము.

సీ. పశులకాపరియైన పద్మనాభుని కేను బడతి నెటులనైతి బాల్యమునను
ఉట్టిబెట్టిన వెన్న గుట్టుగా మెక్కిన చోరుని కేల నే సుదతినైతి
గడెగడెకును వేసగాడంచు దెలియక వెఱ్ఱిగొల్లని కేల వెలదినైతి
నవతారమూర్తియంచాసనొందితిగాని దైత్యసంహారుడంచుదలపనైతి

అతివ! యీ వేళ రుక్మిణీపతిని గాంచి
విసిగియున్నది రమ్మని వేగిరంబ
తరుణి! నీ వేగి యిచటికి తాడిమళ్ళ
రాజగోపాలు దేగదే రాజవదన!

వెఱ్ఱిగొల్లడని ప్రయోగించుటయును, ఎంత మంచి గొల్లవాని కైనను వేపకాయంత వెఱ్ఱియుండునని కొందరు పలుకుచుందురు. ఈ యాదువంశ సంభూతులగు క్షత్రియులయం దట్లు నిరూపించుటకు కారణమున్నదా?

ఉ:- వెఱ్ఱి యనగా అపస్మారి నామము.

ఆంధ్ర నామ సంగ్రహము - మానవవర్గు.

సీ. గిటక పొట్టి కురచ గిట్టగుజ్జనగ వామనుడొప్పు జనున కపస్మారి పేళ్ళు
వెడగు వేదురు వెఱ్ఱి వీరడి వేరడి వెంగిలి వెంబర వి త్తనంగ....

అపస్మారి యను సంస్కృతశబ్దమునకు ఆంధ్రమున వెఱ్ఱి యని చెప్పబడును. అట్టి వెఱ్ఱి యీ చంద్రవంశ క్షత్రియకులము నవలంబించుక వచ్చినట్లు యే విధమైన ప్రమాణములు లేవు.

భాగవతం - నవమస్కంధము.

క. వినియువినవురణభీరువు। మనుజాధము నిదురబోతు మందుని నకటా!
నిను జక్రవర్తి జేసిన। వనజాసనుకంటె వెఱ్ఱివాడు్క్క గలడే. 1

ఇట్లు బ్రహ్మయును వెఱ్ఱివాడని జెప్పియున్నందున తదావయవ జనితులగు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రాదులకును వెఱ్ఱి నిర్ణయింపవలసినదేకదా!

భాగ. నవమ.

ఆ. అప్రకారమెఱిగి హరి విశ్వరూపుండు। వెఱ్ఱితపసి సేయు వేడబంబు
జక్కబెట్టుమనుచు జక్రంబుబంచిన।వచ్చెనదియు బ్రళయవహ్ని వగిది. 2

ద్వాదశీ వ్రతపారణకై వ్రతవిఘ్న నివారణంబుగా యుపోశనంబు చేసిన అంబరీషుని శపింపంబూనిన దూర్వాసుని గుఱించి శ్రీ విష్ణుమూర్తి చక్రంబుబంపుచూ వెఱ్ఱితపసియొక్క వేడబంబు కుదుర్చుమని చెప్పినట్లును.

భాగ. నవ.

క. గుట్టము గొనిపో బుద్ధుల । కుట్టడ మీ తాతయొద్దకు నీ తండ్రుల్
వెట్టులు నీరై రదె యీ । మిట్టునగంగాజలంబు మెలగ శుభమగున్ 3

సగరచక్రవర్తి మనుమడగు యంశుమంతుడనువానిం గూర్చి కపిలమహార్షి పలికినట్లును.

భాగ. సప్త.

క. నావంటి వెట్టివానిని । శ్రీవల్లభ నీవు శాస్తి జేసితి వేనిన్
గావరముమాని పెద్దల । త్రోవన జరుగుదురు బుద్ధితోడుత నీశా. 4

క. ఒక్కొకలోకము నేలుచు
నెక్కుడు గర్వమున నేమే యీశులమనుచున్
జొక్కు నను బోటి వెట్టులు
నిక్కము నీమహిమ దెలియ నేర రనంతా. 5

అని యింద్రుడు శ్రీకృష్ణునిగూర్చి పలికినట్లును.

భాగ. సప్త.

క. చొక్కపు రక్కసికులమున
పెక్కురు జనియించి రిందు పీతాంబరునిన్
నిక్కపు మక్కువగొలిచెడి
నెక్కడి సుతుగంటి దానవేశ్వర వెట్టిన్. 6

ఇట్లు హిరణ్యకశిపునితో చండామార్కు లాడినట్లును.

భాగ. నవ.

ఉ. బాలుడు వెట్టి బ్రాహ్మణుడు బ్రాహ్మణుకై వడి నుంట మాని భూ
పాలురతోడ భూరిబల భవ్యులతోడ భయంబుదక్కి క
య్యాలకు వచ్చినాడు మనయందిక బాపము లేదు లెండు లెం
డేల సహింప భూసురుని నేయుడు వ్రేయుడు గూల్పు డిమ్మహిన్. 7

భాగ. నవ.

సీ. వసుధపై బుట్టెడువార్త లాకర్ణించుకొరకునై రాముండు గూఢవృత్తి
నడురేయిదిరుగుచో నాగరజనులలోనొక్కడు దనసతి యొప్పకున్న

నొఱనింట గాపురంబున్న చంచలురాలి బాయంగలేక చేపట్ట నేమి
తా వెఱ్ఱియగు రామధరణీశ్వరుండనే బేల పొమ్మనుమాట బిట్టుపలుక
ఆ. నాలకించిమరియు నామాటచాఱుల। వలన జగములోన గలుగ దెలిసి
సీత నిద్రవోవ జెప్పక వాల్మీకి। పర్ణశాల బెట్టబనిచె రాత్రి. 8

భారతము. సభాపర్వం ౨ ఆశ్వా.

ఉ. ఇమ్మదివెఱ్ఱి వీని బరమేశ్వరుగా గొనియాడె ధర్మత
త్వమ్ములు పాండనేయులును దానునుగాని యెఱుంగరట్టె సా
మమ్ముల నెల్లవారి నవమాన్యులఁజేసె నమాన్యుడంచు రూ
ఢమ్ముగ భీష్మజూచి బుంగర్విత డిట్లనిబల్కె నల్కతోన్. 9

ఇట్లు భీష్మునిగూర్చి శిశుపాలుఁడు పలికినట్లును.

భార. అర. ౪ ఆశ్వా.

గీ. ధరణి మరియును బెక్కువిధంబులందు
బ్రహ్మవిదులయిన బ్రాహ్మణప్రభుల మహిమ
వినమె యెరిగి యెఱింగి సద్వినుతచరిత
కొరవిగొని వెఱ్ఱివై తల గోకికొనగ. 10

ఇట్లు కౌశికుడను బ్రాహ్మణునితో పతివ్రతాతిలకము పలికినట్లును.

భార. ఆది. ౭ ఆశ్వా.

గీ. వెడగ యిట్టిపాటు వెరపించుటలును మా
యలును నేమిజేయు నస్త్రవిదుల
బెక్కులయ్యు నీ విభీషికల్ నుఱుఁవులు
విరియునట్టు లిందు విరియు జూవె. 11

ఇట్లు అంగారపర్ణునిగూర్చి అర్జునుండు పలికినట్లును.

భార. సభా. తృతీయ.

చ. కడుకొని ధర్మతత్త్వ మెఱుగంగ నశక్యము ధర్మబాహ్యుని
న్నొడబడ నిష్టుడై కలిపి యుత్తములుండగ వాసుదేవుడన్
జడునకు బూజయిమ్మని విచారవిదూరుడు భీష్ముడెంతయున్
వెడగుదనంబునం బనిచె వృద్ధులబుద్ధులు సంచలింపవే. 12

ఇట్లు భీష్మునిగూర్చి శిశుపాలుడు పలికినట్లును.

భార. నలచరిత్ర 163 పద్యం.

గీ. అడవి దన్ను బాసి యరిగిన నలిగి కా
కున్న నిట్లుచేయు నువిద గడగె
యేని నిట్లుకూర్తు రింతులు మాకు
విశ్వసించువాడు వెడగు లెందు. 13

వేమనశతకము.

గీ. చచ్చెననుచు చాల జావుకు వగచెదు
దీననరుల వెఱ్ఱి దెలుపరాదు
ప్రాణమునకు మృత్యుబంధంబు లుండునా
విశ్వదాభిరామ వినుర వేమా. 14

గీ. బ్రహ్మమేడ ననుచు పలుమారునాడేరు
వెఱ్ఱిమూర్ఖజనుల విధముజూడ
బ్రహ్మ మన్నిటందు పరిపూర్ణమైయుండు
విశ్వదాభిరామ వినుర వేమా. 15

గీ. ఎవ్వ డెఱుగకుండు నెప్పుడుపోవునో
పోవు జీవమట్లు బొందివిడచి
యంతమాత్రమునకు నపకీర్తి యెఱుగక
విరగబడు నరుండు వెఱ్ఱివేమా. 16

గీ. బ్రతుకు నిత్యమనుచు పదరుచు
వగమీర విఱ్ఱవీగువారు వెఱ్ఱివారు
ప్రాణులెల్ల యమునిబారి గొఱ్ఱెలుసుమీ
విశ్వదాభిరామ వినుర వేమా. 17

గీ. తాము గడనసేయు ధనము తమదియని
నమ్మియుండు వెట్టినరులు భువిని
తాము నొకరికిచ్చు ధన మింతియెగాక
కడమది తన కేలగలుగు వేమా. 18

గీ. ఆకులన్ని దిన్న మేకపోతులెల్ల
గాకపోయెనయ్య గాయసిద్ధి
లోకులెల్ల వెట్టిపోకిళ్లు పోవరు
విశ్వదాభిరామ వినురవేమా. 19

గీ. శివు ౧ ఘనుడటంచు శిలలకు మొక్కెడి
వెట్టిజీవులార వెతలు విడుడి
జీవులందెగాక శిలల యేమున్నది
విశ్వదాభిరామ వినురవేమా. 20

గీ. కంటి కంటి మనుచు కర్మాధికారంబు
వెంటబెట్టి చెడును వెట్టినరుడు
బట్టబైటి ముక్తి బాటించిచూడరో
విశ్వదాభిరామ వినురవేమా. 21

భాగ. దశ.

గీ, భూరి విజ్ఞానవిదులగు నారదాది
నిర్మలాత్ములకైన వర్ణింపరాని
హరికథామృత పానంబునందు విసివి
యొల్లననువాడె పో వెట్టిగొల్ల డనఘా. 22

1 పద్యములో బ్రహ్మకు వెట్టివున్నట్లును.
2 పద్యములో తపసికి వెట్టివున్నట్లును.
3 పద్యములో సాగరులకు వెట్టివున్నట్లును.
4-5 పద్యములలో ఇంద్రునకు వెట్టివున్నట్లును.
6 పద్యములో ప్రహ్లాదునకు వెట్టివున్నట్లును.
7 పద్యములో బ్రాహ్మణునకు వెట్టివున్నట్లును.
8 పద్యములో శ్రీరామునకు వెట్టివున్నట్లును.
9-12 పద్యములలో భీష్మాచార్యునకు వెట్టివున్నట్లును.
11 పద్యములో అంగారపర్ణునకు వెట్టివున్నట్లును.

ఇట్లు అనేక చోటుల వెట్టిశబ్ద ప్రయోగములు గలవు.

స్త్రీల నమ్మువారును, చావుకు వగచెడువారును, బ్రహ్మమేడ ననువారును, అపకీర్తి నెఱుగక విరగబడు నరులును, బ్రతుకు నిత్యమని విఱ్ఱవీగువారును, తాము గడనసేయు ధనము తమదియని నమ్మియుండు నరులును, శివుడని శిలలకు నమస్కరించువారును వెఱ్ఱులే యని చెప్పియుండుటనుబట్టి పై కారణములు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రాది సర్వవర్ణముల యందు కలిగియుండుటను బట్టి అందరు వెఱ్ఱులనియే నిర్ణయింపబడెను. వెఱ్ఱి శబ్దము ఒక కులము నందుగాని, ఒక వ్యక్తియందుగాని స్థిరత్వము కలదిగాదు.

ఎందువల్ల ననగా — 22 పద్యము.

గీ. భూరివిజ్ఞానవిదులగు నారదాది
నిర్మలాత్ములకైన వర్ణింపరాని
హరికథామృత పానంబునందు విసివి
యొల్లననువాడెపో వెఱ్ఱిగొల్ల డనఘా!

యీ పద్యములో (వాడు) అను సర్వనామమునకు గొల్లడు అనునది విశేషణమును, వెఱ్ఱి అనునది క్రియావిశేషణమును అయియున్నది. గొల్లడు అనగా గోవుల కాయువాడనియును. వెఱ్ఱి యనగా జ్ఞాన హీనుడనియును అర్థము. కాబట్టి బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో నెవడైతే హరికథామృతపాన మొల్లననునో వాడు – పశువుల కాయువాడును, వెఱ్ఱివాడును అగును. అనగా కేవలము జ్ఞానహీనుడని తాత్పర్యము. ఇందునుబట్టిచూడగా ప్రతి వర్ణమందును జ్ఞానులును, జ్ఞానహీనులును గలరు. కనుక వెఱ్ఱివారలును, వెఱ్ఱి లేనివారలును బ్రాహ్మణాది సర్వవర్ణములయందును గలరు. కావున వెఱ్ఱిగొల్ల యను శబ్దంబు బ్రాహ్మణాది అన్నివర్ణములవారికి చెల్లునని యెఱుంగవలయును.

మరిన్ని యెంత మంచి గొల్లవానికైనను వేపకాయంత వెఱ్ఱి వుండునని వాడుక గలుగుటకు కారణమేమని మీరడిగితిరి. అందుకు వెఱ్ఱికి పరిమాణము నిర్ణయించువాని వెఱ్ఱిని గణింపజాలను. ఇట్టి దుర్వాడుకలు కులమాత్సర్యములచే కల్పింపబడినవి. ఇట్టివి ప్రతి

కులమువారికి ననేకరీతుల గలవు. అవి యొకరినొకరు దెగడినప్పుడు కుప్పలు తెప్పలుగా బయలుదేరును. అవి యిప్పు డిక్కడ దెలుపుట యనావశ్యకమగుటచే విరమించితి. ఇదియునుగాక పద్యములయందు కూడా ప్రకటించియున్నారు. కొన్ని యీదిగువను కనుపరచెదను.

దాసు శ్రీరాములుగారు రచించిన తెలుగునాడను గ్రంథమందు.

మ. నిజమో కల్లయొ నేనెఱుంగను నఘుల్ ♦ నిందింత్రునిచ్చల్ నియో
గిజనశ్రేణిని కుక్కగుంపనుచు శం ♦ కింపంగ మాధ్వద్విజో
ప్రజలం గాకులటంచు వైదికులు రా ♦ బందుల్గదాయంచు బే
రజమాడక్ దొరకొంద్రు దీనికొక మే ♦ రం గారణంబుండెడిన్.

మనుచరిత్ర.

మ. అకలంకొషధ సత్వముస్వలియు మాయామద్వార కావంతి కా
శి కురుక్షేత్ర గయా ప్రయాగముల నే సేవింప కుద్దండ గం
డక వేదండ వరాహావాహ రిపు ఖడ్గ వ్యాఘ్రము మిమ్మంచుకొం
డకు రాజెల్లునె బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ కదా శ్రోత్రియుల్.

ఇట్లనేకములు గలవు గావున వెట్టిశబ్దము జ్ఞానహీనతను దెలుపుటకు బదులుగా వాడుకచేయబడినది. అట్టి వెట్టి బ్రహ్మాది సర్వజాతులయందును గలదు. గొల్లలను వృత్తినామముగల చంద్రవంశక్షత్రియులకు మాత్రమే కలదనియు తక్కినవారికి వెట్టిలేదనియు చెప్పరాదు. అట్లు చెప్పువాడే వెట్టివాడని స్పష్టముగా యెఱుంగవలయును.

ప్ర:— ఇప్పుడీ చంద్రవంశక్షత్రియులను గొల్లలని చెప్పవచ్చునా? చెప్పకూడదా?

ఉ:— అట్లు చెప్పకూడదు. ఏలననగా వీరియొక్క వృత్తినామము చెప్పవలసివచ్చినప్పుడు మాత్రము గొల్లలనియును, కులము చెప్పవలసివచ్చినప్పుడు చంద్రవంశక్షత్రియు లనియును ద్వాపరయుగమందు శ్రీకృష్ణార్జునులు చెప్పియున్నట్లు స్పష్టముగా మీకు యిదివరకే వివరించితిని. ఇప్పుడు కులము చెప్పవలసివచ్చినప్పుడు వృత్తినామ మెట్లు చెప్పవచ్చును?

ఈ కలియుగమం దేయేవర్ణములకు యేర్పడియుండిన వృత్తు లాయా వర్ణములవారు నడుచుకొనక అన్యోన్యవృత్తు లవలంబించి జీవించుచున్నారు. కనుక వృత్తినామమున కులనామము దెలియబడదు.

వడ్లబత్తుడు అనినయెడల వడ్రంగము తురకలును, శూద్రులును చేయుచున్నారు. వారల వడ్రబత్తులనిన విశ్వబ్రాహ్మణ వర్ణమును సూచించుచున్నది. శూద్రాది యితరజాతులును బ్రాహ్మణులును వర్తకము చేయుచున్నారు. వారికి వృత్తినామము వర్తకు లందురు. అట్టివారలను వర్తకులనిన వైశ్యవృత్తినిబట్టి వైశ్యులని అర్థమగును. కావున వృత్తులు మానుటనుబట్టి ప్రధానవర్ణమునే స్పష్టముగా జెప్ప వలయును. ఈ చంద్రవంశక్షత్రియులను వృత్తినామముగు గొల్లలని చెప్పిన యేతద్వృత్తులు సర్వవర్ణు లాచరించుటనుబట్టియు వృత్తినామ మున అన్నివర్ణములవారు గొల్లలనబడుదురు. అందునబట్టి వర్ణ నిర్ణ యము బోధపడదు గనుక క్షత్రియులనియె చెప్పవలయును.

శ్రీకృష్ణ గురుపరబ్రహ్మార్పణమస్తు.

రాజవంశప్రదీపిక సంపూర్ణము.





జానకీరాం ప్రెస్, తెనాలి.

"రాజవంశ ప్రదీపిక" గ్రంథకర్త : బత్తుల లక్ష్మయ్యగారు (దొడ్లేరు).

గ్రంథము వలయువారు, యీ దిగున అడ్రసునకు పోస్టుఖర్చులతో సహా మొత్తముసొమ్ము మనియార్డరు చేసిగాని, లేక వి. పి. పి. గా గాని తెప్పించుకొనవచ్చును. వెల రు. 2_4_0

పోస్టుఖర్చులు 0_12_0

1. వలురాజ చరిత్ర (ద్విపద కావ్యము)
2. యాదవధర్మ దీపిక
3. యదు శ్రీ

ఈ మూడు గ్రంథములు ముద్రణకు సిద్ధముచేయబడు చున్నవి.

ఇట్లు,

ఆరాధ్యుల పిచ్చయ్య

యడవూరు.

కూచిపూడి పోస్టు,

తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా.